విశ్వసాహిత్యమాల ౩౨.

# బలిదాన్.

లియోనిద్ లియోనోవ్

అనువాదం :

మహీధర జగన్మోహన్‌రావు.



విశ్వసాహిత్యమాల,
రాజమండ్రి.

Invasion అనే రష్యన్ నాటకానికి యిది అనువాదం.

అక్టోబరు 1946

అవంతీ ప్రెస్ - రాజమండ్రి.

వెల ఒకరూపాయి.

# సంపాదకీయం.

1935 లో ప్రారంభించబడినది మొదలు 1940 వరకు మొత్తంమీద విశ్వసాహిత్యమాలద్వారా 30 పుస్తకముల వరకూ ఆంధ్రమహాజనుల కందీయ గలిగేము. సంపాదకులు యుద్ధకాలంలో జైలుకుపోవడంతో గ్రంధప్రకటన తాత్కాలికంగా నిలిచిపోయింది. 1942 కడపటి భాగంలో తిరిగి ప్రారంభించి 8 పుస్తకాలు ప్రకటించగలిగినాం. ఒక సంవత్సరం గడవకముందే కాగితం కరువువల్లా, ఇతర రాజకీయ కారణాలవల్లా పుస్తకప్రచురణ నిలుపవలసి వచ్చింది. 1945 నుంచీ పుస్తకప్రకటనకై విశ్వప్రయత్నాలు చేస్తున్నాం. కాని, అనివార్య కారణాలవల్ల యింతవరకూ నెరవేరలేదు.

ప్రస్తుతం 'బలిదాన్' అను యీ సుప్రసిద్ధనాటకంతో 'విశ్వసాహిత్యమాల' ఆంధ్రమహాజనుల యెదుట నిలబడింది. ఇంకనుంచి సక్రమంగా, నిరంతరాయంగా చక్కని గ్రంధాల నేర్చి, మాలలోకూర్చి, ఆంధ్రసాహితీపీఠాన వుంచ గలుగుతామని ఆశిస్తున్నాం. ఇందుకు ప్రజల తోడ్పాటు యెంతేని అవసరమని వేరచెప్పాలా?

పోతే, మరొక్క విషయం. ఇదివరలో విశ్వసాహిత్యమాలలో వెలువడి వాటిలో రాజకీయ సిద్ధాంతాలమీదనే

యెక్కువ పుస్తకాలున్నాయి. ముందునుంచి 'విశ్వసాహిత్య మాల' ను యెక్కువ సార్థకంచేస్తూ, విశ్వసాహిత్యంలోని సుప్రసిద్ధమైన, అభ్యుదయకర సాహిత్యాన్నెక్కువగా ప్రకటించ పూనుకుంటాం. కథలు, నవలలు, నాటకములు-వీటితోబాటు మహాకవుల జీవితచరిత్రలు కూడ నూతనపథక్కీలో వ్రాయించి, ప్రకటిస్తాము. పిన్నలకు పనికివచ్చే సాహిత్యం ఇంగ్లీషులోనేగాక సోవియటులోని వివిధభాషలలో విరివిగా తయారవుతూంది. ఈపుస్తకాలు మనదేశీయుల పరిణామ దశలో పెద్దవాళ్లకు కూడ వుపయోగిస్తాయి. పరిణామవాదం, మానవచరిత్ర, ప్రకృతితోమానవుని పోరాటం, శాస్త్రీయ సిద్ధాంతాలు, యివన్నీ సామాన్య ప్రజలకు తెలిసేటట్లుగా సులభశైలిలో, పారిభాషిక పదాలంతగా ఉపయోగించకుండా వ్రాయించి, ప్రకటించదలచేము. త్వరలోనే యీ పంథాలో వ్రాయబడిన పుస్తకాలను మీ ముందుంచగలమని విశ్వసిస్తున్నాము.

ఆంధ్రప్రజానీకం, లైబ్రరీలు యిదివరలో వలెనే మాగ్రంథమండలి నాదరించి, మా ఉద్యమానికి చేయూత నొసంగ గోరుతూన్నాము. వందనపూర్వకంగా,

రాజమండ్రి.
30-10-46.

ఇట్లు,
మహీధర జగన్మోహన్‌రావు,
సంపాదకులు.

# కథా సందర్భం

రష్యాలోని ఒక చిన్నపట్టణంలో డాక్టర్ తలానోవ్ చాలాకాలంగా వుంటున్నాడు. భార్య అన్నా. వీరికి ఫియోడోర్ అనే కొడుకూ, ఓల్గా అనే కూతురూ. 1917 లో బోల్షివిక్ విప్లవం వచ్చేక డాక్టర్ తలానోవ్ పట్టణసోవియట్ ఆధ్వర్యాన ఒక హాస్పిటల్లో పనిచేస్తుండేవాడు. ఒకడే కొడు కగుటవల్ల ఫియోడోర్ గారంగా పెరిగి చెడ్డాడు. ఒక యువతిని ప్రేమించి, కుటుంబంతో కలహించి వేరై, చివరకి ఆమెతోకూడ తగు వులుపడి, ఆయువతిని రివాల్వరుతో కాలుస్తాడు. అందులకై విచారించి మూడేళ్ల జైలుశిక్ష విధిస్తారు, ప్రవాసం పంపుతారు.

అదే పట్టణంలో జారుచక్రవర్తుల కాలంలో పెద్ద వ్యాపారిగావుండే ఫెయూనిన్, సోవియట్ ప్రభుత్వంమీద కుట్రలుపన్ని, కుమారునితో కూడ ప్రవాసం పంపబడతాడు. ప్రవాసంలో కుమారుడు చనిపోతాడు. తాను చాల సంవత్సరాలు ప్రవాసంలో వుండి, సోవియటు ప్రభుత్వం అంటే ధనికుల కుండే ఈర్ష్యాభావంతో, వ్యతిరేకంగా పనిచేయడానికి అదునువేచి యుంటాడు.

ఇంతలో 1941 జూన్ 22న జర్మన్‌లు సోవియటుపై దాడి వెడలుతారు. దేశం అంతటా గందరగోళం. ఎర్రసైన్యం తిరోగమనం చేయవలసి వచ్చింది. జర్మన్ బలాలు మాస్కోపై విరుచుకు పడు తున్నాయి. ఆక్రమిత ప్రాంతాల్లో జర్మనులు చేసే ఘాతుకకృత్యాల కంతులేదు. ఆయుధం పట్టగల రష్యనులంతా యెర్రసైన్యంలోనో, గోరిల్లాలుగనో యుద్ధాలు చేస్తున్నారు. వృద్ధులు, బాలురు, స్త్రీలుకూడా

బ్రహ్మాండమైన త్యాగాలుచేసి మాతృదేశరక్షణకై నిలబడతారు. రెండో వైపున కొద్దిమంది దేశద్రోహులు, స్వార్థపరులు, బైటపడి జర్మన్‌లకు 'క్విస్లింగులు' గా తయారయ్యేరు. యేకారణాల వల్లగానీ, సోవియటు ప్రభుత్వంమీద అసంతృప్తి వున్నవాళ్ళని రెచ్చగొట్టి, సోవియటు వ్యతిరేక సంఘటన నిర్మించ ప్రయత్నాలు సాగుతున్నాయి. 1917 విప్లవ కాలంలో విదేశాలకి పారిపోయిన పెట్టుబడిదారులు, వారి సంతతివారు కొందరు జర్మన్లకు మద్దతుగా దేశంలో ప్రవేశించారు. మొస్పాల్‌స్కీ అట్టివాడే.

ఫెయోనిన్, జర్మనుల సాయంతో మాస్కో పతనం కాగానే అక్కడ పెద్దవ్యాపారాన్ని సాగిద్దామనే ఆశతో కలలు కంటుంటాడు. ఆతడు జర్మనులకంటె ముందుగానే పట్టణంలో ప్రవేశిస్తాడు. డాక్టరు యింట్లో తిష్ఠవేస్తాడు. కొకోరిష్కిన్‌లాంటి నీచవ్యక్తులాతనికి సాయం వస్తారు.

ఫియోడోర్ ఆసమయానికే జైలునుంచి విడుదలై వచ్చి, ఏమీ తోచక తిరుగుతూంటాడు. అతనికీ సోవియటుప్రభుత్వంపై అంతగా ప్రేమలేదు. తనకు అన్యాయం జరిగిందని కోపం కూడాను. తండ్రి యింటికి వచ్చి, కుటుంబాన్నంతనూ ఎత్తిపొడుస్తూ మాట్లాడుతాడు. పట్టణసోవియటు చైర్మను కొలెస్నికోవ్. వీరిద్దరూ బాల్యపరిచయులు. ఆతనితో సంభాషించడంలోకూడ అతనిలోని అసంతృప్తి వెల్లడౌతుంది.

డాక్టర్ తలానోవ్, కుమారుని ప్రవర్తనకు అసంతృప్తి చెంది, అతనిని వెళ్ళిపొమ్మంటాడు. దిక్కూ దారీ తెలియక తిరిగి తిరిగి, వికల మనస్కుడై ఫియోడోర్ ఆరాత్రే యింటికివచ్చి, అక్కడ జర్మన్లచే అమానుషంగా హింసించబడిన 'అనిస్కా' అనే బాలికను చూస్తాడు. అతనిలో 'ద్వేషాగ్ని' రగుల్కొంటుంది. గాయం తగిలివున్న

కొాలెస్నికోవ్‌తో అక్కడనే తిరిగి సంభాషించి, తననుకూడా గెరిల్లాల్లో చేర్చుకోమంటాడు. కొాలెస్నికోవ్ నిరాకరిస్తాడు. ఫియోడోర్ బైటికి పోయి, దారిలోనే, ఫెయూనిన్ విందుకు వస్తూన్న జర్మన్ కమాండెంటును, మరో ఆరుగురు ఆఫీసర్లనూ కాల్చి పారేస్తాడు.

అరెస్టుచేసి హింసించి, ఉరిశిక్ష విధిస్తారు, జర్మన్ లీతనికి. ఇతనితోబాటు నిర్బంధంలోవున్న గెరిల్లాలు యీతనిని తమ పార్టీ సభ్యునిగా చేర్చుకుంటారు. అతన్నీ, మరిద్దర్నీ ఉరికి తీసికొని పోతారు. ఈలోగా గెరిల్లాలు, కొాలెస్నికోవ్ నాయకత్వాన్న దాడిచేసి, ఖైదీలందర్నీ విడిపించుకు పోతారు. జర్మనులను చావుదెబ్బలు కొడుతూ, వాళ్ళసైన్యాల్ని చీకాకుచేస్తూ, సప్లై మార్గాల్ని నాశనం చేస్తుంటారు. జయించేమనుకొన్న జర్మన్‌లకు మృత్యుదేవత ప్రత్యక్షంగా కనిపిస్తూంటుంది. సోవియట్ శక్తి అజేయమని మొదటిదశలోనే స్పష్టమైపోతుంది. రక్తపుటేరుల్లో ముంచినా 'ప్రజాశక్తి' ని అణిచివేయలేరని ఫాసిస్టులకూ, వారి రక్తబంధువులైన సామ్రాజ్యవాదులకూ. వారితొత్తులకూ చక్కని బుద్ధిగరపేదిగా వుంటుందీ నాటకరాజం.

చాల చక్కని ప్లాటు. ప్రతి ఘట్టంలోనూ "ముందేం జరుగుతుందా" అనే ఆదుర్దాను చదువరుల్లో కలిగించండంలో నాటకర్త కృతకృత్యుడైనాడు. ప్రతి ఘట్టంలోనూ హాస్యం చాలమృదువుగా జొప్పించబడింది. రష్యనులు హాస్యరసపోషణలో అందెవేసినవారు. ఇంతటి 'సీసియస్' నాటకంలోకూడా, బీభత్సరసం తాండవమాడే ఘట్టాలతోబాటుగా హాస్యరసాన్ని చిలికించి, చదువరులను నవ్విస్తాడు, గ్రంథకారుడు. మనుష్యప్రకృతి నర్థం చేసుకోడానికీ, ప్రత్యక్షంగా చూడ్డానికీ, యిట్టి నాటకాలు చాల అవసరం. మానవుడెంత త్యాగం చెయ్యగలడో, యెంత నీచస్వార్థానికి దిగగలడో యిది చక్కగా ప్రదర్శిస్తుంది.

'సోవియటు యుద్ధం' 'ప్రజాయుద్ధం' అంటే పరిహాసం చేసేవారికి యిట్టి నాటకాలు 'కనువిప్పు' గా వుండగలవు.

మరొక్కమాట. తెలుగులో ఎన్నో నాటకాలు వెలువడుతున్నాయి. కాని ఆదర్శంగా చెప్పుకోతగ్గది మృగ్యం. కథావస్తువో, పాత్రపోషణో, కళో, సంభాషణలో.—ఏదో ఒకటి రెండు ముఖ్యాంగాలు వికృతంగా లేని నాటకాలు తెలుగులో చూపలేమంటే 'ఆంధ్రాభిమానులు' కోపపడరని తలుస్తా. అభ్యుదయకరవాఙ్మయంలోకూడా మానవజీవితాన్ని యాంత్రికంగా (machanical) చిత్రించడం, అందులో చిత్రించదగిన విషయాల్ని యెంచుకోవడంలో అభిజ్ఞత లేకుండడం చూడగలం.

పరభాషల్లోంచి, యిట్టి అమూల్యగ్రంథాల్ని మనతరంవారు జీర్ణించుకుంటే, భాషాభివృద్ధికి హేతువుకాగలదు.

ఇక చదివి చూడండి.

# పాత్రలు

| | | |
|---|---|---|
| తలానోవ్, ఇవాన్ టిఖోనోవిచ్ | .... | డాక్టరు |
| అన్నా నికోలయేవ్నా | ... | డాక్టరుభార్య |
| ఫియోడోర్ | .... | వీరికుమారుడు; ఫెద్యా, ఫెడెంకాఅని ముద్దుపేర్లు |
| ఓల్గా | .... | వీరికుమార్తె |
| దేమిడ్యేవ్నా | .... | ముసలిపనికత్తె. కుటుంబంలో ఒకతె |
| అనిస్కా | .... | ఈమె మనుమరాలు. |
| కొలెస్నికోవ్ | .... | జిల్లా సోవియట్ఎగ్జిక్యూటివ్ కమిటీ చైర్మన్. |
| ఫైయూనిన్, నికోలాయ్ సెర్గియేవిచ్ | .... | మృతులలోనుండి లేచి వచ్చినవాడు. |
| కొకోరిష్కిన్, సెమ్యాన్ ఇలిచ్ | .... | ఒకసేవకుడు, మూర్ఖుడు ఎప్పటికామాట చెప్పే ద్రోహబుద్ధి |
| యెగొరోవ్, తాతారోవ్ | | ఆంద్రీదళంలోనివారు, గోరిల్లాలు |
| మొస్సాల్స్కీ ప్రవాసంలో పెరిగిన పూర్వపురష్యన్ పౌరుడు. | | |
| పీబ్బెల్ | .... | జర్మన్‌కమాండరు |
| స్పెర్రీ | .... | గెస్టాపో ముఖ్యుడు |
| కున్ట్జ్ | .... | అడ్జుటాంటు |
| ఒక వృద్ధుడు | | |

ప్రొకోఫీ .... ఒకబాలుడు

మరొక కుర్రవాడు, 13 సం॥లు వయస్సు; పెద్ద మిలిటరీకోటుతో.

గొరిల్లాయోధులు, ఆఫీసర్లు, సైనికునికోటుతొడుక్కున్న గొరిల్లాస్త్రీ, సేవకుడు, ఒకపిచ్చివాడు, కాన్వాయ్‌తోకూడావున్న సోల్జర్లు, యితరులు.

స్థలం :

ఆక్రమిత రష్యాలోని ఒక చిన్నపట్టణం.

కాలం :

1941 శీతాకాలం. మాస్కోపై జర్మన్‌సైన్యాలు ముట్టడిస్తూన్నసమయం.

---

# ఒకటో అంకం

పురాతనమైన రాతికొంప. బహుశా నలభై యాభై యేళ్ళక్రిందట, డాక్టరు తలానోవ్ ప్రాక్టీసు ప్రారంభించినరోజుల్లో దీన్ని కట్టివుండవచ్చు.డాక్టరు గది. సరంబీ అట్టే ఎత్తుగాలేదు. రెండుద్వారాలు గదిలోంచి వున్నాయి. రెక్కలతలుపులు. తలుపుల్లో పైసగభాగం మబ్బుగావుండే గాజుపలక లమర్చివుంటాయి. ఒకద్వారం హాలులోకి, మరొకటి వెనకగదిలోకి తెరచు కొంటాయి. ఒకమూల మంచం - పరుపు, తెరవెనుక చిన్న టేబిల్, అలం కరణ సామగ్రి. వీటికి యజమానురాలు ఒకయువతి అని తెలుసుకోవచ్చు. గదంతా ఫ్రేముల్లోఅమర్చబడిన ఎన్నోఫొటోలు; అందులో పునదృష్టి నాకర్షించేది నావికుని దుస్తుల్లోవున్న పొడుగాటి సన్నని యువకుని పెద్ద చిత్రం. గదిలోంచి పెద్దకిటికీ వీధులోకివుంటుంది. కిటికీలోంచి దూరంగా మెట్టమీది చర్చిశిఖరాలు కనిపిస్తూంటాయి. చీకటిపడుతూంది. అన్నా నికోలయేవ్నా టేబిల్‌దగ్గరకూర్చొని, జాబు వ్రాసుకుంటూంటుంది. దేమిడ్ యేవ్నా అదేటేబిల్‌పైన భోజనపదార్థాలు అమరుస్తూంటుంది.

దేమిడ్‌యేవ్నా : బొద్దింకలన్నీ వంటయిల్లు వదలిపెట్టి రాత్రే పారిపోయి నాయి. (అన్నా నికోలయేవ్నా అయిష్టతను సూచిస్తుంది.) వాళ్ళంతా జర్మన్‌లనుంచి పరుగెట్టిపోతున్నారు. బైట ఏమి జరుగుతూందో నీవు వింటేనా!

అన్నా : అక్కర్లేని గొడవలేదు. మూటలు మోసుకొస్తూనే వుంటావు. బైటికెళ్ళినప్పుడల్లా. వడ్లగింజలో బియ్యపుగింజనో, వేరుమీద గోరుమొలిచిందనో చెప్పకపోతే ప్రళయంవస్తుందన్నమాటే!

(ఎవరో తలుపుకొడతారు)

దేమిడ్‌యేవ్నా : రాండి లోపలికి. ఈవేళప్పుడు ఎవరేమిటి?

కొకోరిష్కిన్ : (తలుపుతోసి, సందులోంచిచూస్తూ) నేను. క్షమించండి.

దయచేసి.- నేను కొకోరిష్కిన్‌ని. ఎక్కడా కనిపించలేదు డాక్టరుగారు. ఊరంతా వెతికినా.

అన్నా: ఈరోజు ఆపరేషన్ లున్నాయి. త్వరలోనేవస్తారు. రాండి. కొంచెంసేపు కూర్చోండి.

కొకోరిష్కిన్: మీరు శ్రమతీసికోవద్దు. నేనుబైటనే కొంచెంసేపు కని పెట్టుకుంటానులేండి. (తలుపుమూస్తాడు.)

అన్నా: కొకోరిష్కిన్! మూర్ఖుడు!

(ఆమె బైటికివెళ్ళి, అతన్ని లోపలికి తీసుకువస్తుంది - ఆతని వయస్సెంతో చెప్పలేము. కాని షార్టుసైట్ వుందనిమాత్రం చెప్పగలం. ఓవర్‌కోటు ధరించేడు. ఈకోటు అతను కుట్టించుకొన్నదిగాదని చూడగానే తెలుస్తుంది.)

కొకోరిష్కిన్: అయితే నన్ను కోటుతోనే ఉండడానికనుమతి యివ్వండి, దయచేసి. నాదుస్తులు అనుకూలంగాలేవు. ఏదో ముఖ్యమైన పనివుండివచ్చేను. కొన్నికాగితాలుసంతకంకావాల్సి.

దేమిడ్‌యేవ్నా: ఏదో చోటుచూసుకొని కూర్చో. మాట్లాడకండా. ఫియోడోర్‌కి ఉత్తరం రాస్తున్నాములే. (కొకోరిష్కిన్ కూర్చుని దగ్గుతాడు. మోకాళ్ళమీద రికార్డుకేసుపెట్టుకొని నిశ్శబ్దంగా వుంటాడు.) వాళ్ళందరికీ మతులుపోయేయనుకుంటావు, నువ్వు చూస్తే. బొరోవ్‌కోవ్ యింటెడుసామానూ తీసుకుపోతున్నాడు. బండినిండా సామానులూ, పైన అవ్వకూర్చుని * సామోవర్ కాస్తూంది! ప్రతివాడూ వెళ్ళిపోతున్నాడు. నువ్వు చూళ్లేదూ?

---

మధ్యగా యిత్తడిగొట్టం, చుట్టూ బొగ్గులుమండుతూండేయినుపకుంపటి. మరిగిననీరు తీసుకునేందుకు అడుగున కుళాయివుండే నీరుమరిగించుకొనే సాధనం.

అన్నా : ఎవ్వరూ వెళ్ళడంలేదు, ఎక్కడికీను. అడుగో, కొకోరిష్కిన్‌ను అడుగు, అతనికంతా తెలుస్తుంది.

కొకోరిష్కిన్ : (నగంలేస్తూ) యదార్థమే! అంతావెళ్ళిపోతున్నారు.

అన్నా : కోలెస్నికోవ్ యిప్పుడేకదూ టెలిఫోన్‌లో మాట్లాడుతా. దీన్ని గురించి అతదేమీ చెప్పనేలేదు. జిల్లా ఎగ్జిక్యూటివుకమిటీ చైర్‌మన్ కనుక అతనికీ సంగతంతా తెలుస్తుంది. అల్లాంటిదేమీ వుండివుండదు.

కొకోరిష్కిన్ : అతడూ వెళ్ళిపోతూన్నాడు!

అన్నా : బాగుంది. వాళ్ళందర్నీ వెళ్ళిపోనియ్యి. అయితే. (రాస్తున్న జాబుమీదకువంగి) దేమిడ్‌యేవ్నా! ఊరికేనణక్క ఊరుకో.

దేమిడ్‌యేవ్నా : సణగడం నాకోసంగాదు, మరి....కాని, సామెత చెపుతారుగదూ, దీపంఉండగానే యిల్లుచక్కబెట్టుకోమని. (కొకోరిష్కిన్‌తో) అనిస్కాచొక్కాలు మూడు పట్టుకుపోయేరు, వాళ్లు. అంతదాకాఎందుకూ? వెధవది, పాతరిబ్బనుముక్క, అదికూడ ఆ దొంగవెధవలు ఒదిలిపెట్టలేదు!

కొకోరిష్కిన్ : అనిస్కాయెవరు?

దేమిడ్‌యేవ్నా : ఎరగవూ? నా మనమరాలు. లోంచ్యేవోలో ఉండేవారు, వాళ్ళంతా. వాళ్లు నాశనంగానూ, ఆ జర్మనులు ఆక్రమించినతర్వాత, యీ పాతికమైళ్ళూ కాలినడకనుపడి, పరుగెత్తుకొచ్చింది. ఆ పీనుగులతో వేగడం చాలకష్టంగావుంది. (కొకోరిష్కిన్ సానుభూతిగా "ప్చ్" అని, ఉదాసీనంగా కూర్చుంటాడు.) బిడ్డకి వేడి టీ యిచ్చేం, ఆపళంగా, ఏమిస్తేంనాయనా, చైతన్యమేరాలేదు, చాలాసేపటివరకూ. నాచిట్టితల్లి, సుడిగాడ్పుకి చిగురుటాకులా అల్లాడిపోయింది. ఇప్పుడే లోపలికి పంపించేను

పంచదార తేడానికి. దానికి నేనంటే ఎంతో ప్రేమ. ఎంతసేపూ అవ్వా ! యిదిగోనే. అవ్వా ! అదిగోనే. అంటూనేవుంటుంది.... (అన్నాతో) పెద్దపెట్టెలమీద దానికి పడక ఏర్పాటుచేసేను. గదులు కడగడానికి నాకు సాయంగావుంటుంది. బట్టలుకూడా ఉతగడం దానికి చేతవునులే.

అన్నా : అవునులే ! ఇక్కడేవుండనీ. కొంచెం విశ్రాంతి తీసికోనియ్యి. పాపం. (జాబుపూర్తిచేస్తూ) లోంక్యేవో ! ఇవాళ మొదట్లో ప్రాక్టీసుప్రారంభించిన దావూళ్ళోనే. ఫియోడోర్ పుట్టిందక్కడే. వాడు చదువుకోనేటప్పుడు సెలవుల కింటికి వస్తుండేవాడు. ఆరోజులు తిరిగివస్తాయా ? ఎంతలో అన్నీ మారిపోయినాయి !

దేమిడ్యేవ్నా : జాబులోరాయి ! మనసుకరిగేలారాయి ! మాతృప్రేమ. తల్లికన్నీళ్లు.- ప్రతిమాటలోనూ తొణికిసలాడేలా రాయాలి. (ఫియోడోర్ పటంవైపు నిరసనదృష్టితో చూస్తూ) ఇంతకూ ఒక పోస్టుకార్డుఅయినా రాసిపడేస్తాడేమో. మనసుకరిగితే.

అన్నా : (కవరుఅంటించి) ఇదినా ఆఖరిఉత్తరం. దీనికివాడేమీ జవాబు రాయకపోతే. నాకూ వాడికీ సరి. (బాధాసూచకస్వరంతో. పొంగి వచ్చే కళ్ళనీళ్లు ఆపుకుంటూ) దయవుంచి. క్షమించు. కొకోరి షిక్టిన్ ! నువ్వు పరాయివాడవుగాదు. నీదగ్గర చనువు తీసికొం టున్నాము.

కొకోరి : నేను చాలాపరితాపబడుతున్నాను. (ఉద్రేకంతో) నాఆనారోగ్య కారణంగా సంతానంపొందేభాగ్యం నాకులేదు. అయినా అన్ని విషయాలూ స్వప్నంలోనే చూసేను. అనుభవించేను. నాకేమీ లోపంలేదు. (ఎవరూచూడకండాకళ్లుతుడుచుకుంటూ) నేనెప్పుడూ ఫియోడోర్ని చూడనేలేదు.

అన్నా : వాడు యిల్లువదలిపెట్టిపోయేడు....కిటికీతలుపులు మూసెయ్యి, దేమిద్యేవ్నా ! విమానాలువస్తాయి.

కొకోరి : అతడు యింట్లోంచి వెళ్ళిపోయి చాలాకాలంఅయిందా ?

అన్నా : మూడేళ్ళయిందప్పుడే.... పైగా ఎనిమిదిరోజులు. ఈవేళ తొమ్మిదోరోజుకూడాను.

దేమిద్ : మాబాబు జన్మకాలనక్షత్రం మంచిదికాదు, నాయనా.

అన్నా : వాడికెప్పుడూ రోగాలే. పెంచి పెద్దవాణ్ణిచేసిన దాదిఋణం తీర్చుకోలేము. అదేలేకపోతేనా,....ఏమయేవాడో. కాని, వాడి మనసు చాలామంచిది ; కొంచెం ప్రథమకోపం వుందిగాని.... (లేస్తూ) ఇవాన్ వచ్చినట్లుంది.

(దేమిద్యేవ్నా కిటికీలకివున్న షట్టర్లుమూసేసి, స్విచ్నొక్కి, లైట్లు వెలిగిస్తుంది. ఓల్గా లోపలికివస్తుంది, పనిలోనుంచి. పలచనికోటు తొడుక్కొని, సాదాటోపీ ధరించివుంటుంది. చేతులో పోర్టుఫోలియో వుంది. ఒక్కక్షణం కళ్లుచిగిలించి, పైకిచూస్తుంది. బహుశా దీపపు వెలుతురు కళ్ల మిరుమిట్లుగొల్పి వుంటుంది. "అమ్మా, నమస్కారం" అంటూ మెల్లిగా తెరవెనుకకి నడిచిపోతుంది. బట్టలుతీసేసి, నడ్డివెనక చేతులుబిగించి, ఆలోచిస్తూన్నట్లుగా నిలుచుంటుంది.)

అన్నా : తిండానికేదైనా వెచ్చబెట్టి యిమ్మన్నావాతల్లీ ! లేదా నాన్నవచ్చే వరకూ వుంటావా ?

ఓల్గా : స్కూల్లోనే భోజనంచేసేనమ్మా !

అన్నా : (ఓల్గావైపుచూస్తూ) ఏం, అట్లావున్నావు ? ఏమీ జరగలేదుగద ! ఓల్గా !

ఓల్గా : లేదు. ఏమీలేదమ్మా! నువ్వూరికే భ్రమపడుతున్నావు. [తన పోర్టుఫోలియోనుంచి నోట్సుపుస్తకాలు పైకితీసి] నేను చాలా అలిసిపోయేనమ్మా! నేనింకా యిన్నినోట్సు దిద్దాలి.

అన్నా : నా తల్లీ! నావైపు చూడడంలేదేమమ్మా?

ఓల్గా : బాగుంది....ఏంలేదమ్మా. మనసైన్యాలు సాయంకాలం మా స్కూలుదగ్గరనుంచే వెళ్లేయి, నిశ్శబ్దంగా. తిరోగమనం. బడి పిల్లలు కిక్కురుమనకండా, ఎలకపిల్లల్లా కూర్చున్నారు. లోకం అంతా శూన్యంగా కనిపించింది, ఒక్కసారి హఠాత్తుగా.... చివరకి కుక్కలుకూడా మొరగడం నిలుపుచేసేయి. [కఠోరంగా, నిశ్చయసూచకస్వరంతో] అమ్మా! యుద్ధరంగంలో పరిస్థితులు బాగులేవమ్మా!

అన్నా : ఎప్పుడు?....ఇదంతా ఎప్పుడు జరిగింది?

ఓల్గా : పోయినరాత్రి. పిరియోవ్‌స్కీ కేంద్రంమీద జర్మనులు టాంకు దళాలతో దెబ్బతీసేరుట. "మెడ్‌వీథికా" దగ్గరకు చొరుచుకుని వచ్చేసేరు. మన శ్రేణిలో గండికొట్టగల్గేరుట. నేనింటికివస్తూ కోలెస్నికోవ్ యింటికి వెళ్లేను. కాగితాలూ, డాక్యుమెంట్లూ తగులబెడుతూన్నారు, వాళ్లు తొందరగా.

కొకోరి : కాలిన కాగితంముక్కలు గాలిలో తుమ్మెదదండుల్లా లేస్తున్నాయి. ఎంతోవిచారకరమైన దృశ్యంఅది!

ఓల్గా : క్షమించు, కొకోరిష్కిన్, నిన్నక్కడ చూడనేలేదే?

కొకోరి : [అట్టహాసంగా] వాళ్ళని బందిఖానాలో పారేయాలి. ఫిరంగుల్ని వాళ్లమీద బారుచేసి, నామరూపాలులేకండా చేయాలి. ఇల్లాటి వాళ్ళ కింతేశాస్తి.

ఓల్గా : దూరంగాకూర్చుని మనం యుద్ధరంగాన్నిగూర్చి అంతతేలిగ్గా మాట్లాడవచ్చు. కాని, ఒక్కసారి అక్కడికివెడితే....

అన్నా : ఇంకా ఏంజరిగిందమ్మాయీ? (ఓల్గా మాట్లాడదు) నువ్వు మధ్యాహ్నం భోజనం చేయలేదనుకుంటాను; ఏం, కొకోరిష్కిన్? వెళ్ళు, వంటింట్లోకి వెళ్లు. (ద్వారంలోంచిపిలుస్తూ) దేమిడ్యేవ్నా! ఇదుగో కొకోరిష్కిన్కి తినడానికేదైనాయియ్యి.

కొకోరి : తల్లీ, నువ్వెంతమంచిదానవమ్మా! అన్నా నికోలయేవ్నా! నీ ఆదరంతోనే కడుపునిండిపోతుందమ్మా.

[అతడు బైటికిపోతాడు. తల్లి సాభిప్రాయంగా కుమార్తెవైపు చూస్తుంది.]

ఓల్గా : అమ్మా! నువ్వేమీ భయపడకమ్మా. వాడు బతికేవున్నాడు, కులాసాగానే వున్నాడుకూడాను. అంతాబాగానేవుంది. నేనిప్పుడే చూసేను ఫెడ్యాను.

అన్నా : ఎక్కడ? ఎక్కడమ్మా?

ఓల్గా : ఊరిబైటమ్మా.... పెద్దచెరువు లేదూ, అక్కడ. చిరుగాలికి తరంగాలు లేస్తున్నాయి. వాడొక్కడే అక్కడ నించుని, చీకట్లోకి చూస్తున్నాడు. బాగానే వున్నాడు వాడికేం ఫర్వాలేదు.

అన్నా : వాడిగుడ్డలు చిరిగిపోయి వున్నాయికదూ? చూస్తేనే భయం వేస్తూ. కాలిజోళ్లకూడా మంచివి లేవు. ఔనా?

ఓల్గా : కాదు....వాడు కొంచెం చిక్కిపోయి వున్నాడంతే. దగ్గునుబట్టి వాణ్ణి పోల్చుకున్నా.

అన్నా : వాడు యిక్కడకువచ్చి చాలరోజులైందా?

ఓల్గా : నేను వాడితో మాట్లాడలేదమ్మా. గేట్లోంచి వాణ్ణి చూడగానే నీతో చెపుదామని పరుగెత్తుకొచ్చాను.

అన్నా : ఇదేమిటి ! మనం యేమీచేయకండా ఊరికే నిల్చున్నామేమిటి?
డేమిడ్యేవ్నా ! ఏమేవ్ ! (ఆమె గదిలోకి పరుగెత్తుకువస్తుంది)
డేమిడ్యేవ్నా ! వచ్చేడే, ఫియోడోర్ వచ్చేడు ! టేబిల్ పెట్టి, భోజనం అమర్చు. కబ్బోర్డులోంచి మధురసం తియ్యి త్వరగా. వాడు మంచుతో కొయ్యబారిపోయి వుంటాడు. అది యిస్తేగాని వాడికి వేడిమి కలగదు. నేనిప్పుడే వెడతా, ఏదో బట్ట మీద వేసుకొని, పరుగెత్తుకెళ్ళి, వాణ్ణి తీసుకొస్తా. లేకపోతే వాడు మళ్ళీ నా కళ్ళబడకుండా మాయమైపోతాడు. నాకు తెలుసు. ఏమో, మళ్లీ తిరిగి ఎంతకాలానికో....

డేమిడ్యేవ్నా : ఎంతత్వరలో మరచిపోయేవమ్మా, కొడుకు పెట్టిన కడగళ్లు ! అబ్బబ్బా ! నిన్నెంత ఏడిపించేడమ్మా, అంతా యిట్టే మరిచిపోయేవు !

ఓల్గా : (తల్లి జబ్బపట్టుకొంటుంది ఆపడానికి) ఎక్కడికీ వెళ్ళద్దు. ఆస్త్రీని గూర్చి మనం చెప్పనే చెప్పేము, వాడేమైనా లెక్కచేసేడా, ఏమేనా ? వాడంతట వాడే యింట్లోంచి వెళ్ళిపోయేడు. వాడికి తోస్తే తిరిగి వాడే వస్తాడు రానీ. (శ్రద్ధగా వింటుంది) మన షెడ్లో ఎవరో ఉన్నట్లుందే. (అందరూ వింటారు. ఏదో రేకు మీద పడినచప్పుడు) ఎవరో మన రేకుతొట్టిమీద పడ్డట్టున్నారు. పాపం, ఎవరేనా రోగి, నాన్నకోసం వచ్చి, చీకట్లో దారి తప్పి పోయేడేమో !

డేమిడ్యేవ్నా : (నడవలోకి వెడుతూ) తలుపులు మళ్లీ మూసినట్లు లేదు.

అన్నా : నువ్వెళ్లు. నేను వేస్తానులే.

(ఆమె గదిలోంచి వెడుతుంది. తెరలో మంద్రస్వరంతో మూలుగుతూ, ఏడుస్తూన్న ధ్వని. బిడ్డలతల్లికి మాత్రమే అట్లాటి ఏడుపు సాధ్యం. తరువాత పురుషుని గంభీర కంఠధ్వని. ప్రేమాను కంపాపూరితమైన స్వరంతో "బాగుంది. అట్లాగేలే, అమ్మా, ఊరుకోవే. ఊరుకోవూ, అమ్మా. నాకేం, నేను క్షేమంగానే వున్నా. నా తలకొట్టి మొలేసినట్టు, ఎందుకు ఏడుస్తావ్. అంతా బాగానే వుందమ్మా?)

దేమిడ్‌యేవ్నా : అయితే యీశుభదినంకోసమా యింతకాలంగా వాని తల్లి కనిపెట్టుకునివుంది! బాగుంది!

(తల్లి కొడుకులు ద్వారంలో కనిపిస్తారు. కొడుకుప్రక్కన తల్లి చాలా చిన్నదిగా కనిపిస్తూంది. అన్నా, కొడుకుజబ్బపట్టుకుంది. తల్లి అట్లా పొదివి పట్టుకోడం అతని కంతగా యిష్టమున్నట్లు తోచదు. ఫియోడోర్ పొడగరి; తండ్రికివలెనే ఉన్నత లలాటం; కళ్లు లోతుకు పోయి వున్నాయి; చూపుల్లో చురుకుదనం, నిర్భీతి, సాహసం ఉట్టిపడు తున్నాయి. బహుశ్రద్ధగా క్రోటన్సులా కత్తిరించిన పలచని మీసకట్టు, అతనికి తగి లేదు. తోలుకోటు తొడుక్కున్నాడు. కోటు వాడకంవల్ల నలిగివుంది. భుజందగ్గర ఏదోకట్టుకట్టిన మరకలున్నాయి. టాప్‌బూట్లు బురదకొట్టుకుని వున్నాయి. సిగరెట్టు కాలుస్తుంటాడు)

ఫియోడోర్ : (జబ్బపట్టుకు వేళ్లాడుతున్న తల్లిచేతులు విడిపించుకుంటూ) ఏమేవ్! చెల్లీ! నన్ను పలకరించితే నువ్వు మైలబడిపోవను కుంటానే?

ఓల్గా : (సందేహిస్తూనే అతని వైపువస్తూ) ఫియోడోర్ *ఫెడ్కా! అన్నయ్యా! ......(ఆమె భావోద్రేకంచూసి, ఫియోడోర్ చకితుడై సర్దుకుంటాడు.)

---

* "ఫియోడోర్"నే ముద్దుగా పిలుచుటలో "ఫెడ్కా" "ఫెడెంకా" యిత్యాదులు వాడుతారు.

ఫియోడోర్ : నాకు కొంచెం జలుబుచేసింది.........దారిలో వస్తుంటేనే. అట్టేహడావుడి పడకు, చెల్లాయీ !.........(హఠాత్తుగా దగ్గుతెర వస్తుంది. మనిషి దడదడ లాడిపోతాడు. సిగరెట్టు నోట్లోంచి క్రిందపడిపోతుంది. ఓల్గా, పరాధ్యాన్నంగా ఆసిగరెట్టును తీసి, పీకిదానులో పడేస్తుంది. అతను జేబురుమాలు నోటికడ్డంగా పెట్టుకుని. నోరు తుడుచుకొని, చటుక్కున జేబులోదాచేస్తాడు.) అబ్బా ! చూసేవుకదూ ! నేను ప్రస్తుతం యీ దశలో వున్నాను.

అన్నా : నాయనా ! ఫెడెంకా ! రా ! ఇట్లావచ్చి పొయ్యిదగ్గిరచలికాచుకో. పొయ్యిదగ్గిర ఎంతవెచ్చగావుందో. ఇదుగో. ఆ తోలుకోటుతీసి. ఇట్లా నాచేతికియ్యి. నేను పైన తగిలిస్తానులే.

ఫియోడోర్ : అట్లాగేనమ్మా ! ఫర్వాలేదు. నే తగిలిస్తానులే. (ఆమె దగ్గరకి రావడంచూసి, విసుగ్గా) నన్నొదిలిపెట్టు. చెపితేకాదూ ! (ఆమె వెనక్కి తగ్గుతుంది. మరింతచిన్నదిగా క్రుంగిపోయినట్లు కనిపిస్తుంది. తలుపుదగ్గిరే నిలబెడతాడు తనకోటుతీసి.) పాగా• కొయ్య (Ranger) మీద పెట్టదగినది కాదులే, యిది. అట్లా నిలబడి వుండనీండి. (కుక్కనో దేన్నో బెదిరిస్తూన్నట్లు చూపుడు వ్రేలితో అదలిస్తూ) నిలుచో ! (మామూలు • అభివాదనం చేయకుండానే వంటక త్తెవైపుతిరిగి యింతసేపటికి) నర్స్ ! చాలా ముసిలిదానవై పోయేవే ! ఇంకా యమధర్మరాజు కబురంపించలేదూ ! (డేమిడ్యేవ్నా యీ పరామర్శకు యేమీచలించదు.)

---

• జరుగుబాటున్న కుటుంబాలన్నిటికీ "దాదు" లుంటారు. వాళ్లు అవివాహితలు. జీవితంఅంతా కుటుంబంలోనివాళ్లలో ఒకరుగానే వుండిపోతారు. వాళ్లు సగౌరవంగా చూడబడతారు. మనకుటుంబాల్లోని "దాసీ"లకువలె న్యూనతగా చూడబడరు. పోలికచెప్పాలంటే మగడులేని సోదరిగాని, మరో స్త్రీగాని మన కుటుంబాల్లో చూడబడ్డమాదిరిగా చూడబడతారు.

అన్నా : ఓల్గా, తల్లీ ! నువ్వు ఫియోదోర్‌తో మాట్లాడుతూండు...... వాడికి తిండానికేదైనా తెస్తానింతలో. (ఫియోదోర్‌తో, భయపడు తూనే) ఈరాత్రిపూట ఏంతినందే నిన్నిక్కడినించి వెళ్ళనియ్యం మేము.

ఓల్గా : దేమిడ్‌యేవ్నా తెస్తుందిలేవే, అమ్మా.

దేమిడ్‌యేవ్నా : ఆమెనిపోనియ్యి. ఏదోపనిచేయనియ్యి. లేకపోతే.... (అన్నా తొందరగా వెళ్ళిపోతుంది, పెదవికరుచుకుంటూ)

ఓల్గా : ఫియోదోర్ ! నువ్వు కాల్చిచంపేసేవే. ఆమెమీదనీకున్న ప్రేమ నీలోని సర్వశక్తుల్నీ ఆఖరుకి తల్లిమీద. నీకుందే ప్రేమనుకూడా కాల్చేసినట్లు కనిపిస్తూందిరా! అమ్మమీదకొంచెం అభిమానంచూపె ట్టలేవురా, అన్నయ్యా ! అమ్మ ఎంతమంచిది. మనకోసం గాదూ, నీకోసం, నాకోసంకాదూ, అమ్మ సంగీతకళాశాల వదలి వచ్చింది. తన భవిష్యత్తును (Career) కాలదన్ని మనకోసం అష్టకష్టాలుపడింది కాదుట్రా !

ఫియోదోర్ : తెలియదటే ఓల్గా ! నాకుచిరాగ్గావుంది. మూడురోజులుగా వీధులమ్మట తిరుగుతున్నా, ఇంటికిరాడానికి భయపడే. మరేదైనా వినగల్నుగానీ..........ఆదిక్కుమాలిన ఏడుపుమాత్రం వినలేను. (గదిలో యిటు నటు నడుస్తాడు. చిరపరిచితాలైన వస్తువుల్ని ఆపేక్షతో ముట్టుకుంటూ ఏదీ ! ఒక్కటీ మారలేదు. అన్నీ వేటి స్థలాల్లో అవే వున్నాయి....నాకన్నీ జ్ఞాపకమే. (పియానో తెరిచి, మెట్లు ముట్టుకుంటాడు.) అమ్మ యింకాపాడుతూందా?

ఓల్గా : ఎప్పుడోగానిపాడదు. నువ్వెప్పుడూ ఆమెకి జాబు వ్రాయనేలేదు. ఒక్కసారైనా ! సిగ్గు లేదుటరా !

ఫియోదోర్ : అబ్బే, ఏమీలేదు. ఏదో అల్లా జరిగిపోయిందంతే. తీరికే లేకపోయింది. (తన పెద్దఫొటోవైపు చూస్తాడు. అతనిపోజు, ఆఫొటోలోని పోజును పోలినట్టుగా వుంటుందొక్క క్షణం) మనం అంతా ఒకప్పుడు చిన్నపిల్లలమే. ఎప్పుడో ఒకప్పుడంతా యిట్లా అయిపోయేవాళ్ళమే. (తిరిగి చూడకండానే, భుజం మీదుగా వెనకవైపున్న ముసలిపనికత్తె నుద్దేంచి.) ముసలీ! ఏమిటల్లా దయ్యాల్ని బట్టేటట్టు చూస్తున్నావు? చూపులతోనే నన్ను చీల్చేటట్టున్నావు.

దేమిడ్‌యేవ్నా : నిన్ను చూస్తున్నానంతే, ఫెడెంకా! ఎంత అందంగా తయారయేవు!

ఓల్గా : నీశిక్ష పూర్తయిందా? అంతా సర్దుబాటయినట్లేనా? చెప్పు?

ఫియోదోర్ : ఆ. నేను పరుగెత్తుకు పోయిరాలేదు.... భయం లేదులే. మీకేమీ ప్రమాదంరాదు.

ఓల్గా : (బాధపడుతూ) నన్ను తప్పుగా ఎందుకర్థం చేసుకుంటావురా? నువ్వు కూర్చుని వాడితో మాట్లాడుతూండు, దేమిడ్‌యేవ్నా. నేను వెళ్ళి అమ్మకి సాయంచేస్తా. (తల వొంచుకుని, బైటకి వెడుతుంది.)

దేమిడ్‌యేవ్నా : బాగుంది, మొత్తంమీద వాళ్ళిద్దర్నీ బైటకి తరిమివేయగల్గేవు. ఇంక నేనొక్కత్తె నున్నాను. మనిద్దర్లో యెవరు నెగ్గుతారో చూద్దాం! నీ ఎముకలు గట్టిగా వున్నాయో లేదో చూసుకో! (గదిమధ్యగా నున్న, ఆతనికిదగ్గరగా కూర్చుంటుంది. చౌక్కా చేతులు మరీ పొట్టిఅయినవేమో వాటిని క్రిందికి లాక్కుందుకు ప్రయత్నిస్తాడతడు) నీలాంటిఅందగాడిని కాతరీచేయని ఆ స్త్రీతో యెట్లా వ్యవహారం ఫైసలాచేసుకున్నావో, ఆ కథంతా చెప్పు,

నాతో. (ఆమెవైపు కోపంగా చురుకుచూపులు చూస్తాడు.) నీ చూపు కెవలె భయపడుతుంది ? శాంతించు, మీనాన్న, యిప్పుడే వస్తాడు.

ఫియోడోర్ : చాల్లే. నర్స్. అక్కడితో చాలించు. నన్నొదిలిపెడుదూ. యింక.

డేమిడ్‌యేవ్నా : ఎందుకూపనికిరాని ఈ పెద్దమ్మకోసం నిత్యం దేవుడికి మొరపెట్టుకున్నా. కాని, అబ్బే! (నిష్ఠురమైన చిరునవ్వుతో) నామేనల్లుడికి కోటు కావలిసివచ్చినపుడు ప్రార్థిస్తే ఆలించిన దేవుడు. నీవిషయంలో నా ప్రార్థనలన్నీ పెడచెవిని బెట్టేడు. (ఫియోడోర్ టేబిల్‌దగ్గరే నిల్చుని ఆమెమాటలు వింటూం టాడు. ఆ జాబు ఆతనిచేతిక్రిందే నలుగుతూంటుంది.) ఎందరో తమ ప్రాణాల్నికూడా లెక్కజేయకుండా యుద్ధం చేస్తున్నారు. నానాబాధలూ పడుతున్నారు. నువ్వు చేయవలసిందేమిటి ? నీ రాతి హృదయం ఒక్కసారి పరీక్షించిచూసుకో. నువ్వు చెయ్యబోయే దేమిటో ఆలోచించుకో, మాట్లాడవేం ?

ఫియోడోర్ : [ నేలవైపు చూస్తూ] నాకు తెలియదు, ఇంతవరకూ జీవించినట్లుగా మాత్రం యింక జీవించలేను.

డేమిడ్‌యేవ్నా : నీ అంతరాత్మ చెప్తూందా?—లేకపోతే జైలుభయం వల్ల యింకా అట్లా అంటున్నావా ?

ఫియోడోర్ :[లొంగిపోతూ] ఆగు. ఇంక బాధించకు, నర్స్! నాకు జీవితంఅంటే అసహ్యం కలుగుతూంది.

డేమిడ్‌యేవ్నా : అట్లాగే అసహ్యం కలగాలి. పిరికిపెద్దమ్మ! నువ్వు చేయవలసిందొకటేవుంది. సైన్యంలో చేరడమే, సైనికుడికోటు

తొక్కేంచేనేగాని నీకు జ్ఞానం రాదు. వేడెక్కదు నీ రక్తం? ఉన్నికోట్లు తొడుక్కుంటే వేడెక్కే రక్తం గాదు నీది! సైని కుడికోటే వుండాలి. అంతే! వెళ్లు. యుద్ధంలోకి ఉరుకు!

ఫియోడోర్ ! వాళ్లు నన్ను తీసుకోరు. [మెల్లిగా ఒకసారి తిరిగిచూసి, మెల్లిగా] నాగుండె పాడైంది.

దేమిద్‌యేవ్నా : ప్రయత్నించు. ఒదిలిపెట్టకు. ఎట్లాగో పనిపూర్తి చేసుకో. [అనిస్కా లోపలికి చూస్తుంది. ఆమెకి పదిహేనేళ్లుం టాయి. మాంచి రంగు పువ్వులగౌనూ, బ్రెవారల స్టాకింగ్సు. ధరించి వుంటుంది. కొత్తవాణ్ణి చూసి సిగ్గుపడుతూంది] రా, రా. లోపలికిరా, పిల్లా, భయపడకు. నిన్నెవరూ కరవరులే.

అనిస్కా : పంచదార తెచ్చేను, అవ్వా.

దేమిద్‌యేవ్నా : మంచిపిల్లమ్మా! బల్లమీద పెట్టు. ముక్కుతో ఊరికే బుసలుకొట్టకే. నాకు అమర్యాద తెప్పించద్దు సుమా! ఏమిటా దబ్బూ దిబ్బూ బూట్లతో ఆనడక. [అనిస్కా నిశ్శబ్దంగా, కాళ్లు ఎత్తెత్తి జాగ్రత్తగా వేస్తూ, నడిచివస్తుంది. ఆమెచేతిలో పంచదార పొట్లం వుంది. కళ్లు చాల తేజోవంతంగా వుంటాయి. చలికిగావును చెక్కిళ్ళు ఎర్రబారినాయి. ప్రాతఃకాలంలో విడిచిన గులాబిపువ్వులా నూతనత్వం, అమాయికత్వం, ఆమెపై ఖరిలోనే ప్రతిబింబిస్తుంటాయి. బెదిరిన లేడిచూపులు. ఆమెని చూసి మెచ్చుకోకుండా. చిరునవ్వు నవ్వకుండా ఉండలే రెవ్వరూ. ఫియోడోర్ ముఖంలో తృప్తిగానవస్తుంది.) ఆమె నెవగవూ.

ఫియోడోర్ ; ఎంత అందంగా వుంది ? ఎవరీమె ?

దేమిద్‌యేవ్నా : 'లొంట్యేవోలో మనవాకిట్లో ఆడుకుంటూండేదెవగవూ? ఆ బంగారు బొమ్మ! నిన్ను ఒక్క క్షణమేనా వూరుకో

నిచ్చేదా ? అల్లావుండేది ఇప్పుడెల్లా ఎదిగిందో ! జర్మన్లని తప్పించుకుని పారిపోయొచ్చింది? (అనిస్కాతో) ఎవరో ఎరుగుదువా ? యజమానికొడుకు. ఫియోడోర్ ఇవానోవిచ్. రా, బాగున్నావా అని అడగాలి గాని. ఎన్నోదేశాలు తిరిగి తిరిగి ఇంటికొచ్చేడు.

(అనిస్కా తలవొంచి నమస్కరిస్తుంది. నాలుకతో పెదవులు తడుపుకుంటుంది.)

ఫియోడోర్ : (కదలకుండా కూర్చునే) పెంకెపిల్ల. నవ్వుతావెందుకూ ?

అనిస్కా ! నవ్వడం లేదు. నాస్వభావం అంతే.

డేమిడ్యేవ్నా : దానితో ఓమాట మాట్లాడి చూడు చూద్దాం. నాలిక మహచురుకు.

ఫియోడోర్ : (ఏం ప్రారంభించాలో అర్థంగాక) అక్కడి జర్మన్లెల్లా వున్నారేం ?

అనిస్కా : ఎల్లావున్నారేమిటి ? అక్కడే వున్నారు. అంతే.

ఫియోడోర్ ! అది గాదు. మాటకి మంతికీ ఎల్లావుంటారని. ఏమన్నా గౌరవం చూపుతారా ?

అనిస్కా : ఆహా, కొంపా గోడీ తుడిపెట్టేస్తూన్నప్పుడుకూడా 'క్షమించండి' 'వందనాలు' అంటూ గౌరవం చూపుతారు.

ఫియోడోర్ : (డేమిడ్యేవ్నా) లోంట్యేవోలో కుర్రాళ్ళందరూ నాకు తెలుసు. పొడుగ్గా వుండేవాడూ, తబాకోవ్ - ఈపాటికాతను పిల్లలతండ్రి అయి వుంటాడు. ఎందరు పిల్లలు, అతనికి ?

అనిస్కా : ఆఖరువాడికి ఏడాదివుంటుంది. (ఉత్సాహంతో డేమిడ్యేవ్నా వేపు తిరిగి) అమ్మమ్మా ! చెప్పడం మరిచేను....తబాకోవ్‌ని, పెళ్ళాన్నీ ఉరి తియ్యడానికి తీసుకుపోతూంటే వాళ్ళ చిన్నకుక్క

ఓజర్మనీవాణ్ణి చెయ్యిపట్టుకు కరిచింది. ఆకుక్క ఎంత బాగుం టుందనుకున్నావు ? ఆపశాన్ని. ఆకుక్కనికూడా ఆ జర్మనీవాళ్ల యజమానితోనూ, యజమానురాలుతోనూపాటు ఉరితీసేసారు.... (వణుకుతూ) ఈయుద్ధంలో కుక్కలుకూడా పాల్గొంటున్నాయి.

ఫియోడోర్ : (వెగటుగా) ఆ....హా....అయితే పీటర్స్టాటోన్నోవ్ ఎలా వున్నాడు ?

అనిస్కా : అతడు మొదట్లోనే వెళ్ళిపోయేడు అడవుల్లోకి. వాళ్ళింట్లో స్నానాలగది వుందికదూ. అందులో ఆఖరుమాటు ఆవిరిస్నానం చేసేసి దాన్ని కాస్తా తగలపెట్టేసి వెళ్ళిపోయేడు. పోతూ పోతూ కొడుకుని వెంటబెట్టుకు పోయేడు. స్కూల్లో ఆరోఫారంచదువు తున్నాడులే. ఫ్రోష్కా అంటారు అందరూ వాణ్ణి. (పల్లెటూరి యాసలో దీర్ఘాలుతీస్తూ మాట్లాడుతూంటే ఫియోడోర్ నవ్వు తాడు) ఎందుకు నవ్వుతారు ?

ఫియోడోర్ : నిన్ను చూస్తే నవ్వు వస్తుంది. పిచ్చిపిల్ల. అందరూ నీలాంటివాళ్లే అయితేనా.

(ఓల్గా తలుపు వోరగాతెరిచి "నాన్న" అంటుంది. అంతా సర్దు కుంటారు. దేమిడ్యేవ్నా కుర్చీలు సర్దుతుంది. అనిస్కా వెళ్ళిపో తుంది. ఫియోడోర్ ముఖంలో కంగారు గోచరిస్తుంది. మెడకిచుట్టు కున్న బూడిదరంగు రుమాలుకొసలు కోటులోపలికి దోపుకుని సర్దుకు కూర్చుంటాడు.)

దేమిడ్యేవ్నా : నాన్నగారికి ఎదురుచెప్పకు. కేకలువేస్తే వెయ్యనీ. నువ్వు మాత్రం మాట్లాడక వూరుకో. పొగరుబోతుతనం చూపించకు.

(ఫియోడోర్ కిటికీవేపు వెడతాడు. డా. తలానోవ్ ప్రవే శిస్తాడు. డాక్టరు సన్ననివాడు. మీసాలు తీసేసేడు. చురుగ్గా నడుస్తాడు.

కొడుకుయింటికి తిరిగి వచ్చినట్లు ఆయన ఎరగడు.)

తలానోవ్ : నాకు భోజనం అక్కర్లేదు. టీమాత్రం నా గదిలోకి పంపించు. స్ట్రాంగ్‌గా వుండాలిసుమా. ఇదిగో దేమిడ్‌యేవ్నా! ఇక్కడికి మూడురోజులనుంచి ఆ కత్తిగుర్తు నా కోటుమీద కుట్టి పెట్టమంటూన్నా నువ్వు పట్టించుకోలేదుకదూ? (కొడుకుని చూస్తాడు. కాని, నిత్యం కనపడుతూన్నవాడిని పలకరించినట్టే ఏ విధమైన ఆశ్చర్యం, ఉద్రేకం కనబరచకుండా పలకరిస్తాడు.) ఇదిగో ఫియోడోర్! తండ్రియింటికి తిరిగి వచ్చినట్లేనా? మంచి పని చేసావు. (ఫియోడోర్ సమాధానం యివ్వబోతాడు. కాని, దగ్గుతెరవచ్చి, బాధతో చుట్టుకుపోతాడు. డాక్టరు తల వోరబెట్టి పరీక్షగా ఆ ధ్వని వింటాడు. ఆయన తండ్రిలాగాక డాక్టరులా ఫియోడోర్ రోగం పరీక్షిస్తాడు.) ఊ.హూ.... (తలానోవ్ కోటును పనికత్తె తీసుకువెడుతుంది. ఫియోడోర్ మూతి తుడుచుకున్న జేబురుమాలుని జేబులో పెట్టివేసుకుంటాడు.) నువ్వు పట్నంలోకొచ్చి ఎన్నాళ్ళయింది.

1837

ఫియోడోర్ : నిన్ననే. (విసుగుతో పాఠం వొప్పచెప్తూన్న కుర్రవాడిలా) అమ్మకీ, మీకూ చాలా కష్టం కలిగించేను. క్షమించండి.

తలానోవ్ : సరిలే. అందులో నీ తప్పులేదు. మాదీవుంది తప్పు. నువ్వు మా మొదటి సంతానంవి. నీకు కష్టాలు కలగనియ్యకూడదనుకున్నాం....ఫలితంగా ప్రపంచమంతా నీ కోసమే పుట్టినట్లుగా భావించేవు. (ఫియోడోర్ మానసికంగా గిలగిలలాడుతాడు) ఆవిడెవరో....మరణించిందా?

ఫియోడోర్ : ఉహూ. నామట్టుకు నేనూ ఆ పనే చేసుకోవాలనుకున్నా గాని, టైం లేకపోయింది.

తలానోవ్ : ఏం పనది?....ఎందుకల్లా చేసేవు?

ఫియోదోర్ : నేనామెని ప్రేమించేను. కాని ఆమె ప్రేమకి తగదు.

తలానోవ్ : ఇప్పుడింకేమిటి ? (ఫియోదోర్ మాట్లాడడు,) విశ్రాంతి తీసుకుందుకొచ్చేవా ? బాగానే వుంటుంది. వుండు, వెనకా ముందూ చూసుకుంటూండు.

ఫియోదోర్ : ఒద్దు, క్షమించండి. ఇంక అంతా నాకేసి వింతగాచూడడం మొదలుపెట్టి ధర్మపన్నా లుపదేశించబోతారు. మీ దగ్గిరికి. అంటే డాక్టరుగా మీవద్దకి - మందుతీసుకోడం కోసంవచ్చేను.

తలానోవ్ : మరీ మంచిది. ఈమధ్య సాయంకాలంపడితే కళ్లు సరిగ్గా ఆనడంలేదు. ఇల్లా రా. ఇల్లా వెలుతురుగావున్నచోట కూర్చో. ఒక్కసారి పరీక్ష చెయ్యనియ్యి.

(ఫియోదోర్ మారుమాటాడకుండా. దీపంకి దగ్గరగా కూర్చుని, లాంప్‌షేడ్ కొంచెం పైకెత్తుతాడు. వెలుతురు ఆతని ముఖం మీద పడుతూంది. తలానోవ్ కొడుకుముఖంలోకి పరీక్షగా చూస్తాడు. ఫియోదోర్ చేయి కదుపుతాడు.)

ఫియోదోర్ : పరీక్ష అయిందా ?

తలానోవ్ : ఆహా, ఈదగ్గు ఏమీ బాగులేదు.... నీ కళ్ళల్లో జ్వరలక్షణా లున్నాయి. నీ చేతులు వేడిగా చెమటలు క్రక్కుతూన్నాయి.

ఫియోదోర్ : ఆదేముందిలే. దానిసంగతి కాదు నేనడిగింది.

తలానోవ్ : అంతేకాదు. నీ మనస్సుకి పెద్దదెబ్బ తగిలింది. ఆఆరాటంలోనే నువ్వు అంత మొరటుగా ప్రవర్తిస్తూన్నావు. ఆ మీసం చూసుకో. ఆ ఆరాటం వెలిగక్కాలని నీకోరిక. అదీ ఓ అందుకు మంచిదే. (పెంకిపిల్లవాడిని మందలించే స్వరంతో) ఫియోదోర్, కాస్త వెనకా ముందూ చూసుకోకుండా నడవకు. మన దేశానికి కష్టపురోజులు వచ్చి పడ్డాయి. మన ఆడవాళ్ళంతా అడవులుపట్టి

ఆ చలిలో నెగళ్ళవద్ద నానాబాధలూ పడుతూన్నారు.... తగులబడి పోతూన్న కొంపల్లోంచి చావు తెంపులమీద తప్పించి తీసుకొచ్చిన పిల్లలు వాళ్ళజీవితంలో ఆకష్టాలు మరిచిపోలేరు. ఇల్లాంటి దిక్కులేనిబిడ్డ లెందర్ని ఈచేతులతో ముట్టుకున్నానో తెలుసా? నిన్న ఒక్కరోజుకి లెక్కేస్తే.... (చేతులు తిప్పుతాడు) అబ్బ! తల తిరిగిపోతుంది. ఒళ్లు మండిపోతుంది. ఫియోడోర్! నీ రోగం ఏమంత పెద్దదికాదు. కుదురుతుంది.

ఫియోడోర్: సరే. కూర్చుని మందువ్రాసి యివ్వండి.

తలానోవ్: కొత్తగా రాయక్కర్లేదు. ప్రజలే బాగుచేస్తున్నారు దానిని.

ఫియోడోర్: బాగుచేస్తూన్నారూ? (కోపంతో) మీ విషయంలో కూడా వాళ్లు చేస్తూన్నది బాగేనా? ముప్ఫయ్యేళ్ళపాటు వాళ్ళకి కట్లుకట్టి తలపుళ్లు కడిగేరే మీరు. గుండె జబ్బులకి శస్త్రచికిత్స చేయ వచ్చుననే సంగతికూడా తెలియని రోజుల్లో మీరే ఆ ఆపరేషన్లు మొట్టమొదటి మారు ప్రారంభించి ఎందరికో రోగాలు కుదిర్చేరే. మీరు చెమటూర్చి ప్రోగుచేసుకున్న డబ్బుతోటి కాదూ ఈక్లినిక్ కట్టించింది. మీరు పట్టణంలోని వాళ్ళఆస్తిగా. ఫైర్‌యింజన్ మాదిరిగా ప్రపంచం వాడుకునే వస్తువులాగా.... తయారయేరు.

తలానోవ్: (కన్నులరమోడ్చి వింటూంటాడు.) బాగుంది. సరే, కానీ.

ఫియోడోర్: అల్లాంటి నీకు ప్రజలుచేసిన బాగేమిటి? ఓమూలనుంచి ఆరాక్షసిమూక దారిలో అడ్డంవచ్చిన ప్రతివస్తువునీ నాశనం చేసేస్తూ తోసుకొస్తూంటే, ఆప్రజలు కాళ్ళకి బుద్ధిచెబుతూన్నారు. ఉన్నమట్టుకి కుండా - మండా, కుంచం - మంచం - చెంబూ - తపేలా బళ్ళకెక్కించి ముసలాళ్ళనీ ముతకాళ్ళనీ కూడాలాక్కు పోతున్నారు. కాని, ఎంతో కాలంనుంచి నానా చాకిరీ చేసిన

మిమ్మల్ని మాత్రం మరిచిపోయేరు. ఇంక లేవండి మరి. వీధిలోవాళ్ళెవరివో నానాచెత్తా కూరినట్రంకుపెట్టె ఒకటి భుజాన మోసుకుని, రోడ్డుమొగ కాస్తే ఏదో బండి దొరక్కపోదు. ఒకరు ఎక్కించుకోకపోరు. (మళ్లీ దగ్గుతెర) అబ్బ ! లోపలంతా పచ్చిపుండులా వుంది. మంట !

తలానోవ్ ! నీ మనస్సులోని యీ మంటకన్న ఎక్కువదికాదు ఈ మంట. (ఓల్గా తలుపుతెరచి చూస్తుంది) మమ్మల్ని మాట్లాడుకోనియ్యి. నువ్వు పో.

ఓల్గా : అందుకాదు నాన్నా !... కోలెస్నికోవ్ వచ్చేడు. అర్జంటుగా మాట్లాడాలిట.

తలానోవ్ : (చిరాకుపడి) ఔను. ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. హాస్పిటలులోవుండగా ఫోన్ చేసేడు. ఊఁ రమ్మను. (కొడుకుతో) ఒక్కనిమిషం మా మాటలకి అడ్డుండకుండా అల్లా పోయి సిగరెట్టు కాల్చుకుంటూండు.

ఫియోడోర్ : నాకూ అతన్ని కలుసుకునేందుకంత మనస్సు పుట్టడంలేదు. ఆవెనక ద్వారానికి తలుపులు బిగించేసేరా ?

ఓల్గా : ఇప్పటికా తెరమరుగుకు వెళ్లు. అతడు తొందరపడుతూన్నాడు. ఎంతోసేపుండడు. (ఫియోడోర్ తెరవెనక్కి వెడతాడు. ఓల్గా తలుపు తెరుస్తుంది.) కామ్రేడ్ ! నాన్న రమ్మంటున్నారు.

(కోలెస్నికోవ్ ప్రవేశిస్తాడు. బొచ్చుకోటు తొడిగేడు. నడుముకి బిగించిన బెల్టులో పిస్తోలుపెట్టె బిగించివుంది. మనిషి పొడగరి. విశాలమైన నుదురు. అతనిలో ఫియోడోర్ పోలికలున్నాయి. వీరి సంభాషణని ఫియోడోర్ తెరవెనకనుంచి వింటూంటాడు.)

కోలెస్నికోవ్ : ఇవాణ తిఖానోవిచ్ ! మీ కోసమే వచ్చేను. కారు గుమ్మంలో వుంది. ఇదివరకు చెప్పేనుగా. అప్రకారమే ఇద్దరికి ఖాళీ వుంచేను. (గది కలియచూసి) సామాను చాలావుందా ?

తలానోవ్ : నా అభిప్రాయం మారలేదు. కొలెస్నికోవ్ ! నే నెక్కడికీ కదలను. నే నిక్కడే ఎక్కువ వుపయోగపడతా.

కోలెస్నికోవ్ : మీరల్లా అంటారనుకున్నా.

ఓల్గా : (ఎవ్వరివేపూ చూస్తూన్నట్లు గాకుండా, నెమ్మదిగా) వ్యవధిలేదు. ఆకాశం నిర్మలంగ్గా వుంది. త్వరలోనే విమానదాడి రావచ్చు.

తలానోవ్ : [కోలెస్నికోవ్‌తో] వేగం వెళ్ళండి. లేకపోతే సకాలంలో బ్రిడ్జి దాటరు. ఈపాటికి సెలవుతీసుకోడం ఉత్తమం. సెలవు. [కోలెస్నికోవ్ డాక్టరు చేయి చాచినా అందుకోడు] నువ్వూ వెడుతూన్నావు కాదూ ?

కోలెస్నికోవ్ : [నెమ్మదిగా] ఇక్కడెవ్వరూ లేరుకదూ, మనమాటవిన డానికి. ప్రక్కగదిలో ఎవరున్నారు ?

తలానోవ్ : అదివంటగది.

[ఓల్గా వెళ్ళిపోవడానికి వెనక తిరుగుతుంది.]

కోలెస్నికోవ్ : ఓల్గా ! నువ్వుంటే అభ్యంతరంలేదు. [తలానోవ్‌తో] నే చెప్పవచ్చిందదే.... నే నిక్కడనే వుంటాను....కొద్దిరోజుల పాటు. నేను పార్టీసభ్యుణ్ణి. కంఠంలో ప్రాణం వున్నంతదాకా....

తలానోవు : అదా సంగతి. [నెమ్మదిగానే] నాతక్కువమాత్రం ఏమిటి? నేనేం బట్టలమూటనీ, చందనబ్బొమ్మనీ కాదు. కట్టకట్టి కారులో పారేసి పంపెయ్యడానికి. నేనూ ఈపట్టణంలోనే పుట్టేను. [ఫియోడోర్ నుద్దేశించి] ఈపట్టణప్రజలకి అత్యవసరమైన పని ముట్లలో ఒకటయ్యేను - ఫైర్ యింజన్‌మాదిరిగా. ఆ వస్తువు

మాదిరిగా అంత ఉపయోగకరమైన వాణ్ణిగానూ తయారయినం దుకు నాకు సంతోషంగానే వుంది. జరిగిపోయిన ముప్ఫయి ఏళ్ళల్లోనూ, ఈపట్టణంలో పుట్టినవాళ్లలో సగంమంది నా చేతుల్లోనే పుట్టేరు. నాచేతుల్లోనే వాళ్లనెత్తుకున్నా.

కోలెస్నికోవ్ : [చిరునవ్వుతో] వారిలో నే నొకణ్ణి.

తలానోవ్ : ఆహా, నువ్వూను. షావుకారు ఫెయ్యూనిన్‌దగ్గర నీ తండ్రి బండ్రోతుగా వున్నరోజులు నాకు బాగా జ్ఞాపకం. (పరిహాసంగా) అప్పటికే నీకంటె బాగా పెద్దవాణ్ణి. అయితేం మాకున్నంత హుషార్‌లేదు నీలో.

కోలెస్నికోవ్ : (ఓల్గావేపు చూస్తూ) ఇంక కావలసినంత హుషారు చూపించొచ్చు [తెరవెనకాల ఫియోడోర్ బల్లమీది దువ్వెన్నని పొరపాటున క్రింద పడేస్తాడు. కోలెస్నికోవ్ కాపుదలలో నిల బడతాడు.] ఇవాన్ ! మనమాటల నెవరో వింటూన్నారు,

తలానోవ్ : ఎవ్వరూ....లేదు.

[కోలెస్నికోవ్ ఫియోడోర్ కోటుని గమనించి, తలానోవ్‌వంక కళ్లెత్తి చూస్తాడు. ఆ సమయంలో తెరవెనకనుంచి ఫియోడోర్‌వస్తాడు.]

ఫియోడోర్ : మరెవ్వరూ కాదు....నేనే.

తలానోవ్ : [కంగారుపడి] మీరిద్దరూ ఒకరినొకరెరుగుదురా ? ఇతడు నా కొడుకు....ఫియోడోర్;

ఫియోడోర్ : కోలెస్నికోవ్ మహాశయుడి నిదివరకే కలుసుకునేభాగ్యం నాకు కలిగింది. చిన్నప్పు డొకటి రెండుమాట్లు తన్నులాడు కున్నాం కూడా. జ్ఞాపకం వుందా ?

కోలెస్నికోవ్ : ఔను. అవృత్తి పాఠశాలలో మనకి పెద్దతరగతుల పని అంతగా లేకపోయింది. [తలానోవ్‌తో మందలిస్తూన్నట్లుగా]

అంతకాలంనుంచి దూరదేశంలోవున్న కొడుకుఇంటికి రావడంలో తప్పేమిటో....ఎందుకు....నాకర్థం కావడంలేదు.

ఫియోడోర్ : నే చెప్తా. అన్నింటికన్నా ముఖ్యం ఈ కొడుకు నడత మంచిదికాదు. వీడికో మచ్చవుంది. రెండోది ఇది యుద్ధరంగానికి సమీపంలోవున్న పట్టణం. బహుశా అనుమతిలేకుండా ఏ ఏభయి అరవై మైళ్ళదిగువనో రైలు దిగేసి, పర్రలు అడ్డబడి వచ్చేడేమో....ఏవుద్దేశ్యంతో వచ్చేడో.



ఓల్గా : ఫియోడోర్ ! ఎందుకురా ఆ వెక్కిరింత ?

కోలెస్నికోవ్ : నిన్ను నువ్వే నొచ్చుకోడం బాగులేదు. తప్పుదారి తొక్కావు. నిజమే. నిన్ను వదిలేసేరంటే నీమీద నమ్మకం వుంచేరనేకాదూ ?



ఫియోడోర్ : అది నా అభిప్రాయం కాదూ....సరే. ఇప్పుడే నీవేదో మాటజారేవు. పట్టణంలోనే వుండిపోతానని. దానిఅర్థం నీతో మరికొందరు నమ్ముతగినవాళ్ళు కూడా ఆగుతారు. మీరంతా ఆగడం ఎందుకు....? జర్మన్ సన్యాసులు ! రాండి ! రష్యను బల్లెం మీకోసం సిద్ధంచేసి వుంచేం....అంతే కాదూ. అయితే మీ దళంలో నాబోటిగాడికేమన్నా....అంటే మరియిప్పుడు నమ్మతగ్గవాణ్ణేకాదూ....చోటుంటుందా ? నాకు పెద్దసిఫార్సులేమీ లేవు సుమీ. (కోలెస్నికోవ్ కళ్ళల్లోకి గుచ్చిచూస్తూ) ఏపని చెప్పినా చేస్తా. చావంటే నాకు భయంలేదు. ఏమంటే ఈ మూడేళ్ళలోనూ మృత్యుదేవతకీ నాకూ బాగా స్నేహం కలిసిందిలే. (ఎవ్వరూ మాట్లాడరు.) ఏం ? పనికిరాను !

కోలెస్నికోవ్ : నే నిక్కడుండేది ఒక్కరోజే. రేపు నేనూ వెళ్ళిపోతా.

ఫియోడోర్ ! ఓహో. (మీసం దువ్వుకుంటూ) అందుకేనా నాన్నగారు వెళ్ళిపోవాలని అంతపట్టు ?

తలానోవ్ : ఫియోడోర్ ! నా స్నేహితుడితో మాట్లాడేటప్పుడు గౌరవం ఎరిగి మాట్లాడు.

కోలెస్నికోవ్ : నేను చెప్తా అతడికి. ఇవాన్ కేవలం ప్రజలమనిషి అయిపోయేడు. పైజిల్లాలనుంచి కూడా జనం ఆయన్ని వెతుక్కుంటూ వస్తారు. అందుచేత ఆయనకేమీ ప్రమాదం జరక్కుండా కాపాడడం మా కర్తవ్యం. ఇక్కడ మరీ గంద్రగోళాలు వస్తాయి. ఇంతవరకూ చచ్చినట్లు అడుగున పడివున్నవన్నీ ఇంక బయటికొస్తే రావచ్చు. ఇప్పటికే పాములు చాటు మాటుగా తలలెత్తి తిరుగుతూన్నాయి.

ఫియోడోర్ : అయితే నా చెల్లెలిమాట ? ఆవిడకీ గంద్రగోళాలు సరిపడతయ్యా ?

ఓల్గా : స్కూలుకోసం నే వుండిపోతా.

ఫియోడోర్ : (జేబుల్లో చేతులు పెట్టుకుని మడమలమీద అటూ యిటూ వూగుతూ) అయితే మరీసులువు. పేరున్నవాళ్ళని ఉద్యోగాల్లో దూర్చడానికి జర్మనీవాళ్ళు ప్రయత్నిస్తారు.

ఓల్గా : (కటువుగానూ, వ్యంగ్యంగానూ)దానికి పనికొచ్చేజనాన్ని వాళ్లిదివరకే కూర్చుకుని వుంటారు.

కోలెస్నికోవ్ : మాఅమ్మ కారులో నాకోసం కనిపెట్టుకుని వుంది. చెప్పు. త్వరగా. నువ్వు చెప్పేదేదో.

ఫియోడోర్ : నీ కళ్ళముందర లేకపోతే నాన్నగారేదన్నా తెలివితక్కువ పనిచేసి వూరుకుంటారని భయం. అంతేనా.

కోలెస్నికోవ్ : మహాకోపంగానూ, తాపంగానూ వున్నావు. నీకు కష్టాలూ, బాధలూ కలిగేయంటే ఆ దురదృష్టానికి బాధ్యుడవు నువ్వే గాని మరియెవ్వరూ కాదు. సరే. నీ తిక్కధోరణికి కారణాలు విమర్శిస్తూ కూర్చోడానికి నాకు టైం లేదు. మళ్ళీమాటు చూసుకుందాం. ఇవాన్! పోయివస్తా. (ఇద్దరూ కౌగిలించుకుంటారు. తర్వాత కోలెస్నికోవ్ ఓల్గావేపు చూస్తాడు.)

ఓల్గా : (నేలవేపు కళ్లతిప్పి) నడు, కారుదాకా నేనూ వస్తా.

కోలెస్నికోవ్ : (ఫియోడోర్‌తో) జీవితానందాన్ని పొందగలవని నా హృదయపూర్వకంగా ఆశిస్తూన్నా.

ఫియోడోర్ : (పెద్దగొంతుతో) త-మ ద....య.

(ఓల్గా కోలెస్నికోవ్ వెంట వెడుతుంది.)

తలానోవ్ : ఫియోడోర్ : ఆతని వెనకవెళ్ళి క్షమాపణ చెప్పుకో.

ఫియోడోర్ : డాక్టర్ తలానోవ్ పిల్లల్ని కోప్పడకూడదనేవారు. బహుశా విద్యాబోధనపద్ధతులు వయస్సుతోపాటు మారలేదుకదా?

(తలానోవ్ : నీరసంగా కళ్లు మూసుకుంటాడు. ఓల్గా తిరిగి వస్తుంది. చలిగా వుండడంచేత చేతులు బిగించి కట్టుకుని నడుస్తుంది.)

ఓల్గా : నక్షత్రాలుకూడా పరుగులెడుతూన్నాయా అన్నట్లుకనిపిస్తూన్నాయి.

ఫియోడోర్ : (ఏదో తప్పుచేసినట్లుగా తండ్రితో) నాన్నగారూ! ఇంకా నేనంటే బెదురుతూనే వున్నారా? నామట్టుకు మాత్రం కోరలు పీకేసినట్లుగానే అనిపిస్తూంది.

తలానోవ్ : నీజబ్బు ఏమిటో ఇప్పుడర్థం అయింది. ఫియోడోర్! నీ ఆత్మ చచ్చిపోయింది. (హఠాత్తుగా మూర్ఛ వచ్చినట్లయి.

టేబిల్ క్లాత్ అంచులు గట్టిగాపట్టుకుని కుర్చీలో చతికిలబడతాడు. ఓల్గా సాయంచేయడానికి ముందుకి వురుకుతుంది.)

ఓల్గా : నాన్నా ! ఒంట్లో బాగులేదా ?....కొంచెం మంచినీళ్ళివ్వనా ? (దేమిడ్‌యేవ్నా, భోజనంతీసుకువచ్చి. ఇక్కడిస్థితిచూసి, ఓల్గాకి సాయపడడానికి తొందరగా వస్తుంది) అమ్మకి తెలియనియ్యకు. గొడవ చెయ్యకు, (వారు ఆయనికి మంచినీళ్ళు త్రాగనిచ్చి. తలక్రింద దిండు అమర్చి పడుకోబెట్టినప్పటికి అన్నానికోల యేవ్నా వస్తుంది.) అమ్మా ! మరేంలేదు. ఏం నాన్నా ! ఎలా వుంది. తగ్గినట్లు లేదూ ?

తలానోవ్ : కష్టంరోజులు వచ్చిపడ్డాయి తల్లీ ! పిల్లలు....

దేమిడ్‌యేవ్నా : (ఫియోడోర్‌తో) ఇప్పటిమట్టుకి పో. తర్వాత వద్దువు గాని....(నెమ్మదిగా) నే తలుపుతీస్తానులే.

(ముసలినర్సు వెనకాల నిలబడి సోఫామీద పడుక్కున్నతండ్రినీ, ఆతనిచుట్టూ మూగిన ఆడవాళ్ళనీ తొంగి చూస్తూన్నాడు. అంత చిన్న విషయాలకి అంత తీవ్రఫలితాలు కలుగుతాయన్నది ఆతడు నమ్మలేకున్నాడని ఆతనిమొగమే చెప్తూంది.)

ఓల్గా : (ఫియోడోర్‌వద్దకు పోయి) ఔనురా అన్నయ్యా ; నువ్విప్పుడు వెళ్ళిపోవడమే మంచిది. నాన్న పెందరాళే లేవాలి. చూడూ. తలకిమించిన పని. విపరీతంగా అలసిపోతూంటారు.

ఫియోడోర్ : [కోటు తీసుకుంటూ] ఆతడు నీకు భర్త కాబోతూన్నాడని నే నెరగను. క్షమించు.

ఓల్గా : [కష్టంగా] సాయంకాలంనుంచి ఇక్కడ కూర్చుని నువ్వు గ్రహించిందింతే నన్నమాట.

[దూరాన్నుంచి అంతకంతకి హెచ్చుతూన్న సైరన్‌ధ్వని విన బడుతుంది. ఫియోడోర్ తలఎత్తి, విని బయటికి వెళ్ళిపోతాడు. అంతా ఎక్కడవారక్కడే వుండిపోతారు. నిశ్శబ్దం. ఓల్గా టేబిలువద్ద కూర్చుని ఎక్సర్‌సైజ్‌పుస్తకాలు దిద్దడం ఆరంభిస్తుంది. మధ్య మధ్య చెవుల మీద చేతులు పెట్టి మూసుకుంటూంటుంది.]

అన్నా : (భర్తతో) కొకొరిష్కిన్, ఏవో కాగితాలు తీసుకొచ్చేడు మీ వద్దకని. డేమిడ్‌యేవ్నా! అతణ్ణి పిలు.

డేమిడ్‌యేవ్నా : [వంటింట్లోకి చూస్తూ] ఆఫీస్‌కాగితాలు! ఇల్లా. ఇల్లా, రా. ఆ నిప్పులదగ్గిర కూర్చుని బొగ్గయిపోలేదుకద వీడు.
(ఆమె బయటికి పోతుంది. కోకోరిష్కిన్ గదిలో ప్రవేశించి. జేబులోంచి సిరాబుడ్డితీస్తూ దగ్గిరికి వస్తాడు.]

తలానోవ్ : పాపం నిన్ను చాలసేపు కూర్చోపెట్టేను.

కోకోరిష్కిన్ : అబ్బే. ఫర్వాలేదండి. ఏదో అక్కడ వెచ్చగాకూర్చుని ఓ కునుకు తీసేను.

అన్నా : ఏం కలొచ్చింది? (కంఠంలో బాధసూచన అవుతుంది) కొడుకునిగురించి కాదుకద?

కోకోరిష్కిన్ : నా కలలెప్పుడూ వ్యవసాయం, ఆదాయంమీదనే వుంటాయి. (తోలుసంచి వెతుకుతూ) సీజర్‌డియోక్లెటియాన్ రాచకార్యాలు వదిలేసి, కాబేజీమళ్లు పెంచీవాడట, ఇల్లీరియాలో [చేతులతో చూపుతూ] ఇంతింత పువ్వు పూయించేవాడుట. (ఓ కాగితం అందించి) యుద్ధపుటేర్పాట్లనిగురించిన కాగితం ఇది.

తలానోవ్ : ఇది నర్సులకిచ్చే తర్ఫీదుని గురించికాదూ? (సంతకం పెడతాడు) మనమూ గడిపేం. భవిష్యత్తును గురించి కలలు గంటూ. ఆరోజుల్లోనే నీ పరీక్షయింది. పల్చని ఫ్రాక్ తొడిగి,

ఏంపాట అది.........ఎప్పుడూ పాడుతూనే వుండేదానివి. అప్పుడే మరిచిపోతూన్నా. ఏది ? (అన్నా నికోలయేవ్నా పియానోవద్ద కెళ్ళి, నిలువబడివుండే, బాగా ప్రచారంలోవున్న ఒక గీతాన్ని వాయిస్తుంది.) పాడు. ఇంకాపాడు. ఇక్కడ బహుఅందమైన పోకడలుండాలి.

(మనస్సుని కూడగట్టుకుని, ఆమె పియానోవద్ద కూర్చుండి వాయిస్తూంటుంది. కోకోరిష్కిన్ నిశ్శబ్దంగా కాగితాలందిస్తూంటే, తలానోవ్ సంతకాలు పెట్టుకుపోతూన్నాడు.)

కోకోరిష్కిన్ : ఇంతే. ఇదేఆఖరుది.

(బాంబుపేలిన చప్పుడు. ఇంకా దగ్గరగా రెండోబాంబు పేలిన ధ్వని. కాని, సంగీతంఇంకా సాగుతూనే వుంటుంది. రెండుపరస్పర విరుద్ధశక్తుల మధ్యజరుగుతూన్న యుద్ధం అది. తలానోవ్ ఎదురు చూస్తూన్న గీతభాగం వాయించబడుతూండగా మూడోబాంబు పేలుతుంది. ఇది మరీదగ్గరగా పేలుతుందేమో, ధ్వని వెంటనే ఫళఫళమనిపగిలి పడ్డ గాజుముక్కలుకూడా చప్పుడవుతాయి. దీపం ఆరిపోతుంది. ఆఖరు రెండుచరణాలనీ అన్నా హడావిడిగా వాయించేస్తుంది. తరవాతనిశ్శబ్దం)

కోకోరిష్కిన్ : సిరాబుడ్డి తిరగతోయగలరు. ఒక్కనిమిషం ఆగండి. నేను పుల్లగీస్తా.

అన్నా : ఓల్గా ! దీపం వెలిగించమ్మా. కిటికీలో వుంటుంది.

(ఒక అగ్గిపుల్ల గీస్తారు. అప్పటికే ఓల్గా కిటికీదగ్గరి కెళ్ళింది. బయట తుపాకులుకాల్చిన చప్పుడు, ఏవేవో ధ్వనులూ వినబడుతూన్నాయి. దీపం సరిగ్గా వెలగదు. అందరూ నిలబడివుంటారు. ఫియోడోర్‌ఫొటో నేలనిపడివుంది. ఒక్కక్షణం క్రితం ఆ గదిని చూచిన వారెవ్వరూ ఇప్పటిస్థితిలో అదీ, ఇదీ ఒకటేనంటే నమ్మరు. వంటిం

టోంచి చిన్నకొవ్వొత్తి ముక్క వెలిగించి డేమిడ్‌యేవ్నా పట్టుకు వస్తుంది.)

ఓల్గా : డేమిడ్‌యేవ్నా, చీపురు తీసుకురా. గాజుముక్కలు ఊడుద్దాం. ఫెడ్యాఫొటో పడిపోయింది.

(డేమిడ్‌యేవ్నా వెళ్ళిపోతుంది. గుమ్మంవద్ద సన్నని ధ్వని. తలానోవ్ అటుతిరిగి చూస్తాడు. గుమ్మందగ్గరున్న కుర్చీలో, గంట్లు పడ్డ కర్రనొకదానిని మోకాళ్ళమధ్య నొక్కిపట్టి ఒక ముసలివాడు కూర్చుని వున్నాడు. ఆతడు బట్టతల వూపడం చిరునవ్వు నవ్వడం చూస్తే పలకరిస్తూన్నాడనీ అనుకోవచ్చు. భిక్షం అడుగుతూన్నాడనీ అనుకోవచ్చు.)

తలానోవ్ : (దూరంగా నిలబడి) ఎవరు నువ్వు ? ఎందుకొచ్చేవు ?

ముసలివాడు : భయంవేసి ఇల్లా వచ్చేను. ఆకాశం బద్దలయిపోతూంది.

(ఓల్గా దీపందగ్గరగా తీసుకొస్తుంది. ఆకొత్తయాతడు తొడిగిన చొక్కా, యిజారూ మురికిగా వున్నాయి. ఆతడి కాళ్ళవద్ద ఒక జోలీ, ప్రాచీనపుటోపీ పడివున్నాయి. ఏదేనా కొత్తవస్తువు కనబడితే మూచూసే కుక్కమాదిరిగా కోకోరిష్కిన్ ఆ ముసిలివాడిని అన్నివేపులనుంచీ పరీక్షించసాగేడు.)

ఓల్గా : తాతా ! ఎక్కడనుంచి వచ్చేవు ?

ముసలివాడు : లాజరస్ మాదిరిగా నేనో ప్రేతాత్మని. ఒక దశసరి బట్టలో చుట్టపెట్టి నన్ను పాతేసేరు. నా గోరీమీదపాతిన రాయి ఇంకా నా సమాధిదగ్గర కాపలాగా నిలబడే వుది. (కర్రతో నేల మీద కొడుతూ, దీక్షగా గది మూలవంక చూస్తాడు. అందరూ ఆతని చూపులనే అనుసరించి గదిమూలకి చూడసాగేరు.)

సమాధీ : నీ ముసుగు నెందుకు తీసేవు ?

అన్నా : (చాల నెమ్మదిగా) బహుశా రోగిఅయి వుంటాడు....నీ దగ్గిరికి చూపడానికి తీసుకొొచ్చి వుంటారు.

తలానోవ్ : (డాక్టర్ల గొొంతుతో) తాతా! ఎంత సేపటినుంచి తిరుగు తున్నావు ?

ముసలివాడు : ఎంత సేపటినుంచా ? ఎల్లా చెప్పను. ఒక్క ఏడాది - ఒక్క ఏడాదిమాత్రమే నంటుంది మనస్సు. కాని, కాళ్లుమాత్రం అలసి సొలసి మూడువందలు! మూడువందలేళ్ళయింది. అంటు న్నాయి. ఈరెంటిలో ఏది నిజం అనుకోను ?

ఓల్గా : తాతా! నువ్వు దారితప్పి వచ్చేవు.

ముసలివాడు : ఇది ఫెయూనిన్ ఇల్లుకాదూ ?

తలానోవ్ : అవును. కాని, ఫెయూనిన్‌కి రెండిళ్లున్నాయి. దానిఇంటి సంఖ్య నాకు జ్ఞాపకంలేదు గాని స్క్వేర్ ఆవలవుంది మరో యిల్లు. బహుశా అక్కడి కెళ్ళాలవి బయలుదేరి వుంటావు. అందులోకూడా ఓ డాక్టరున్నాడు. కా నయితే ఆమనిషికి గడ్డం వుంచి. అంతే తేడా. ఆయన దెయాల్ని కుదర్చడంలో ఘట్టి వాడు. అతనిదగ్గిరికి వెళ్లు.

అన్నా : విమానదాడి అయిపొయ్యేవరకూ కూర్చోనివ్వండి.

ముసలివాడు : ఆమాత్రం దయ చూపించేవు. నమస్కారం అన్నా నికోలయేవ్నా !

అన్నా : (అదిరిపడి) నాపేరెల్లా తెలుసు ?

ముసలివాడు : బహుశా కలలోవిని వుండొొచ్చు చూడు. ఆ పడకకుర్చీ దిండ్లుకుట్టిన కుర్చీ. ఆకుర్చీ ఎన్నోమాట్లు నాకలలోకి వచ్చింది. దాని క్రిందభాగంలో కాలిన మచ్చవున్నట్లు గుర్తు.

ఓల్గా : తాతా ! పొరపాటుపడ్డావు. దీనిదిగువని ఆమాదిరిగుర్తులేవీ లేవు.

ముసలివాడు : ఉహూ. కాదు. ఉండాలి తల్లీ ! నా కలలో చూస్తేనే. ఒక ఉంగరం నేలమీదపడి దొర్లిపోయింది. బంట్రోతుచేతిలో దీపం పుచ్చుకుని ఉంగరంకోసం వెతకడంలో ఇంచుమించు కొంప తగలపెట్టేడు.

తలానోవ్ : నాకటువంటి దేమీ జరిగినగుర్తు లేదు.

ముసలివాడు : ఇవాన్ తిఖానోవిచ్ : పోనీ పరీక్షించి చూడ్డానికి అభ్యంతరం ఏం వుంది ? ఈకర్ర పట్టుకో అమ్మా ! (కోకోరిష్కిన్‌తో) ఒరేయ్ ! కొంకిరికంపా రా, సాయం చేద్దువుగాని.

(అతడూ, కోకోరిష్కినూ పడకకుర్చీని ఒండిగిలపడేస్తారు. అడుగున ముడిచిన కాన్వాసుగుడ్డమీద కాలినమచ్చ స్పష్టంగా కనబడుతూంది. తలానోవ్ కుటుంబంవారు ముఖాలు చూసుకుంటారు)

ముసలివాడు : నికోలాయ్ సెర్జివిచ్ ఫెయూనిన్ ఆఫీసుగదిలోకి కుర్చీ వచ్చిననాటికి బహుశా నువ్వింకా పుట్టివుండవు అమ్మాయీ.

(వాతావరణంలో మార్పు స్పష్టంగా కనబడుతూంది. కోకోరిష్కిన్ ముసలివాడికి ఎంతో వినయవిధేయతలతో వొంగి వొంగి దండాలు పెడుతూన్నాడు.)

కోకోరిష్కిన్ : నికోలాయ్‌సెర్జివిచ్ ! స్వాగతం. ఎంతో కాలంనుంచి నీకోసం ఎదురుతెన్నులు చూసి కళ్లు కాయలుకాచిపోయినాయి. చివరికి వచ్చేవు. బాగుంది.

ముసలివాడు : తొందరపడకోయ్. అంతా తెలుస్తుంది. (అతనివైఖరిలో బింకం కనబడుతుంది. ఉన్నట్లుండి, పడుచుతనం వచ్చినట్లు కనబడతాడు. గబగబ టెలిఫోన్‌వద్దకెళ్ళి, తిప్పుతాడు. సెం

ట్రల్.... సెంట్రల్.... (అధికార స్వరంతో) ఇంతవరకూ సమాధానం ఇవ్వకపోవడంలో నీవుద్దేశ్యం ఏమిటి ?.... నేనా ?.... మేయర్.... ఫెయూనిన్‌ని.... ఎందుకల్లా వణుకుతావు ?.... నిన్ను కరవనులే. పోలీసుస్టేషనుకి కలుపు.... (చక్రం మళ్ళీ తిప్పుతూ) పోలీస్ !.... పోలీస్.... హారిదేవుడా ! ఒక్కడూ వినిపించుకోడు. ఉద్యోగులంతా ఏమైనట్లు ?

కోకోరిష్కిన్ : (వంగి, వంగి, సలాములు కొడుతూ) భయంతో తలో సిరాబుడ్డీ వెతుక్కునుంటారు. హి. హీ....

(ఫెయూనిన్ రిసీవరుక్రిందబెట్టి శరీరంమీద శిలవ గీసుకుంటాడు)

ఫెయూనిన్ : ఓభగవాన్ ! మాయీ శుభదినాల్ని ఆశీర్వదించు. (ఆఇంటి గోడలు రాతితో కట్టబడివున్నాయి. అయినా వెలుపలినుంచి మర ఫిరంగికాల్పులూ, కేకలూ, అరపులూ, ఇనపవస్తువు లొకదాని నొకటి కొట్టుకున్నప్పుడు కలిగే ధ్వనులూ స్పష్టంగా వినిపిస్తూన్నాయి.) ప్రభూ ! ఈ సేవకుడిరోజులు సుఖంగా గడిచిపోనీ. నా కళ్ళతో....

(గాజువస్తువులు క్రిందపడి భళ్లున పగిలినధ్వనిలో ఆతని సణుగుడు వినబడదు. బయటనుంచి ఎవరో తుపాకిపడమతో కిటికీ తలుపులు పగలకొట్టేరు. షట్టర్లు విరిగి పడిపోయినాయి. కిటికీవద్ద ఉక్కుటోపీలతో సోల్జర్లమొగాలు కనబడతాయి. ముఖాలు వికృతంగా వున్నాయి. తగులబడుతూన్న ఇళ్ళవెలుగులో వాళ్ళ ముఖభాగాలు మరింత వికృతంగా కనబడుతూన్నాయి. వాళ్లు జర్మనులు.)

---

రెండో అంకం:

(ఆ చిన్నపట్టణం ఆక్రమణపీడలో గిలగిలలాడిపోతూంది. గది అదే గాని. ఏదో లోపం కనబడుతూంది. నలిగిపోయినట్లు, మసకగానూ కనబడుతూంది. ఫియోడోర్ ఫొటో అక్కడ లేదు. ఆ పటంమేరా గోడ తెల్లగావుంది. చుట్టువారా సాలిగూళ్ళు, పైనమేకూ కనబడుతూన్నాయి. సామానంతా అక్కడా యిక్కడామార్చబడింది. అంటుపళ్ళేలింకా టేబిలుమీదనే వున్నాయి. తెల్లవారింది. మధ్య కిటికీలో నుంచి మంచునిండిన వీధీ, కొండమీద సగం కూలిపోయిన చర్చీ కనబడుతూన్నాయి. ఆరాత్రి విరగగొట్టబడిన కిటికీకి ప్లయ్‌వుడ్ పీలికలూ, దళసరి కంబళిఅడ్డం పెట్టబడివున్నాయి. పైనుంచి ఏదో మగగొంతుకలో ఈడుస్తూ పాట వినబడుతూంది. శీతాకాలపుదుస్తులు ధరించి, ఓల్గా, వీధిలోకి వెళ్ళేప్రయత్నంలో వుంది. అన్నా నికోలయేవ్నా తలుపుగడియ పట్టుకుని నిలబడివుంది.)

ఓల్గా: ఒక్కనిమిషం వుండడానికి లేదమ్మా!

అన్నా: ఓల్గా! నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. వెళ్ళనియ్యను.

ఓల్గా: నీకు చెప్పినా తెలియదేమే; అమ్మా! అరవైమందిలో ముగ్గురే వున్నారను. అయితేనేం? వాళ్లు వస్తారు. వచ్చినప్పుడు చెప్పకపోతే ఏలాగ?

అన్నా: కూర్చుని, కొద్దిపాటి తెలివి యుపయోగించి మాట్లాడు. ఈవేళ నువ్వుచెప్పే పాఠాలేమిటే అమ్మా! తనపిల్లవాడిని బడికి పంపించే మతిలేనితల్లి ఎవరుంటుంది. (ఒకదానివెనక మరొకటి రెండు తుపాకికాల్పులు వినబడతాయి.) ఓల్గా! ఆ కిటికీదగ్గర నుంచి ఇవతలకి రా.

ఓల్గా: (కిటికీదగ్గరినుంచి కదిలి) మా బళ్ళో చదువుతూన్న కొందరు పిల్లలకి ఇంట్లో ముసలాళ్లుతప్ప మరో దిక్షత లేదు. వాళ్ళకి బ్రహ్మచెముడు. పిడుగులుపడ్డా వినిపించదు.... నేను వెళ్లాలి.... వెళ్ళి తీరాలి.... నాకు జీతంఇస్తూన్నది దేనికి?

తలానోవ్ : (ప్రక్కగదినుంచి) అన్నా ! దానినేదో పని చేసుకోనియ్యి.

అన్నా : ఇవాళ ! ఉన్న కూతుర్నికూడా చేయిజార విడుస్తావా ? మన కదొక్కర్తేగా ఇప్పుడు మిగిలింది. (వంటింట్లోంచివచ్చిన దేమిడ్యేవ్నాతో) ఏమిటాపాట ? ఏమిటా శోకన్నాలు....

దేమిడ్యేవ్నా : మేడమీదిగదులు వాళ్లు తీసేసుకున్నారు. ఆభాగంఅంతా ఆక్రమించేసేరు. ఏమూల చూసినా వాళ్లే. సోల్జర్లే. వాళ్ళమొహం మండా. (రహస్యంగా) మరోనలుగురు జర్మన్లు ఈవేళ బయ నెట్లతో పొడిచి చంపివెయ్యబడ్డారుట. వెనకటివాళ్ళకి మల్లేనే వీళ్ళకీ చీట్లు తగిలించేరట.

అన్నా : ఏమని ?

దేమిడ్యేవ్నా : అన్నికాగితాలమీదా కూడా "సుస్వాగతం" అని వ్రాసి వుందిట. ఇంక చూడు వీళ్ళు తీసుకుపోతూన్న జనాన్ని. మన యింటిగోడకి పోస్టరు అతికేరు. వాళ్ళకి ఏమాత్రం ఆచోకీ యిచ్చినా పెద్దబహుమతు లిస్తామంటూన్నారు. మూల మూలలు వెతికేస్తున్నారు.

అన్నా : ఎవరికోసం ఆవెతకడం ?

దేమిడ్యేవ్నా : దేముడికే తెలియాలి. ఎవరో ఆంద్రీట. నే నెరిగున్నం తవరకు ఈ పట్టణంలో ముప్పయిమంది "ఆంద్రీ" లున్నారు.

ఓల్గా : అదంతా మనకి అనవసరం. మనకి యుద్ధంతో పనిలేదు. ఇల్లాంటివాటల్లో వేలెట్టకుండా మనపని మనం చేసుకుపోవడం అంత ఉత్తమం లేదు, నన్నడుగుతే.

దేమిడ్యేవ్నా : ఏం వొచ్చినా నేను రష్యన్దాన్నే. జర్మనీవాళ్లకి దాసోహం చెయ్యలేను. (నొచ్చుకుంటూ) బంగాళాదుంపలు వెనక పాకలో వున్నాయి. పొడూగునా జర్మన్లే. అనిస్కాని పంపనా! అదయితే వాళ్ళ కన్ను కప్పి క్షణంలో బుట్టలోపెట్టగలదు.

అన్నా : కొంచెం గొడవలు అణిగేవరకూ ఎవ్వరూ ఇల్లువిడిచి వెళ్ళకండి. బల్ల తుడవాలి. అనిస్కాని ఓమాటు ఇల్లా పంపు. (డేమిడ్‌యేవ్నా వెడుతుంది. ఓల్గాతో) లోంట్యేవోలో ఏమేం జరిగేయో అడుగు. చెబుతుంది. (వీధిలోకి వెళ్లేటందుకు వేసుకున్నదుస్తులు తియ్యకుండానే బల్లవద్ద కూర్చుంటుంది. అనిస్కా ప్రవేశం)

అనిస్కా : అమ్మమ్మ వెళ్ళమంది. ఏం చెయ్యాలి ?

అన్నా : ఆ కంచాలు తీసి, బల్ల శుభ్రంచేయి. పగిలిపోతాయి సుమీ· జాగ్రత్త. (అనిస్కా బహుజాగ్రత్తగా బల్లమీది కంచాలూ, గ్లాసులూ తీస్తూంది.) నువ్వు లోంట్యేవోనుంచి వట్టినే పారిపోయి వచ్చేవుట. ఓల్గాఅంటూంది.

అనిస్కా : (వాదిస్తూన్నట్లుగా) వట్టినే పారిపోయొచ్చేనని ఎల్లా అనుకున్నారు ? అన్నా ! వాళ్ళు పిచ్చికుక్కల్లా తయారయ్యేరు· మన ఆడవాళ్ళచేత నానాచాకిరీ చేయించుకునేవారు. పడుచు వాళ్లగపడితే ఈడ్చుకుపోయి నానాఅల్లరీ చేసేవారు. కనిపించిందల్లా జేబులో వేసుకోవడమే. నాకో స్నేహితురాలుంది. మే మిద్దరం బళ్ళో ఒక్కబెంచిమీదనే కూర్చుండీవాళ్ళం. వాళ్ల చేతుల్లోంచి బయట పడేటప్పటికి ఒంటిమీద ఒక్క గుడ్డలేదు. అవమానం భరించలేక చెర్లోపడి చచ్చిపోయింది. (పల్లెటూరిపద్ధతిలో చొక్కాకొనతో కన్నొత్తుకుంటుంది.) మా చెరువు జ్ఞాపకంపుందికాదూ?

అన్నా : లోంట్యేవోచెరువు గుర్తులేదూ. చుట్టూ చెట్లూ అవీ వుండేవి. (ఓల్గా తనని కానట్లు కిటికీవెలుపలికి చూస్తూ కూర్చుంటుంది.)

అనిస్కా : వాళ్ళల్లో ఓ ఆఫీసరుండేవాడు. అందరికన్నా కిరాతుడు. చక్కని జుట్టు. కుంటుతూ నడిచేవాడు. ఒకపిల్లని చెరిచి,

ఆమెవీపుమీద లక్కతో సీలు వేసేడు. అన్నా! ఏమిటా పని చెప్పు. ఇదేం కవరుత్తరం అనుకున్నాడా సీలువెయ్యడానికి?

ఓల్గా: (మనస్సు నిశ్చయపరచుకుని) అమ్మా: పోతున్నా. ఇంక ఆగితే పొద్దుపోతుంది.

అన్నా: ఓ చిరుగులగుడ్డ పైన కప్పుకొని ముసిలిదానల్లే గూనిగా నడు. చింకిరిగుడ్డలవాళ్ళనీ, గూనిగా నడిచేవాళ్ళనీ వాళ్లంత పట్టింపుగా చూడరు.

(ఓల్గా తలుపుతెరిచి వెంటవే మూసేస్తుంది. పోట్లాడుతూన్న గొడవ వినబడుతుంది. దేమిడ్‌యేవ్నా సణుగుడు, ఫెయూనిన్ పెంకి ధోరణీ వినబడతాయి.)

ఓల్గా: (పక్కగదిలోవున్న తండ్రితో) నాన్నా! మిమ్మల్ని ఎవరో పిలుస్తున్నారు. ఆనందమయజీవితం ఆరంభం అవుతూంది. అధికారి కాబోయే పెద్దమనిషినుంచి పిలుపువచ్చింది. నే దొడ్డిదారిని పోతా. (వెను తిరుగుతుంది.) మరేం భయంలేదే అమ్మా! త్వరలోనే వస్తా.

(ఓల్గా వెడుతుంది. తోసుకువస్తూన్న ఫెయూనిన్‌తో తగువు పడుతూ దేమిడ్‌యేవ్నా వస్తుంది. ఫెయూనిన్ ఏనాటిదో మూలబడివున్న ఒక వేసవిదుస్తును తొడుక్కున్నాడు. టాప్‌బూట్లు, వెడల్పయిన మెడపట్టీ, బట్టతలా గవ్వ మెరుగుపెట్టినట్లు నిగనిగలాడుతూన్నాయి. ఆతనివేషం చూసినా, ధోరణి చూసినా విప్లవం రాకపూర్వం, జారుల కాలపునాటి పోలీసుగూఢచారులు జ్ఞాపకం వస్తారు.

ఫెయూనిన్: అమ్మాయి! అట్టే పరియాచకాలాడకు మరి. నేను ముసలాణ్ణయిపోయేను. నీ పనేదో చూసుకో. పరియాచకం కట్టిపెట్టు.

దేమిద్‌యేవ్నా : లాజరస్‌వయినా, వాడమ్మమొగుడివయినా నాకేంలెక్క లేదు. ఈమారు మళ్ళీ తలెత్తకుండా మరింత లోతుగొయ్యి తీసి మరీ పాతేస్తాం.

ఫెయూనిన్ : ఓరిబాబో ! ఇదెక్కడి అరదిరా. ఇదిగో, ఏమమ్మోయ్ నావొళ్లు మండించక ఇక్కడనుంచి లేచిపో.

తలానోవ్ : (ఫెయూనిన్‌ని సమీపిస్తూ) మంచిమాట చెప్పేవు. దేమిద్ యేవ్నా ! నువ్వు వెళ్లిపో. (సణుగుతూ, గొణుగుతూ, ఆమె తప్పుకుంటుంది.)

ఫెయూనిన్ : పరమశాంతులయినవారిని కూడా గాభరా ఎత్తించేలా వున్నాయి ఈనాటి పరిస్థితులు. అటువంటప్పుడు చూడం డీవిడ నాముందర ఏపద్ధతిగా మాట్లాడుతూందో. అప్రాచ్యురాలు! (అంద రినీ వుద్దేశించి) మీఅందరికీ వందనాలు. అరుణోదయమైంది. సూర్యుడుదయించ బోతూన్నాడు. (ఎవ్వరూ మాట్లాడరు. ఎవ రేనా సమాధానం ఇస్తారేమోనని అగుతాడు.) రాండి. కాస్త ఎదు రొచ్చిస్వాగతం ఇవ్వడం తప్పా. వెనకటిమాదిరిగా అద్దె వసూ లుకి రాలేదులెండి. మీతో మంచిగావుండదలచే వచ్చేను. అందుకే ఒంటరిగా వచ్చేను. లేకపోతే సిబ్బందీతో రాకపోయేనా ? దీన్ని పట్టే నా అభిప్రాయం తెలుసుకోవచ్చు.

అన్నా : ఫెయూనిన్ ! ఎందుకు మమ్మల్ని బెదిరించబోతావు ?

ఫెయూనిన్ : దిక్కు మొక్కులేని అనాథపక్షిని నేనా మిమ్ము బెదిరించ డం ?మీయిల్లు చిలకల కదుపులా వుంది. నాకు కూర్చుండు క్కూడా చోటులేదూ ? ఎంత పరువుగా బ్రతికేను ? ఎంత పెద్ద కంపెనీ నడిపేను. ఫెయూనిన్ బట్టలు పాముకూసాలకన్న సున్నితంగా వుంటాయని ఓపారిస్‌పత్రిక వ్రాసింది....పోయింది. సమస్తం ! నాబిడ్డకూడా శ్మశానంలోకి చేరిపోయేదు;

దేమిడ్‌యేవ్నా : మరేం చేస్తారు ? వెధవ జానెడప్పుడే విషం కక్కేడు.

ఫెయూనిన్ : (టక్కున తిరిగి చూస్తాడు.) ఏమిటన్నావు ? జాగ్రత్త ! ఎంత దిక్కూ మొక్కూలేని అనాధనైనా కాటు వెయ్యగలను. జాగ్రత్త ! ముసిలీ :

తలానోవ్ : దేమిడ్‌యేవ్నా ! ఇంతవరకు ఆకత్తిగుర్తు నా కోటుమీద కుట్టనేలేదు కాదూ ? పుస్తకాలగదిలోకి తీసుకెళ్ళు. అన్నాయేనా కుడుతుంది. [ఆయన వుద్దేశ్యాన్ని అర్ధం చేసుకుని ఇద్దరూ వెళ్ళిపోతారు.] మిస్టర్ ఫెయూనిన్ ! నాతో పనుండి వచ్చారనుకుంటా.

ఫెయూనిన్ : అవును. ఇక్కడికి రెండురోజులనుంచి మీతో మాట్లాడాలని సంకల్పం. [గది తుడుస్తూన్నట్లు నటిస్తూ, పనికట్టుకుని ఫెయూనిన్‌మీదికి దుమ్ము తుడుస్తూంటుంది అనిస్కా.] గుమ్మంలోకి వెళ్ళి, కారు రాగానే నాతో చెప్పు. వెళ్ళాలి. (అనిస్కా పరుగెత్తుతుంది.) ఇవాన్ ! కూర్చుని మాట్లాడుకుందాం. నిల్చునుండగా ఎవరేనా చూస్తే, ఈముసిలాళ్ళిద్దరూ పోట్లాటకి తలపడుతున్నారనుకుంటారు.

తలానోవ్ : మీ యిష్టం. కానియ్యండి.

ఫెయూనిన్ : శుభదినాలు వస్తూన్నాయి. కొన్నిచోట్ల నెమ్మదిగావచ్చినా మరికొన్నిచోట్ల చురుగ్గావచ్చినా మొత్తంమీద మంచిరోజులు వస్తూన్నాయి. పవిత్రమైన స్పాస్కీ ద్వారంగుండా "ఆర్కేంజిల్ దేవాలయా"న్ని ప్రవేశించే శుభదినాలుకూడా ఆట్టేరోజులు లేదు. అటువంటి స్వర్గంకి కొంతకాలం దూరం చేయబడ్డా, మళ్లీ అక్కడ అడుగుబెట్టగలిగినందుకు ఆభగవంతుడిముందు చప్టా రాళ్ళమీద మోకరిలబడి కన్నీళ్ళతో అభిషేకం చేయగలిగేరోజు

త్వరలోనే వస్తుంది. (యాదాలాభంగా) క్రెమ్లిన్‌లోకి వెళ్ళి ఎంతకాలం అవుతుంది?

తలానోవ్ : చాలాకాలం అయింది.

ఫెయూనిన్ : నాకూ తీరుబడీ, అవకాశం లేకపోయింది. (తన ఖైదు శిక్షను సూచిస్తూ, వ్యంగ్యంగా) చూసేరూ, మొదట్లో దేశం అంతా తెగతిరిగేను. తర్వాత ఏకాంతవాసంలో నిట్టూర్పులు విడిచేను. ఆతర్వాత ఎక్కడో మూలని, సైబీరియాలో కట్టడపు పనుల్లో పాల్గొన్నా.....(తలానోవ్‌లో హఠాత్తుగా మార్పు రావడం గుర్తిస్తాడు.) ఊ. ఏదేనా చెప్పదలుచుకుంటే....

తలానోవ్ : నాకీ రహస్యాలన్నీ ఎందుకు చెబుతూన్నారో....నా కర్థం కావడంలేదు.

ఫెయూనిన్ : మనిద్దరం ఒకేమారి పడవలో వున్నాం గనక. ఇంత వరకు పెత్తనం చెలాయించినవాళ్లు చేసేరని చెప్పుకోదగ్గ మంచి మన యిద్దరి విషయంలోనూకూడా సున్నే. మన ఇద్దరి కొడుకులూ ఒకేఖైదులో నివసించేరు. పైగా....(గడియారం తీసి చూసి. నాలిక తాటిస్తాడు.) అబ్బ! చాల ఆలస్యం అయింది. అసలుసంగతికి వద్దాం. ఈయిల్లూ, ఇందులోవున్న సామాన్లతో సహా సేనాధిపతి ఆఫీసుకిగాను తీసుకోడానికి నిర్ణయించేరు. మొదట్లో స్కూలు తీసుకుందామనుకున్నారు. మీటల్గా పనిచేయడంలేదూ. ఆస్కూలునికాని, అది తగులబడి పోయింది. ఈ రోజుల్లో మరమ్మతులు చేయించడం అంటే ఎంతకష్టమో ఎరగరు కనకనా....విబ్బెల్ అడ్డుటాంటూ, సేనాధిపతీ, మిస్టర్ మోసాల్‌స్కీ వస్తూన్నారు; ఇల్లు చూసుకుందుకు, అంటే ఈ ముసిలితనంలో మిమ్మల్నీ - భార్యనీ నడివీధిలో పడెయ్యడం అన్నమాట..... కాని (స్నేహం ఉట్టిపడేటట్లు తలానోవ్

చెవిలో) శివుడిఆజ్ఞ లేకుంటే చీమకూడా కుట్టదు. పెద్దపులుల్ని కూడా వేటాడే విబ్బెల్‌కి ఎలకలంటే తగని భయం. పీటర్‌చక్ర వర్తికిమల్లేనే. ఎలకపేరు చెప్పి నెమ్మదిగా తోలేస్తే ఏలా వుంటుందంటారు ?

తలానోవ్ : ఎవరెందుకు మాట్లాడుతూన్నారో తెలుసుకోగల శక్తికాద్దో గొప్పో నాకుంది. కానీండి. అసలువిషయం చెప్పండి.

ఫెయూనిన్ : మీ యిష్టప్రకారమే కానీండి. (ఖరా ఖండీగా) ఈవేళ ప్రొద్దుట మరి నలుగురిమీద అదే ట్రేడ్‌మార్క్ కనబడింది.... అంటే ఇంకా ఓ హాస్యగాడీపట్టణంలో మిగిలిపోయాడన్నమాటే కాదూ ? పేరు ఆండ్రీట. ఈఆండ్రీ ఎవరై వుంటాడంటారు ? చివరికి ఒక్కఫొటోగ్రాఫు దొరికినా ఆ మొనగాడి ముఖం ఓమాటు చూడాలనివుంది.

తలానోవ్ : నే నెప్పుడూ ఫొటోయితియ్యడంవృత్తి పెట్టుకోలేదు. ఆండ్రీ యన్న పేరుగలమనిషిని నే నెరగను. నా స్నేహితుల్లో చాల మంది "ఇవాన్" పేరింటివాళ్లే. నాపేరుకూడా "ఇవానే"

ఫెయూనిన్ : చూడండి. పాపం. ఏ అన్నెం పున్నెంఎరగని జనం బాధపడిపోతారు. విబ్బెల్ మహాకోపి. అయినా తాటాకుమంట లాంటిది. ఎంతోసేపు వుండదు. కానీ, "స్ప్రీ" ఎప్పుడూ ప్రక్కనేవుంటాడు. స్ప్రీమాత్రం బాబో....ఎప్పుడేనా యము లాణ్ణి చూసేరా ? ఆ యములాడే స్ప్రీకి ఆఫీసులో దొరికితే, నేలనిబెట్టి రాసేసి, ఊరిబైట వ్రేలాడదీసేస్తాడు. అల్లాంటివాడు. ఈ ఆండ్రీ ఎవడో వాడిముందర కుప్పిగంతులు వెయ్యబోతూ న్నాడు. "మొజాయిస్క్" స్వాధీనం అయిపోయింది. "బైనా క్యులర్ల"లో చూస్తే ఆర్కెంజిల్ కేథడ్రెల్" మీది పిచికలుకూడా కనబడుతూన్నాయట....(తలానోవ్ కళ్ళలోకి గుచ్చి చూస్తూ)

మీకు వాడెప్పుడేనా అగతగిలితే తుంటరిపనులు చేసి మన పట్టణంలో లేనిపోని గొడవలు తీసుకురావద్దని చెప్పండి.

తలానోవ్ : ఎవరితో చెప్పమంటారు ? స్వరీతోనా, యములాడితోనా, లేక ఆర్కేంజిల్ కాథడ్రెల్ తోనా ?

ఫెయూనిన్ : (అమాయికంగా) కాదు. ఆండ్రీతో.

తలానోవ్ : ఎలాగ చెప్పడం ? నడివీధిలో నిలబడి పేరెట్టి పిలిచేదా ?

ఫెయూనిన్ : ఆ. పరిహాసం ! అట్లా పిలిస్తే పలుకుతాడేమిటి ?....ఏదో తొందరపన్నుందని ఓ ఉత్తరం వ్రాసి పంపండి. మీకు వాడిఎడ్రసు తెలుసునటగా ? కోకోరిష్కిన్ చెప్పేడు. ఆవుత్తరం చూసుకు వస్తాడు.

(ప్రేమతో అభిమానం ఉట్టిపడేలాగ డాక్టరు భుజం తట్టుతాడు. తలానోవ్ బరబరా కుర్చీ వెనక్కి గెంటుకుంటూ లేచి నిలబడతాడు.)

తలానోవ్ : ఫెయూనిన్ ! ఈమాటుకూడా దారితప్పి వచ్చేరు. ఇంత వరకెప్పుడూ ఈవుద్యోగం నే చేసివుండలేదు.

ఫెయూనిన్ : (లేస్తూ) ఉద్యోగం ఏమిటి ?

తలానోవ్ : ఉరితీసే వుద్యోగం. అది నా తలకి మించినపని. అందుకు తగ్గటపిక నాకు లేదు. త్రాడుకి మైనం పట్టించాలి. శవాన్ని భుజాలమీదేసుకుని ఈడ్చెయ్యాలి....

ఫెయూనిన్ : ఔనౌను. కాని....ఎక్కడ చూసినా కోకోరిష్కిన్ తిరుగుతూ కనిపిస్తూన్నాడు. వాడీమాట ముందుగా ఏమోసాల్ స్కీ చెవినో పడేస్తాడని నాభయం. (ఆశతో) అయినా తొందరలేదు. ఈవేళ కాకపోతే రేపు. ఏమంటారు ? (అనిస్కా బెదిరి పారిపోయి వస్తుంది.) ఏమిటాఅల్లరి ?

అనిస్కా : ఎవరో జనరల్‌వచ్చేడు. (ఇటూ అటూ కలియతిరిగి ఎవరూ చూడనప్పుడు తెరవెనక దూరుతుంది.)

(ఫెయూనిన్ కిటికీలోంచి బయటికి చూస్తాడు.)

ఫెయూనిన్ : ఇవాన్ ! సిరివస్తూంటే మోకాలొడ్డవద్దు. అడుగో విబ్బెల్. (నిటారుగా నిలబడి అభివాదనంతో తలవొంచుతాడు )

(మోసాల్‌స్కీ వస్తాడు. దేశంనుంచి పారిపోయి విదేశాలలో పెరిగిన రష్యను. ఏతంద్రిబాపతో కకేషియను టోపీపెట్టుకుని. ఆఫీసర్లు తొడిగే కోటుతొడిగేడు. అడ్జుటెంట్ "కుంజ్" కి దారి ఇవ్వడానికి ప్రక్కకి నిలబడతాడు "కుంజ్" కుంటివాడు. పొగ రంగు ఉంగరాలజుట్టు) కుంజ్ ! * Achtung

(విబ్బెల్ ప్రవేశిస్తాడు. పొడుగాటి, వయసుమళ్ళిన వుద్యోగి. పొడుగుపాటికోటు తొడుక్కున్నాడు. చలికి బిగిసిపోయిన చెవులు రుద్దుకుంటూ లోపలికివస్తాడు. ఆయనిని కలుసుకుందుకు ఫెయూనిన్ ఆతురతతో ముందుకు వస్తాడు.)

ఫెయూనిన్ : [చేతులు నలుపుకుంటూ] తమరు నాయింటికి దయచేయడం నాకు మహాసంతోషంగా వుంది. నా జీవితంలో హెచ్చుభాగం ఈయింట్లోనే గడిపేను. నా కొడుకు యిక్కడే పుట్టేడు. కమ్యూనిజంతో జరుగుతున్న పవిత్రపోరాటంలో ఆతడు తన ప్రాణాలిచ్చేడు. నాపేరు ఫెయూనిన్ మేయర్ని.

కుంజ్: + Zuruck !

విబ్బెల్ : (కుంజ్‌తో ఏదో వ్యాసం చదువుతూన్నట్లు నెమ్మదిగా. ఆచి ఆచి) ఈదేశంలో వున్నంతవరకు నా ఆఫీసర్లు రష్యన్‌భాష మాట్లాడితీరాలని ఆజ్ఞ లిదివరకే జారీచేసేను. తెలుసా ? [సగం తిరిగి] "స్లొక్కవే" కి ఏమిటి ?

మోసాల్‌స్కీ : [ఆతని చెవిలో] బానిస.

విబ్బెల్ : బానిసకి యజమాని భాష తెలియకపోవచ్చు. కాని యజమానికి బానిసయొక్క భాష తెలిసితీరాలి.

కుంజ్ : [సిగ్గుపడ్డట్టు నటిస్తూ] చాలాకష్టం. హెర్ మేజర్!

విబ్బెల్ : [కోపంతో] నేను రష్యణ్ మాటాడటంలేదూ? [తలానోవ్‌ను చూపిస్తూ] ఎవరది?

ఫెయూనిన్ : [అధికార యుతంగా] తలానోవ్. ధన్వంతరిశిష్యకోటిలో వాడు. ఈవూరే.

[విబ్బెల్ మోసాల్‌స్కీ వేపు తిరుగుతాడు.]

మోసాల్‌స్కీ : [చెవిలో] Arizt. (డాక్టరు)

విబ్బెల్ : బెల్లంకొట్టిన రాయిలా నోరుమూసుకునల్లా నిల్చుంటాడేం?

ఫెయూనిన్ : హెర్ విబ్బెల్ దర్శనం కలిగిందనే సంతోషంతో డాక్టరు పరవశుడై పోయాడు.

మోసాల్‌స్కీ : ఫెయూనిన్! హెర్‌కమాండెంటుతో మాట్లాడేటప్పుడు హెర్‌మేజర్ అని సంబోధిస్తే నీమర్యాద దక్కుతుంది.

విబ్బెల్ : దానికేంలే. [తలానోవ్‌తో] పలుకే బంగారమయిందేమయ్యా!

ఫెయూనిన్ : డాక్టరు తలానోవ్ కొడుకుకూడా సోవియటు ప్రభుత్వానికి విరోధే.

తలానోవ్ : [సిగ్గుపడి, ఆవేశంతో] అబద్ధం....నిజం కాదు! పచ్చి అబద్ధం.

ఫెయూనిన్ : వినయంకొద్దీ ఆలాగ నంటున్నారు....వీరోచితమరణం పొందిన నా కొడుకు గావ్రిలా, తలానోవ్‌కొడుకూ యిద్దరూ

---

* సరిగ్గా - నిలు.

+ వెనక్కి.

సోవియటుప్రభుత్వంతో యుద్ధం చేసేరు.

[విబ్బెల్ కనుబొమ్మలు ముడేస్తాడు.]

మోసాల్‌స్కీ : ఫెయూనిన్ ! నీ కొడుకుసంగతితో చెవులు తడకలు కట్టిపోతూన్నాయి. ఈమారు ఆపేరెత్తేవంటే వాడిదగ్గిరికి సరాసరి ప్రయాణం కట్టించేస్తా. [తలానోవ్‌తో] నాప్రశ్నలకి సమాధానం చెప్పు. ఈయింటికెన్ని గుమ్మాలున్నాయి. ఇంట్లో గదులెన్ని వున్నాయి ?

తలానోవ్ : నువ్వు పుట్టిననాటికే నేను నా మాతృ దేశంకోసం చేస్తూన్న సేవలో పదేళ్లు జరిగిపోయింది. (ఒక్కక్షణం వూరుకుంటాడు.) మూడు గదులు. వంటిల్లు. రెండు దొడ్లు.

మోసాల్‌స్కీ : (కళ్లు నేలవేపుతిప్పి) నేలమాళిగకానివుందా ? (తలానోవ్ తల తిప్పుతాడు.) హెర్ మేజరు దయవుంచి గదులుచూస్తే బాగుంటుంది.

ఫెయూనిన్ : (ముందు దారిచూపుతూ పరుగెడుతూ) దయచెయ్యండి. ఇది పుస్తకాలగది. నాలుగువేపులూ చూస్తారా ? దీని కున్న లోపం వొక్కటే. ఏవి ఎన్నివిధాలసర్దినా టేబిలూ - కిటికీ ఒకదానికొకటి ఎదురుగా వుండడం తప్పదు. ఇంకో సెంట్రీని వేసుకోవచ్చుననుకోండి...

(మోసాల్‌స్కీ రెక్కలు పట్టుకుని అతడి నాపేస్తాడు.)

మోసాల్‌స్కీ : ఫెయూనిన్ ! నువ్విక్కడ నిలబడు.

తలానోవ్ : నే వెళ్లిపోవచ్చునా ?

(ఎవ్వరూ మాటాడరు. విబ్బెల్ కుంజ్ మొహంకేసి చూస్తాడు. కుంజ్ వెనక్కి దిగబడిపోతాడు. మోసాల్‌స్కీ, విబ్బెలూ వెడతారు.)

ఫెయూనిన్ : (చిరాకుతో) మీమంచికోసం చెప్పినా తెలియకపోతే పోయే. నాకూడా అర్థం కాకు ఇవాన్. వాళ్లి ఇల్లంతా రక్తంలో

ముంచెత్తుతారు.

తలానోవ్ : అబ్బ ! వేపుకుతినకు.

(కుంజ్ నిలబడ్డచోటికి దగ్గరగా తెర కొంచెం కదులుతుంది. ఏముందోనని ఆతడు తెర వొత్తిగిస్తాడు. విపరీతమైనభయంతో అనిస్కా గోడనంటిపెట్టుకు పోతుంది. ఆమె తనచేతిలోంచి ఓమారు పారిపోయిందేనని కుంజ్ గుర్తిస్తాడు.)

కుంజ్ : ఓహో ! du mein feiner Kafer! *

(ఆతడో అడుగు ముందుకేసి అనిస్కాగడ్డం పట్టుకోబోతాడు. వెర్రికేక పెట్టి ఆమె పరుగుప్రారంభిస్తుంది. "Komm mal Rer, Komm mal Rer, Lieblein!" అంటూ కుంజ్ ఆమెవెంట బడతాడు. మోసాల్స్కీ వెంటరాగా, కంగారుగా విబ్బెల్ తిరిగివస్తాడు.)

మోసాల్స్కీ : ఎవరిక్కడ అరిచేరు ?

ఫెయూనిన్ : (చేతులెగరేస్తూ) ఏమీ లేదు. వట్టి గంద్రగోళం. ఎలక ఒకటి ఒక ఆడపిల్ల పరికిణీలో దూరింది.

విబ్బెల్ : (నెమ్మదిగా) ఎలకంటే ?

మోసాల్స్కీ : (చెవిలో) అదే. maus.

ఫెయూనిన్ : వెనకకూడా ఇంతే. ఇల్లంతా ఎలకలే. దానికి్కారణం ఈప్రక్కయింట్లో రొట్టెలదుకాణం వుండేది. ఒక్కొక్కప్పుడు తోరణాలమాదిరిగా గోడలపొడుగునా కనబడతాయి. (విబ్బెల్ కంగారుపడుతూ నేలవంక చూసుకుంటాడు. కుంజ్ వెర్రినవ్వు వ్వుతూ వస్తాడు.) అయినా, ఫర్వాలేదండి. అవన్నీ మచ్చిక పడ్డవే గాని మరొకటి కాదు. హెర్ మేజర్ ;

---

* నువ్వా ! ఓసీ చీరండా !

ఒ ఇల్లారా ! ఇల్లారా ! నాముద్దుగుమ్మా !

విబ్బెల్ : (వణుకుతూ) వద్దు. వద్దు. ఈఇల్లు మంచిదికాదు. ఇందులో....
Kein Raum fur die Wachtmannschaft.... లేదు.
ఘ్రోసాన్‌స్కీ : అంగరక్షకులు ?
విబ్బెల్ : అవునవును. Wir mussen ins abte Loche Zunck! ±
(టోపీ చివరిభాగం వేళ్ళతో.తడుముకుంటూ. మూలలకేసి అదిరి బెదిరి చూస్తూ వీధిగుమ్మంవేపు నడుస్తాడు. ఆయన మళ్ళీ తిరిగిరాకుండా చేసేవుద్దేశ్యంతో ఫెయూనిన్ ఆతనికి అడ్డు వెడతాడు.)
ఫెయూనిన్ : అవేం చెయ్యవండి! హెర్ మేజర్! అవి చుంచులుతప్ప వేరు కాదు.
(మాటలతో చేతులుకూడా తిప్పుతూ) మూలకి తరమడం, పట్టుకోడం, వేళ్ళతో పీక నొక్కెయ్యడం. కిటికీలోంచి బయటికి పారెయ్యడం, అంతే. పెద్ద గొడవలేదు. పీడ వదులుతుంది.
(విబ్బెల్ గబగబ నడుస్తాడు. ఉండమని పట్టుపడుతూ, ఫెయూనిన్ ఆతనివెంట బడతాడు.)
మోసాల్‌స్కీ : [ఈమారు గౌరవం చూపుతూ] డాక్టర్!....ఆ బట్టతలవాడిమాటల్లో నాకు విశ్వాసం లేదు. నిజంగా చుంచులు వస్తాంటాయా ?
తలానోవ్ : [మొగంమీదే] ఆ. ఎలకలుకూడా వస్తాయి కెప్టెన్.
(తలానోవ్ కళ్ళలో హేళన చూపువాసికూడా లేదు. మోసాల్‌స్కీ తలుపుగడియ చేతితో పట్టుకుంటాడు. ఫెయూనిన్ లోపలికి వచ్చి, పెదవులు చప్పరించుకుంటూ మోసాల్‌స్కీకి దారి ఇవ్వడానికై ప్రక్కకి తప్పుకుని నిలబడతాడు.]

* కాపలావాళ్ళ నుంచేటందుకు చోటులేదు.
± మళ్లీ, వెనకచూసిన ఆ గుయ్యారంలోకే పోవాలి.

ఫెయూనిన్ : చూసేవూ. ద్రాక్షసారాపీసామీది మూతలా ఎగిరిపోయేడు ఒక్కదెబ్బతో. ఈపని చేసినందుకు నన్నభినందించవేం ? ఈ యింట్లో మీతోపాటు వేనూ వుంటాను. ఏం ? [ఆ ఆనందంలో తలానోప్‌ని కౌగలించుకోబోతాడు.] కొద్ది ఇబ్బంది తప్పదనుకోండి.... నేను పుస్తకాలగదిలో వుంటా. ఊరికే తాత్కాలికంగా అంతే. ఏమన్నా పెద్దకంపెనీ అన్నది మాస్కోలో పెట్టాలి గాని. చిన్నపట్టణంలో లాభం లేదు చూడండి. అన్నట్టు చెప్పడం మరిచేను. ఆతడిని విందుకు పిలిచేను. ఆఖరుకి పుట్టిన రోజు పండగ చేసుకునికూడా పాతికేళ్ళకి దాటిపోయింది.... ఇప్పుడు కొత్తపద్ధతిలో చెయ్యాలి. నాకేమీ బహుమతులుతీసుకు రానక్కర్లేదు. మీరూ. భార్యా మాత్రం తప్పకుండా రావాలి.

తలానోప్ : ఆరోగ్యం బాగులేదు. బహుశా రాలేము.

ఫెయూనిన్ : అల్లాంటి సాకులవలన ఏమీ లాభంలేదు. "స్పత్రీ" స్వయంగా వస్తూన్నాడు. జన్మానికల్లా శివరాత్రి అనుకోండి. ఆంద్రీని గురించి ఆలోచించేరుకదూ. అయినా....[అర్థం కాకుండా] ఆతడిని ఈసాయంకాలం మనం ఇద్దరమూ కలుసుకు మాట్లాడవచ్చును. కాని, ఆమాట మీదగ్గిరనుంచే రావడంలో రాజకీయ రహస్యాలున్నాయి. "సుస్వాగతం" అని కాగితం తగిలించడం చూడండి. ఓహోహో. ఎంత బుర్రగలపని : ఆమాట వినేటప్పటికి "స్పత్రీ" అగ్గిపుంత అయిపోతున్నాడు.

తలానోప్ : నాతల కాలెక్కిపోయింది. ఫెయూనిన్ ! నిన్ను చూస్తే మంటెత్తుతూంది.

ఫెయూనిన్ : నేను పోవాలి ! ఇంకా మేనేజర్ని చూడలేదు. ఆ జర్మన్లతో శ్మశానంకెళ్లాలి. తర్వాత పురవాసుల సభ....పనితలము నకలుగా వుంది. ఈలోపుగా మీసామాన్లు సర్దుకోండి. సాయం

కాలం నేను వచ్చి ప్రవేశిస్తా. Auf Wiedersehen, ఇప్పటికి సెలవు....ధన్వంతరిశిష్యా సెలవు.

[గిర్రున తిరిగి బయటికి పోతాడు.]

[కోతులు! కోతులు!! అనుకుంటూ తలానోవ్ ఓనిముషం గది మధ్యన నిలబడతాడు. తర్వాత ఫొటోలూ అవీ, ఒక్కొక్కటే గోడ నుంచి తీయడం మొదలుపెడతాడు. ఆసమయంలో అన్నా వస్తుంది]

అన్నా : ఏమిటి చేస్తూన్నారు?

తలానోవ్ : ఇల్లు సర్దుతూన్నా. ఇక్కడికి కోతుల్ని తీసుకొచ్చి మకాం పెట్టిస్తారుట. (అన్నా ఒక వూలురుమాలు తలకు చుట్టుకుంటుంది) ఎక్కడికేనా వెడుతూన్నావా?

అన్నా : (విసుగుతో) ఎవళ్ళూ వీధిలోకి పోవద్దన్నా. పట్టణం అంతటా సోల్జర్లే. తెలివిలో వున్నవాళ్ళకంటె తాగివున్నవాళ్లే నయం.... అనిస్తా ఏమయిందో కనబడదు. (వెనక గుమ్మంలోంచి ఓల్గా ప్రవేశించి మాట్లాడకుండా తెరవెనక్కి వెడుతుంది.) ఓల్గా వచ్చింది. అమ్మయ్య ప్రాణం కుదుటుపడింది. (బిగ్గరగా) ఎవరో గాని, స్కూలునుంచి నీకోసం వచ్చి కూర్చున్నారే. అమ్మా!

ఓల్గా : కూర్చోనీ. తొందరలేదు.

(అన్నా వెళ్ళిపోతుంది.)

తలానోవ్ : స్కూలులో సంగతేమిటమ్మా!

ఓల్గా : (తనవి కానట్లుగానే) అమ్మ చెప్పిందే నిజం. ఒక్కపిల్లవాడు కూడా రాలేదు. (తెరవెనకనుంచి వచ్చి, బల్లమీదనున్న, ఒక చిన్న రొట్టెముక్కని తీసుకుంటుంది.) అబ్బ! చచ్చేటంత ఆకలి వేస్తూంది.

తలానోవ్ : స్కూలుకి వెళ్ళి ఏమిచేసేవు?

ఓల్గా : గదులన్నీ తిరిగేను. ఖాళీ. అన్నీ చిందరవందరగా సామాన్లు పడివున్నాయి. గోడనున్న ఆఫ్రికా పటం మాత్రం గాలికి కొట్టుకుంటూంది. కిటికీతలుపులు పగలకొట్టబడివున్నాయి.

తలానోవ్ : ఒకటేనా....చాలా కిటికీలా ? (రొొట్టెవున్నచేయి జారవిడిచి, ఓల్గా తండ్రివేపు తేరిచూస్తుంది.) నాదగ్గర చనువేకాదు. తల్లీ! నీకు? నాదగ్గర దాపరికం ఎందుకు ? కష్టాలు దాచిపెట్టడానికి కిటికీతలుపులు విరగకొట్టేరని కధలల్లుతా వెందుకు ? ఆఫ్రికా పటంతో నాదగ్గిరున్న చనువు మూసిపెడతావెందుకు ? నువ్వేదో ఆలోచిస్తున్నావు. స్కూలు తగులబడిపోయిందని నీకు తెలియదూ ?

ఓల్గా : (తండ్రిచేయి పట్టుకుని) నాన్నా ! ఏం చెయ్యమంటారుచెప్పండి. మరో మార్గం లేదుమరి. వాళ్లతో యుద్ధం చెయ్యమని....ఆ వూహ మీహృదయంలో వుంది....మీరే బోధించేరు. అక్కడికి ఎవర్ని పంపుదాం ? ఫియోదోర్‌ని పంపుదామా ? (విచారంతో) ఇక మీదాన్నికాదు నాన్నగారూ ! నన్నుగురించి విచారపడకండి. అల్లా అయితే నేవెళ్ళిపోవాలిసివస్తుంది. (కన్నీళ్ళ మధ్య. ఆమె గొంతులో ఏదో కొత్తదనం గోచరిస్తుంది తలానోవుకి) వారి పేరు చెప్పితే నాకు పరమాసహ్యం. వాళ్ళ నడకలు, వాళ్ళ పలుకులు, అన్నీ, వాళ్ళకోపాతం చెప్పాలి. ఆఫ్టే నోరు లేవకుండా నొక్కెయ్యాలి. తుపాకులులేక పోనియ్యండి. ఆఖరుకి గోళ్లు కూడాలేకుండా పీకెయ్యనియ్యండి, నారక్తంచాలు. అడుగుపెట్టిన వాడినల్లా విషజ్వాలతో మాడ్చేస్తుంది.

తలానోవ్ : నాచిట్టితల్లి పెద్దదయింది. ఓల్గా : చిట్టీ ! నిన్నెవరొద్దన్నారు! నువ్వుచేసింది తప్పని ఎవరన్నారు ?

ఓల్గా : నాన్నా నాకేమిభయంలేదు. అంత శక్తిలేకుండాలేను....వాళ్ళ

ప్రాణాలుతీసేస్తా. ఇతరుల కష్టాలంటే ఇహ జాలిపడను. నా కష్టాలకి 'హుం హుం హూ' అనేదీలేదు.

తలానోవ్ : కళ్ళుతుడుచుకో. కన్నీళ్ళు చూసిందంటే అమ్మ ఏడుస్తూన్నా వనుకుంటుంది. నీకోసం వచ్చినదెవరో మాట్లాడుతూండు. ఇంతలో మీ అమ్మ ఏంచేస్తూందో చూసివస్తా. (పోతూ. వెనక్కి చూడకుండానే) వాళ్ళివేళరాత్రి నలుగుర్నీ నొక్కేసేందుకు ప్రయత్నాలు చేస్తూన్నట్లు ఫెయూనిన్ నోరు జారవిడిచేడు. అందుచేత స్కూలుకి పోవాలనుకుంటే....

ఓల్గా : (గొంతులో ప్రత్యేకత తెలియనీయకుండా) ఉహూ ! నాజాగ్రత్త లో నే నుంటాలేండి.

(ఆమెతండ్రి వెళ్ళిపోతాడు. వంటింట్లోకున్నద్వారం ఓల్గా తెరుస్తుంది. ఆవిడా ఏమీ మాట్లాడదు. వంటింట్లోంచి వచ్చిన తాతారోవ్. యెగోరోవ్వులూ నిశ్శబ్దంగానే వుంటారు. యెగోరోవ్వుమొగాన స్ఫోటకం మచ్చలున్నాయి. రైతులు వేసుకొనే కోటు ఒకటి తొడుక్కున్నాడు. తాతారోవ్ సన్ననివాడు. చురుకైన నల్లనికళ్లు. ఆతనికి సరిగ్గా సరిపడేటట్లు కత్తిరించి, కుట్టించిన ఆర్మీకోటు ధరించివుంటాడు. వా రిద్దరూ నిలబడే బహునెమ్మదిగా, గబగబ మాట్లాడుతారు.)

ఓల్గా : స్కూలువ్యవహారాలకి సంబంధించిన వాళ్ళమని చెప్పాలనే ఆలోచన మీలో ఎవరికయ్యా తట్టింది ? మీవేషంకేసి ఒక్కమాటు చూసుకోండి. ఈయింట్లో ఒకడాక్టరున్నాడనీ, ఆయన దగ్గిరికి, విడివిడిగా, ఏరోగం మిషతోనో రావచ్చుననీ ఒక్కరికేనా తోచలేదూ ?

తాతారోవ్ : నిజమే. మా కింకా ఇల్లాంటివిషయాల్లో ఏమీ అనుభవం లేదు. ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాం.

యెగోరోష్: ఫర్వాలేదు. మనస్సులోవున్న ద్వేషం, అసహ్యం, ఇల్లాంటివిషయాల్ని మహచక్కగా నేర్పుతుంది. రైతుల మనస్థితి ఇప్పుడో పెద్దమందుకొట్టులా వుంది. ఒక్కనెరుసు చూపిస్తే చాలు. (గోనెగుడ్డలో చుట్టపెట్టిన ఒకమూటని అందిస్తూ) డాక్టరుగారికిమ్మని షరాపోవ్ తాత కొంతమాంసం ఇచ్చేడు. ఆతని భార్యకి వైద్యం చేసేరుట....ఆంద్రీ నీకు కనపడ్డాడా?

ఓల్గా: ఆ, ఆతడికి మహాకోపం వచ్చింది. ఫ్రూడీక్కలో వ్యవసాయ యంత్రాల్ని గొడ్డళ్ళతో నాశనంచేసేరుట. ఏమిటాపని? వాటిని జర్మనీకి తీసుకుపోతారనా? లేక మనమీదికి తిప్పిపేలుస్తారనా? వట్టి కంగారు! పిరికిదనం: ఐత్నిలో విత్తనాలు మంటల్లో పారబోసేరుట. దాస్తే వదిలిపోయేది.

యెగోరోవ్: వ్యవధి ఎక్కడ ఓల్గా:

తాతారోవ్: (కోపంతో)స్వంతసామాన్లుదాచుకుందుకు వ్యవధి వుందేం?

ఓల్గా: అతుకు చంపకుండా పోరాటం ఎప్పుడూ నడుపుతూనే వుండాలనే ఆలోచన ఒక్కరికీ లేదు. ప్రతిక్షణం వాళ్ళగుండెల్లో మనం మెదులుతూండాలి. ఒకడు జారిపోతే మరొకడు, ఆ పేరుతోపే, తక్షణం అతనిచోట్లో నిలబడి పనిసాగించాలి. ప్రజల్లోంచీపుట్టిన సైనికులకి చావేమిటి? ప్రజలకోపాగ్ని రావణాసురుడి కాష్ఠం.

(తలుపు బార్లా తెరువబడుతుంది. మొదట ఏమీ స్పష్టంగా కనబడదు. ఏదో ధ్వనీ, ఎవరిదో ఏడ్పూ, పకపక నవ్వుమాత్రంవినబడతాయి. అన్నా అక్కడ కొత్తవాళ్ళుండడంకూడా గమనించకుండా పరుగెత్తుకు వస్తుంది.)

అన్నా: త్వరగా....కోటో, కంబళీయో ఏదో ఒకటి....వెచ్చగా వుండేది ఇయ్యి.

ఓల్గా : సంగతేమిటి ?.... ఎవరికి నాన్నకా ? ఎందుకే అమ్మా ! అల్లా వొణికిపోతున్నావేం ?

[మంచంక్రిందినుంచి ఓల్గాయొక్క పెట్టెను అన్నా బయటకీడ్చి, దానిలోంచి కొన్ని గుడ్డలు లాగుతుంది. ఓల్గా నడవలోకితొంగిచూస్తు .ది]

ఓల్గా : బండిక్రిందగాని పడిందా ఏమిటమ్మా !

అన్నా : [ఓ మోపుబట్టలు భుజాన వేసుకుని హడావిడిగా నడుస్తుంది.] కుంపటి వెలిగించు....దొడ్డిపాకలో నీటితొట్టి వుంది. తెచ్చిపెట్టు

ఓల్గా : [ఆగంతుకులతో] వంటింట్లోకి నడవండి....అక్కడే మాట్లాడు కుందాం.

[యెగోరోవ్, ఓల్గాలు వెడతారు. తాతారోవ్ తటపటాయిస్తాడు. ఆతడు వరండాలోకి తేరిచూస్తాడు. అక్కడేం కనబడిందోగాని ముఖం గంభీరమౌతుంది.]

తలానోవ్ గొంతు : జబ్బలక్రింద చేతులువేసి పట్టుకుంటాను గాని, డేమిడ్‌యేవ్నా ! నువ్వు పోయి సోఫామీద పక్కవెయ్యి.

అన్నాగొంతు : భయం లేదమ్మా ! భయం లేదు. వాళ్లెవళ్ళూ లేరులే యిక్కడ....ఇదిగో చూడుతల్లీ !

(డేమిడ్‌యేవ్నా గదిలోకి తీసుకురాబడుతూన్న అనిస్కావంక ఆతురతతో చూస్తూ, కంపించిపోతూ వస్తుంది.)

డేమిడ్‌యేవ్నా : (ఏడుస్తూ) అయ్యో ! నాతల్లీ: బంగారుతల్లీ: ఎంత పని చేసేరే అమ్మా ! ఆ రాక్షసిపీనుగులు వాళ్లు నాశనంగానూ ! (ఆమె ఏడుస్తూనే వుంటుంది, విడవకుండా)

---

రెండో రంగం:

(తలానోవ్‌ల సామాన్లుతీసేయడం పూర్తిఅయింది. ఇప్పుడాయన భాగం ఓగదీ, వంటిల్లూ మాత్రమే. గదిమధ్య తెరవుంది. సామాన్లింకా సర్దకపోవడంచేత, కంగాళీగా గదంతా పడివున్నాయి. మంచాలన్నీ గోడవార పారేసేరు. ఒకటిమాత్రం తెరవెనక్కాల చాటుగావేసేరు- ప్లయ్‌వుడ్ చెక్కలతో బిగించి మరమ్మతులు చేసిన కిటికీకీ, బట్టల బీరువాకీ నడుమ మెరిసిపోతూన్న చారలగుడ్డవొకటి తెరగా ఉపయోగించబడింది. ఓచీపురూ, కుంపటీ, అల్లాంటివే ఇంకా ఇతరసామాన్లతో పాటు పాగాకొయ్యఒకటి మూలలో గోడని జేరవెయ్యబడివుంది. అద్దం బద్దలయిపోయిన ఫియోదోర్ ఫొటో తల్లక్రిందుగా గోడని జేరవేసివుంది. యుద్ధకాలపుటలవాట్లని పట్టిచూస్తే రాత్రి ప్రొద్దుపోయిందనే చెప్పాలి. ప్రక్కనేవున్న ఫెయూనిన్‌గదిలో సామాన్లు అటూఇటూ ఈడుస్తూన్నట్లూ, ఊడుస్తూన్నట్లూ చప్పుడు వినబడుతూంటుంది. రాత్రిఅయ్యేలోపున, ఏర్పాట్లన్నీచెయ్యటంకోసం. అందులో సామాన్లు తొందర తొందరగా సర్దేసేరు. కొత్తవాటాలోకి సర్దుకున్నాక తలానోవ్ కుటుంబంవారు భోజనాలు అప్పుడేఅయినాయి. టేబిల్‌ప్రక్కన ఓపెద్దమూటమీదకూర్చుని- అన్నా కప్పులుకడుగుతూంది. బైండుచేసిన ఒక పత్రికా సంపుటాన్ని తలానోవ్ చదువుకుంటున్నాడు.)

తలానోవ్ : (చదువుతూన్న పుస్తకం ఓపక్కగా పెట్టేసి) వైద్యశాస్త్రానికి ఓకొత్త విషయం దొరికిందన్నమాట. యుద్ధరంగంలోకూడా శిశువైద్యాలయాలు తెరవవలసి వస్తూంది. శస్త్రచికిత్స చెయ్యాలి!

(కోకోరిష్కిన్ కీచుగొంతుక ఫెయూనిన్‌గదిలోంచి వినబడుతూంది. "ఒండిగిలా. ఒండిగిలాపెట్టి తీసుకురాండి. జాగ్రత్త!.లస్టర్లు" చూసుకోండి. ఎక్కడ అడుగు పెడుతున్నారో చూసుకు నడవండి. సామానేదో బరబరలాడుతుంది. లస్టరులోని బుడ్లు గలగలలాడుతాయి.

ఏదో క్రిందపడి దొర్లినచప్పుడు. "ఓరీ చవటల్లారా : లక్షలకిమ్మత్తయిన వస్తువురా అది! "ద్వారంప్రక్కగా ఏదో బరువైన వస్తువు నీడుస్తారు. కోకోరిష్కిన్ గబగబా వస్తాడు. మొగంవికృతంగా వుంది. ఓ అట్ట ముక్కతో విసురుకుంటూంటాడు. "అబ్బ! ఒళ్లంతా హూనం అయి పోయింది. ఒక్కనిముషంకూడా....ఇంకిక్కడవుండను. పోయి ఏ పాదులో పెట్టుకు బ్రతుకుతాను" అంటూ వెళ్ళిపోతాడు. తలానోవ్ తెరచివున్న తలుపు మూసేస్తాడు. కాని, కేకలూ, తిట్లూ, సామానుల బరబరలూ వినిపిస్తూనే వుంటాయి. ఏ పిశాచాలోఇంటిని పునాదులతో పీకేస్తూన్నాయనిపిస్తుంది. గదితలుపులకమర్చబడిన అద్దాలమీద నీడలు పడుతూ. కదులుతూన్నాయి. వాటినిచూస్తే భూతాలూ, ప్రేతాలూ. ఫెయూ నిన్‌కి ఇల్లు కట్టిపెడుతూన్నాయేమో ననిపిస్తుంది.)

తలానోవ్ : ఈనాడుచెప్తూన్నా. జ్ఞాపకం వుంచుకోండి. మన కోకో రిష్కిన్‌వున్నాడే. వీడు ఫెయూనికానిగుటుక్కు నిమింగేస్తాడు. వాడు పైకి రావాలనుకుంటున్నాడు!....సరే, చాలాఆలస్యం అయింది. అన్నా! పడుకొనే వేళ కాలేమా ?

అన్నా : ఓల్గా! ఆగండి. (మధ్యలో) మన ఫెడ్యా ఎందుకొచ్చాడంటారు?

తలానోవ్ : అన్నా! వాడిమాట తీసుకురాకు. మూడేళ్ళక్రితమే చచ్చి పోయాడనుకో. వాడికప్పుడే నీళ్ళచుక్క వదలేమనుకుందాం.

అన్నా : (మళ్ళీ మామూలుస్వరంలో) మందిచ్చేవేళ కాలేదూ ?

తలానోవ్ : ఇంకో పదినిమషాలు ఆగు.

అన్నా : పదినిమషాల్లో వీధిలో తిరిగేవేళ మించిపోతుంది. ఓల్గా ఇంకా ఇంటికి రానేలేదు.

తలానోవ్ : ఓవేళవస్తే ఇంట్లోకి రావడానికి వీలుగా తలుపుతాళం వేయ కుండా వుంచు.

అన్నా : దానిదగ్గరో తాళంచెవి వుంది. (వంటింటితలుపు భళ్లిన చప్పు డౌతుంది.) దేవతలకథలు........

(తలుపు తోసుకుని ఓల్గా గదిలో ప్రవేశిస్తుంది. ఆవిడవొంటి నిండా మంచే. తన తల్లితండ్రుల వెనకభాగానవున్న ద్వారంలోనిలబడి కోటు దులిపేసి సర్దుకుంటుంది. పరుగెత్తి వచ్చిందేమో ఆయాసపడు తూంది. అది వారికి తెలియకుండా చేయాలని ఆమె ఎత్తు. ఆమె తల్లి తండ్రులు ఆవిషయాన్ని గుర్తించరు.)

ఓల్గా : (బహుకష్టమ్మీద ఊపిరి పీలుస్తూ) మళ్లీ....ఈవేళకూడా భోజ నం వేళ దాటింది.

అన్నా : టీ వేడిగానే వుంది. తీసుకో...బయట ఎల్లావుంది ?

ఓల్గా : మంచు కురుస్తూంది....మంచుతుపాను. మనముంగిలి వాకిట్లో తడుముకుంటూ రావలసివచ్చింది. దారి కనిపించందే. (కోకోరిష్కిన్ నీడ తలుపు మబ్బుటద్దంమీద కనిపిస్తుంది. తర్వాత అతడు ప్రవేశిస్తాడు. తనను నిదానంగా చూస్తున్న కోకోరిష్కిన్‌ను చూడనట్లుగా ఓల్గా నటిస్తుంది.) ఇల్లాంటి రాత్రుళ్లు కాపలావాళ్ళ అవస్థ, పాపం....(ఆతన్నిచూస్తూ) కోకోరిష్కిన్! ఏం కావాలి ?

కోకోరిష్కిన్ : మీయింట్లో చీపురుకట్ట లేదుగదా ? అబ్బే! ఓమాటు తుడుచుకొనేందుకులే.

ఓల్గా : ఆం! వుండాలి. (చీపురుతెచ్చి యిస్తూ) మీకేమైనా కావలిసివస్తే అడుగుతూండు....ఇక్కడే వుండడానికి ఏర్పాట్లు చేసుకున్నారా?

కోకోరిష్కిన్ : ఆం! చేస్తున్నాం. ఫెయూనిన్ సామానులన్నీ దొరి కేయి. అతని పెద్దటేబిల్ జిల్లాకమిటీ ఆఫీసులోనూ. బీరువా

క్రెచీలోనూ వున్నాయి....ఇంత పొద్దుపోయి బైట తిరగడానికి నీకు భయంలేదూ, ఓల్గా!

ఓల్గా : కోకోరిష్కిన్! కర్ఫ్యూ టైంకి యింకా ఏడునిముషాలుంది.

(సె-మ్యో-న్! అని ఆవలిగదిలోంచి ఫెయూనిఞపిలుపు.)

కోకోరిష్కిన్ : వ-స్తూ-న్నా!....(ఒత్తుతూ వెక్కిరిపిస్తాడు.) బాగుంది. కొత్తకొంపలో కూర్చుని పట్టబోయే ఐశ్వర్యాన్నిగూర్చి కలలు కంటూండవయ్యా!

(కోకోరిష్కిఞ వెడతాడు. ఓల్గా తలుపేస్తుంది.)

అన్నా : వీణ్ణి "సెమ్యోఞ" అంటారని నాకు తెలియనేతెలియదు....ఓల్గా! అక్కడ నిలుచున్నావేం? ఇంత ఆలస్యం చేసేవు. కూర్చుని త్వరగా టీ త్రాగు.

ఓల్గా : (అనిశ్చితంగా) అల్లాగేలే. చూసేవూ. అమ్మా,....నాతో ఇంకోరు కూడా వచ్చేరు. దారిలో హఠాత్తుగా తారసిల్లేడంతే. నేనూ పెరట్లో కడుగుపెడుతున్నా. అతనూ పరుగెత్తుకొస్తున్నాడు. చూసి, తీసుకొచ్చేను, తెలిసిందా?

తలానోవ్ : ఆపరుగెత్తుకొచ్చిందెవరు?

ఓల్గా : ఏం. అతనే....ఏమిటీ అతనిపేరు? అతనే. కొలెస్నికోవ్. ఓజర్మన్ సెంట్రీ వీధిమలుపులోంచి వస్తున్నాడు కూడాను. అంచేత అతన్ని లోపలికి తీసుకొచ్చేను. (తలిదండ్రులు ఒకరి చూపుల్ని ఒకరు తప్పించుకుంటారు. తనకు ఓల్గావిషయం తెలుసుననే విషయం వ్యక్తం చేయడానికిద్దరూ జంకుతారు.) మీరు వెళ్ళమనగానే వెళ్ళిపోతాడులేండి. అయిదు నిమిషాలు...మహాఅయితే పదినిమిషాలుంటాడంతే.

తలానోవ్ : సరేలే. ఇంతకీ అతనేడీ? లోపలికిపిలవ్వేం?

ఓల్గా : ఇదిగోనే, మీకు తెలియనేలేదూ ? ........అతనికి గాయం తగిలింది....చిన్నదేలే.....తుపాకిగుండు భుజానికి రాచుకు పోయింది. ఏమంతప్రమాదం కాదులేండి.........[తలానోవ్ తొందరగా వంటింట్లోకి వెడతాడు.] అమ్మా. ఫర్వాలేదు. ఏం ప్రమాదంలేదులేవే. గాయానికి నాన్న కట్టుకడతారు. అతనింటికి పోతాడు....స్పష్టంగానే చెప్పేనులే. ఆతను అర్ధంచేసుకుంటాడు.

అన్నా : ఇల్లాచూడమ్మా. ఓల్గా ! (కూతురు గడ్డంపట్టుకొని. వంచినతల మెల్లిగాపైకెత్తుతుంది.) నువ్వుధైర్యమైనదానివే. గౌరవ మర్యాదలు కాపాడుకోగలవు. కాని, మాకొక్క నలుసువు మిగిలేవమ్మా. ఫియోదోర్ యింక తిరిగిరాడుగదా. నాన్న ముసలివారై పోయేరు. ఈస్థితిలో మరోదెబ్బతగిలిందంటే నాన్నబతకరమ్మా. (ఓల్గా ఉద్రేకంతో తల్లి నుదురుముద్దెట్టుకుంటుంది. తలానోవ్, కొలెస్నికోవును లోనికి తీసుకువస్తాడు. వెనుకటి బొచ్చుకోటే తొడుక్కొని వుంటాడు. కోటునలిగివుంది. గడ్డంమాసింది. ఆయుధాలేమీలేవు. గాయపడినచెయ్యి నిరాధారంగా వ్రేలాడుతూంటుంది.)

అన్నా : ఎక్కడతగిలింది, దెబ్బ ?

తలానోవ్ : ఇదిగో, యిప్పుడేపరీక్షచేస్తా. ఓల్గా ! బేసిన్, నీళ్ళు తెరవెనుకపెట్టు. అన్నా ! ద్వారందగ్గరనిలుచో. (అంతా నిశ్శబ్దంగా ఎవరిపని వాళ్ళు చేస్తుంటారు. కొలెస్నికోవ్‌తో) ఇల్లారా. పక్కమీద పడుకో.

కొలెస్నికోవ్ : (తెరవెనక్కివెడుతూ) చివరకి కథ అడ్డంతిరిగింది ! నామూలాన అంతా నిద్రమేలుకోవలసి వచ్చింది. వాళ్లువచ్చి, నన్నిక్కడే పట్టుకోవచ్చు. మంచు కనక నన్నుబైటపెట్టకండా వుంటేనా !

తలానోవ్ : అదేమీ ఆలోచించకు. వెస్టు కోటు తీసెయ్యి. (స్టేజిమీదెవరూ వుండరు. తెరవెనుకనుంచి మాటలు వినిపిస్తూంటాయి. నీళ్ళు పోస్తూన్నధ్వని : తలానోవ్ చేతులు కడుక్కుంటూన్న చప్పుడు) అదితీసెయ్యి. ఓల్గా, అతనికి సాయంచెయ్యి. తొందరలేదు. చెయ్యి బాగాజాచు.....(గుడ్డ చింపుతూన్నధ్వని) ఇక్కడ నొప్పి గావుందా?

కొలెస్నికోవ్ : కొంచెం....లేదు....అక్కడ కాదు.... ఎంతపోటుగా వుంది, డాక్టరుగారూ! ఎంతఆశ్చర్యంగావుందీ? (అతనిస్వరం, నొప్పి హెచ్చు తక్కువల్నిబట్టి మారుతూంటుంది. గాయాన్ని కడిగి, కట్టుకడతారు.) ఎంత చిత్రంగావుందీ! మనం ఎనిమిదేళ్ళ కలిసి పనిచేసేం. మీహాస్పిటల్ ఎస్టిమేట్లు తగ్గించేసేను; మీ రడిగినంత కట్టెలెప్పుడూ యివ్వలేదు; మీటింగుల్లో యెప్పుడూ తగువులే! మళ్లీ యిరుగూ పొరుగూను! (ఊరుకుంటాడు. డాక్టరు చేతిలో కత్తెర క్రిందపడుతుంది.)

తలానోవ్ : స్పిరిట్, పట్టుకో. ఒక్క నిమషం. అయిపోయింది. పైకి, యింకాపైకి. బ్యాండేజి. (కొంచెంసేపు నిశ్శబ్దం. తరువాత కొలెస్నికోవ్ మాటలు.)

కొలెస్నికోవ్ : ఈ యెనిమిదేళ్ళల్లోనూ. ఒక్కసారికూడా మనం సాయిలా ఫాయిలాగా మాట్లాడుకోనేలేదు. మాట్లాడడానికెన్ని సంగతులో ఉన్నాయి! ఉహుఁ. ఇప్పుడు నొప్పిలేదు. నిజంగా స్నేహితులైవుండీ, ఆసంగతిగుర్తించనివాళ్ళు దేశంలో ఎందరున్నారో! పరీకతినులం ఐపోయేం. మార్దవం అంటే ఏమిటో కూడా మరిచిపోయేం!

తలానోవ్ : మార్దవత్వాన్నిమార్చి తర్వాత మాట్లాడుకోవచ్చు. ప్రొద్దుటి

కెట్లా వుంటుందో చూద్దాం. అన్నా! యితన్నెక్కడ పడుకో బెడదాం?

(ఆమెజవాబు యివ్వకపూర్వమే కిటికీమీద తట్టడంవినిపిస్తుంది. అంతా నిశ్చేష్టులవుతారు. కొలెస్నికోవ్ అతికష్టంమీద కోటు తొడుక్కుంటూ, తెరవెనుకనుంచి ముందుగా బైటికివస్తాడు.)

కొలెస్నికోవ్ : నాకోసమే. మీకూ్కడా చిక్కుతెచ్చిపెట్టేను. (ద్వారం వైపువెడతాడు.) వాళ్లని పెరట్లోనే కలుసుకుంటా. త్వరగాదీపం ఆర్పేసి వెళ్ళిపడుకోండి.

అన్నా : ఒద్దు. ఇక్కడేవుండు.

కొలెస్నికోవ్ : వాళ్ళు కాల్చడంప్రారంభిస్తారు.... అంతవరకొస్తే నేను పోట్లాడకుండామాత్రం లొంగను.

(వీళ్లని మాట్లాడవద్దని సంజ్ఞచేస్తూ అన్నా ఎదటికి వెడుతుంది. క్షణం యుగంలా గడుస్తూంటుంది. ఫెయానిన్ గదిలోంచి మంద్రంగా హార్మోనియం మ్రోగుతూంటుంది. వంటింట్లోంచి సంభాషణ విని పిస్తూంటుంది. కొలెస్నికోవ్ తెరవెనక్కి వెడతాడు. అన్నా ఫియోదోర్‌ను వెంటబెట్టుకొని వస్తుంది. భయోద్రేకాలతో ఆమె అలిసినట్లుంటుంది. వెలుతురుకి ఫియోదోర్ కళ్ళు చికిలిస్తూంటాడు. అతడి వైఖరంతా అగ్రాహ్యం, అస్పష్టం, నిగూఢం. వ్యాకులంగావున్నట్టు ముఖం మీద కనిపిస్తూంది. మీసం తీసేసేడు. కొంచెం నిషామీదున్నట్లు స్ఫురిస్తూంటాడు.)

అన్నా : ఫెద్యా! ఇప్పుడే పడుకోబోతున్నాం.

ఫియోదోర్ : దారేబోతూ, ఊరిఖే ఓమాటు చూసిపోదామని వచ్చేను. నేనూ వెళ్లాలి. అబ్బా! ఏం జీవితమో! [అలిసినట్లు చతికిలపడి, ఒళ్ళు విరుచుకుంటాడు. తనెప్పుడు పోతాడాఅని నిరీక్షిస్తూ,

అంతా నిల్చున్నసంగతి గమనించదు.] చుట్టూ గ్రామాలన్నీ తగులడిపోతున్నాయి. ఆమంటలకి మంచుకూడా గులాబిరంగుగా కనిపిస్తూవుంది. జర్మన్‌లు బాయ్‌నెట్లతో గ్రుచ్చిగ్రుచ్చి మంచులో కూడా వెతుకుతున్నారు. [ఆవలిస్తూ] గాలించేస్తున్నారు. [ఓల్గా వైపు రెప్పలార్పుతూ] వాళ్లెవర్ని వెతుకుతున్నారో నాకు తెలుసు—అతన్ని వాళ్ళు పట్టుకుంటారేమో? ఏకంతలోంచో వాళ్ళని చూస్తూ. నవ్వుకుంటూఅటాడు! మాంచి గట్టివాడే, అల్లాంటివాడితో నాకూ నేస్తం కట్టాలనివుంది.

ఓల్గా : నువ్వెల్లా రాగలిగేవు? నీకు నైట్‌ప్యాస్ వుందా?

ఫియోడోర్ : ఎక్కడికి వెళ్ళడానికైనా నాకు ప్యాస్ వుంది. (పేచీకోరుతనంగా) వాళ్ళు కాలిస్తే, నాదగ్గిరా వుంది, ఓచిన్నటుప్రి.

(జేబుతట్టుతూ) గుండుకి గుండు. తలకి తల!

తలానోవ్ : ఆ తుపాకీ....వాళ్ళిచ్చేరా?

ఫియోడోర్ : తవ్వి తీసేను. చచ్చిపోతూ ఓకా(మ్రేడ్ దీన్ని నాకిచ్చేడు. (ఇప్పుడే తనచుట్టూ, తానెప్పుడు వెళ్ళిపోతాడా? అని అంతా కనిపెట్టుకుని వుండడం గమనించి, లేస్తాడు.) నే నిప్పుడెందుకు వచ్చేనంటే....చలికి యెముకలుకూడా బిగుసుకుపోయేయి. త్రాగడానికి యేమైనా దొరుకుతుందేమోనని వచ్చా.

తలానోవ్ : చుట్టూ దేశంఅంతా తగులడిపోతూంటే నీకు చలిగావుందా? ఫియోడోర్! వెళ్ళు. పోయి ఆ మంటలదగ్గిర చలి కాచుకో....

(తీక్షణంగా) దౌర్భాగ్యుడా! మనింట్లో వోడ్కా లేదు. ఫో!

ఫియోడోర్ : డాక్టరుయింట్లోనే బ్రాందీ లేదూ?........ఎంత చిత్రం:

ఓల్గా : (సానునయంగా) నాకు నిన్ననే జీతం యిచ్చేరు. ఇదుగో!

తీసుకో. (తొందరలో ఆమె చేతిసంచిలోంచి అన్నీ క్రిందపడి పోతాయి.) ఎక్కడైనా కొనుక్కో—ఇక్కడ మాత్రం ఒద్దు. ఎక్కడొక్కడికి వెళ్ళి త్రాగు—

అన్నా : ఓల్గా ! నువ్వు డబ్బివ్వద్దు. (ఆమె కంఠములో హఠాత్తుగా మార్పు కనిపిస్తుంది.) దౌర్భాగ్యుడా ! నీబ్రతుక్కి సిగ్గులేదురా, హంతకులూ, బందిపోట్లూ నీయింట్లో జొరబడ్డారు. ఆడవాళ్ళని చెరుస్తున్నారు! ముసలివాళ్ళని చెట్లకి వ్రేలాడదీస్తున్నారు.— ఇల్లా వుంటూంటే నువ్వో ? తండ్రిదగ్గిరికి దొరలా త్రాగివస్తావా? దిక్కులేని పక్షీ : వాళ్ళంటే నీకూ భయం వేసిందిరా ? ఇంత కంటె చావే నయం. (భర్తతో) వాడు వట్టి పిరికి ! పిరికిపంద :—

తలానోవ్ : (కూతురుతో) ఫెయోనిన్ వింటాడు. మీఅమ్మని వంటింట్లోకి తీసుకుపో.

ఓల్గా : అమ్మా ! రావే. ఏమే. అమ్మా ! గోలచేసుకుంటే యెవరేనా వింటారే.—— (తల్లిచేయి పట్టుకుని) వాడు వెళ్ళిపోతాడు లేవే. వాడిలోమాత్రం అభిమానం పూర్తిగా చచ్చిపోయిందా ? పెడతాడులే, రా. అమ్మా——

అన్నా : భగవంతుడే వాణ్ణి రక్షించాలి !—దేవుడా ! వాడికి మంచిబుద్ధి నియ్యి !—(దుఃఖిస్తూన్న తల్లిని ఓల్గా చెయ్యట్టుకుని తీసికొని వెడుతుంది. తండ్రిచూపుల్లోని తిరస్కారాన్ని ఫియోడోర్ గ్రహిస్తాడు.)

ఫియోడోర్ : కథ అడ్డం తిరిగింది ! మూడురోజులుగా పట్టణంలో తిరుగుతున్నా—మనస్సు నిబ్బరం చేసుకోలేకుండా వున్నా. దారి దొరికినట్లే దొరుకుతుంది! మళ్ళీ జారిపోతుంది !— నిద్రాహారాల్లేవు—శరీరం కొంకరించుకుపోతూంది. ఒంట్లో వేడిపుట్టించే మందియ్యి, నాన్నా !—మందివ్వవూ ?

తలానోవ్ : [కొంచెం నిదానించి] అల్లాగేలే. ఓ మందిస్తానుండు, మాంచి ఘూటైంది.

ఫియోడోర్ : [బొంగురుగా] ఇయ్యి, త్వరగా !

తలానోవ్ : ఇదుగో, యిప్పుడే యిస్తా. ఒక్క గుక్కలో త్రాగెయ్యాలి సుమా !

[రంగుల తెరని తొందరగా ప్రక్కకి తొలగిస్తాడు. మొదట్లో ఏం జరుగుతూందో తెలుసుకోలేం. మంచంమీద నిండా దుప్పటి కప్పు కొని, ఒక్క తలమాత్రం కనిపిస్తూ పడుకున్న అనిస్యాను జోగొడుతూ వంగి, ముణుచుకుని కూచున్న దేవిడ్‌యేవ్నా. దుప్పటిక్రిందనుంచి ఎర్రగా చింతనిప్పుల్లాగ రెండు కళ్లుమాత్రం కనిపిస్తుంటాయి.]

తలానోవ్ : మేం రావచ్చా ?....ఆమెకి కునుకు పట్టలేదుగదా ?

దేమిడ్‌యేవ్నా : ఎలా పడుతుంది ! [పల్లెటూరి వైఖరిలో, ప్రేమాను పూరితంగా] నిద్దరపోమ్మా, తల్లీ, నిద్దరో ! నాబంగారుబొమ్మే ! లేతగులాబిమొగ్గ ! బబ్బోమ్మా !

తలానోవ్ : ఫియోడోర్ ! ఇదుగో ! నీకు మందు. ఇందులో కన్నె రక్తం కలిసింది.

ఫియోడోర్ : [ప్రశాంతంగా] ఎవరది ?

తలానోవ్ : నువ్వామెను చూసేవుగదూ ? ఎప్పుడూ నవ్వుతూండే ఆ చిన్ని అనిస్యా గుర్తులేదూ ? ఆమే ! ఇంకా పదిహేనేళ్ళు నిండ లేదు. వాళ్ళు, ఓగుంపు గుంపు....మొద్దుల్లాంటి రాక్షసిపీనుగులు. షాకలో కట్టెలమీద పడుంటే మీ అమ్మ తెచ్చింది. ఒళ్ళంతా పేళ్లే.

దేమిడ్‌యేవ్నా : ఆ నవ్వే పోయింది, నాయనా. చిగురాక్కి చీడ తగిలింది.

అనిస్యా : [తల విదిలించుకుని, జ్వరంచేత వణుకుతూన్న కంఠధ్వనితో] అమ్మమ్మా ! నాకో కధ చెప్పు. ఎక్కడున్నావు? ఎక్కడున్నావే ?

దేమిడ్‌యేవ్నా : ఇక్కడే ! ఇక్కడున్నానమ్మా. చిట్టితల్లీ ! [ఖూని రాగంతో, విచారస్వరంతో] చెపుతానమ్మా. అతను చెప్పే మాటింకా పూర్తిగాకుండానే, చూడు, నలుగురు తాడిచెట్టంత మనుష్యులు పెద్ద అంగలువేస్తూ, పొలాలమ్మట ఆతనిమీది కొచ్చేరు. చెట్టాపట్టాలు పట్టుకుని వస్తూన్న వాళ్ళ శిరస్సులు మేఘాల్లో వున్నాయి. ఒకడు బూడిదరంగుకోటు, ఒకడు చారల కోటు, ఇంకోడు తెల్లకోటు, మరోడు నల్లకోటు తొడుక్కున్నారు. వాళ్ళంతా దేముళ్ళే. వాయుదేవుడు, వానదేవుడు, మంచుదేవుడూ,

అనిస్యా : [అర్థం చేసుచేకుంటున్నట్లుగా] అమ్మమ్మా ! నల్లకోటు వాడెవరే ?

దేమిడ్‌యేవ్నా : సూర్యదేవుడు, వేడికి దగ్గిరున్నవాళ్ళు మాడిపోకండా నల్లకోటు తొడుక్కుంటాడు ! ఒక్కొక్కప్పుడు కోటు తెరుచుకుంటే నిప్పు కనిపిస్తూంటుంది. [అనిస్యా సంతోషంతో మోచేతిమీద లేస్తుంది, చెదిరిన ముంగురులు దేమిడ్‌యేవ్నా సరిచేస్తుంది.] వాళ్ళు నలుగురూ కలిసే పనిచేస్తారు. గాలేమో వీస్తుంది, రోడ్లన్నీ శుభ్రంగా ఊడుస్తుంది- వానకురిసి చెట్లూ, చేమలూ, ఊరూ నాడూ కడిగి, అద్దంలా చేస్తుంది. మంచు సన్నగా, చల్లగా కురుస్తూంటే సూర్యుడో పెద్ద యింద్రధనస్సుతో అలంకరిస్తాడు....

ఫియోడోర్ : (దేమిడ్‌యేవ్నా జబ్బపుచ్చుకుని, కఠినంగా) ఇదుగో ! దాదీ ! ఆమెదగ్గిర నన్నోమాటు కూచోనియ్యి.

(దేమిడ్‌యేవ్నా తలానోవ్‌వైపు చూస్తుంది. అతడంగీకారసూచ

కంగా తలూపుతాడు.)

తలానోవ్ : (మెల్లగా) ఆమెను కొంచెం పైకి లేవతియ్యి.

డేమిడ్యేవ్నా : కొంచెం లేమ్మా. ఇల్లాగ. భయం లేదులే తల్లీ. ఇదుగో. ఫియోడోర్, యజమానికుమారుడు. ఎంచక్కా, నీకు రిబ్బన్లు తెచ్చిపెడతాడేం. (మోచెయ్యి మోకాలిమీద ఆనుకుని ఫియోడోరు చింతనిప్పుల్లాటి అనిస్కాకళ్ళల్లోకి సూటిగాచూస్తాడు.)

ఫియోడోర్ : ఈమెకు బంధువులెవరేనా వున్నారా ?

డేమిడ్యేవ్నా : ఒకప్పుడుండేవాళ్లు. దీనికిద్ద రన్నలు. ఎంత చక్కని కుర్రాళ్ళనుకున్నావు ? ఒకడు పేరాచూట్ దళంలో పోరాడుతూ చచ్చిపోయేడు. రెండోవాడూ సైన్యంలోనే వున్నాడు. మాస్కో రంగంలో టాంకుదళంలో పనిచేస్తూన్నాడట రాత్రీ పగలూ తెరిపే వుండదు వాడికి. పోగా. యిక్కడ నేనొకత్తెని. ముసలిదాన్ని, ఉండి యేం ప్రయోజనం, నాయనా ! దాన్ని రక్షించలేకపోయిం తర్వాత ?

ఫియోడోర్ : అనిస్కా ! వందనాలు. (ఆమెకళ్ళల్లో సూటిగాచూస్తాడు. అనిస్కా ముఖంలో భయచ్ఛాయలు కనిపిస్తాయి.)

అనిస్కా : అయ్యయ్యో ? పారిపో ! పరుగెట్టు !....వాళ్లు పట్టుకుంటారు. దొరికేవంటే పీక్కా ఉరిపోస్తారు ! పారిపోవేం ? (విస్త్రాణగా వెనక్కి వాలుతుంది. కొంచెంసేపట్లో కుదుటపడి ఫియోడోర్ లేస్తాడు.)

ఫియోడోర్ : చాలు ! ఈ మోతాదు చాలు. అప్పుడే నాలో యేదో భగ్గున మండుతూంది .......

డేమిడ్యేవ్నా : (తలానోవ్‌తో) ఆమెవీపు చూపించనా ? వీపంతా లక్కాతో బొబ్బలెక్కి పోయింది. (అనిస్కాతో) చొక్కా

ఓమాటు తియ్యమ్మా. ఫియోడోర్ చూస్తాడు. అతనికి తెలియనే తెలియదు. ఇంట్లో లేదు....

(ఎర్రటి బుట్టజాకెట్టు అనిస్కా వీపుమీదనుంచి పైకెత్తుతూం టుంది. తలానోవ్ వారిస్తాడు. అప్పటికే ఫియోడోర్ తిరో ముఖుడయ్యేడు.)

తలానోవ్ : (అడ్డుతెర మామూలుగా లాగి, దానిమీదుగా) మందిచ్చే వేళయింది, దేమిడ్‌యేవ్నా !.... ఫియోడోర్ ! చూసేవుకదూ ? ఇక్కడ పడుకునేందుకు చోటేలేదు. బైట చీకటిగానే వుంది, ఎటు వెళ్ళినా ఫర్వాలేదు.

ఫియోడోర్ : (తన పటాన్ని చూస్తూ) నాన్నా !.... యిక్కడెవరూ లేరు కాదూ ?

తలానోవ్ : ఆవలిగదిలో ఫెయూనిన్ వున్నాడు. ఇక్కడింకెవరూ లేరు. ఏం ? ఎందుకూ ?

ఫియోడోర్ : ఒక్కముద్దు. నాన్నా : యిక్కడ (నుదురు చూపుతాడు.) ఇప్పటికీముద్దు చాలు. బహుశా యెప్పటికీ యిదే ననుకుంటా.... ఏం, నాన్నా ?

(అర్థంగాని కుమారుని కోరికను విషాదపూరితహాసంతో తలా నోవ్ తీదుస్తాడు. మెల్లగా కాళ్ళు ఎత్తెత్తి వేస్తూ ఓల్గా వస్తూం టుంది. అందరూ తమకు తెలియకండానే ఒకేవేపు చూస్తూండ డం హఠాత్తుగా గుర్తిస్తారు. గాయానికి కట్టినగుడ్డలతో నిండిన బేసిన్. బేసిన్‌ను దాచాలనే ఆదుర్దాతో ఓల్గా అప్రయత్నంగా అటు వెళ్ళడంతో రహస్యం బైట పడుతుంది. ఫియోడోర్ ముఖంమీద కొంచెతనం వ్యక్తమవుతుంది. ఆత్మసంయమనం చేసుకుంటూనే అతడు అడ్డు తెరను తప్పిస్తాడు. కొలెస్నికోవ్

బైట పడతాడు.)

ఫియోదోర్ : ఇంకనేం ; ఆస్పత్రే తెరిచేరిక్కడ ! ఏర్పాట్లన్నీ వున్నాయి ....(కొలెస్నికోవ్‌తో) సరేగాని తెరవెక నిల్చున్నావేం ?

ఓల్గా : ఏంలేదురా. అన్నయ్యా. బుజంగూడు విరగ్గొట్టుకున్నాడు. ఇక్కడ....

ఫియోదోర్ : అంతటివాడు డాక్టరుదగ్గిరకి వైద్యానికొస్తే దాపరికం యెందుకు ? (కొలెస్నికోవ్‌తో) కొలెస్నికోవ్ ! నీమీద పెద్ద బహూపతికూడ వుంది. తెలుసా ?

కొలెస్నికోవ్ : ఆహాఁ : నాకంతా తెలుసు.

ఫియోదోర్ : అయినా. అదేం యెక్కువగానే గాదు. నీకు ? నేనైతే అంతకి పదిరెట్లు ఒడ్డేవాణ్ణి. (స్పష్టంగా. కవ్వించే కంఠస్వరంతో) నా మనోభ్రమణాల్ని గూర్చి యిప్పుడు పరిశీలించగలవనుకుంటా నోయి. మిత్రుడా ! వెళ్లిపొమ్మనకుండానే యీ యింట్లోంచి నేనే వెళ్లిపోతున్నాను. నేను చెయ్యగల పనేంలేదూ. నీకు ?— ఏదో. ఏమిత్రులకో కబురుచెప్పడంలాంటి దైనా ?

కొలెస్నికోవ్ : పంపవలసిన వార్తలూ లేవు....అందుకొనే వాళ్లంత కంటే లేరు.

ఫియోదోర్ : తె-లి-సిం-ది ! అహాఁ ! స్పష్టంగానేవుంది. నవలల్లో చెప్పినట్లు తల వ్రేలాడేసుకొని మెల్లిగా జారుకుంటా. అబ్బే. పనేం లేదు. ఏంచేస్తూన్నారో చూసిపోదామని వచ్చేనంతే. (ముందుకి వంగి తన పాదాలనుద్దేశించి) ఈ గౌరవనీయమైన కుటుంబంలో మీరుండతగరు. పోండి. బైటికినడవరేం ?

(అతని నడకధోరణిచూస్తే అవమాన భాజనములైనపాదము లాతని శరీరాన్ని త్వరగా. భారంగా బైటికి మోసికొని పోతూ

న్నట్లు తోపిస్తుంది. భారహృదయాలతో అంతా అతనిమీదే దృష్టి నిగుడుస్తారు. ఈ కటూక్తుల్లో ఏభావం యిమిడివుందో ; మనసు పట్టలేక ఓల్గా అతని వెనక రివ్వుమని పోతూ)

ఓల్గా : చవటపీనుగా ! ఆపాడుప్రేమ వ్యాపారాన్నిగూర్చే యింకా ఆలోచన ! మూర్ఖుడు ! (ఈపోటుమాట సూటిగా గ్రుచ్చుకుంటుంది, ఫియోడోర్ ఆగి. కొంచెంతిరిగి: ఓరగా ఒక్క కనుబొమనే ఎత్తి వాళ్లందర్నీచూస్తాడు. చూపులో నవ్వులాంటిదే కనిపిస్తూంది. వెంటనే గిరుక్కునమళ్ళి. తలుపుభళ్ళున తెరుస్తాడు. వంటింట్లో యేదో పడినధ్వని. ఒక్కక్షణం అంతానిశ్శబ్దం.)

ఓల్గా : ....ఆపాతగొడవే....

తలానోవ్ : నువ్వాసంగతి యెత్తివుండాల్సిందిగాదు. ఆండ్రీ ! నువ్విప్పుడు త్వరగా యిక్కడినుంచి వెళ్ళిపోవాలనుకుంటా (కాలెస్నికోవ్ ద్వారంవైపునడుస్తాడు. ద్వారందగ్గర అన్నా అతన్ని ఆపుతుంది.)

తలానోవ్; అతణ్ణి వెళ్లనీ.

అన్నా : (గుసగుసగా) వీల్లేదు. ముందు వాకిట్లో టోపీ, వాడూ యెవడో నిల్చున్నాడు. చలికి వణుకుతూ, ఏదోచిత్రమైన ధ్వనిచేస్తున్నాడు.

తలానోవ్ : బహుశా, నాకోసంవచ్చిన రోగై వుంటాడు.

అన్నా : ఈ వేళప్పుడు రోగి యెవడొస్తాడు ? రోగిమాత్రం ఐవుండడు.

ఓల్గా : ఐతే. ఫియోడోర్ ఎల్లా వెళ్లేడు ?

అన్నా : వాడు ఫియోడోర్ కోసం నిల్చోలేదని స్పష్టంగావడంలేదూ ! (ప్రక్కగదిలోంచి డబుల్‌తలుపులు గంభీరంగా తెరుచుకుంటాయి. కోటులేకండా చొక్కాతోటే ఫెయూనిన్ ప్రవేశిస్తాడు. తన పదవికి పొంగిబోర్లాపడుతూ, స్వర్గంయేదో మెట్టుమీదున్న

ట్లుంటాడు. అతనివెనకే వయ్యారంగానడుస్తూ కొకోరిష్కిన్-కొకోరిష్కిన్ నడక్కి తాళంవేస్తూ, అతనిచేతిలో "ట్రే" మీద వైన్‌తోనిండినగ్లాసులు "గణగణ" ధ్వనిస్తుంటాయి. ఈ మేళం నడచివస్తుంటే వెనకనుంచి సంగీతం వినిపిస్తూంటుంది.)

ఫెయూనిన్ : క్షమించండి. ఈరాత్రి కాస్తఉల్లాసంగా అందరితోనూ గడుపుదామనుకున్నా....ఎవరువారు ? కొత్తవాళ్ళున్నట్లుందే ? (గత్యంతరంలేక అన్నా ఒక్క అంగలో ముందుకువచ్చి పడుతుంది.)

అన్నా : మాకు సంతోషసమయమే. అబ్బాయి దేశాంతరంనుంచి యిప్పుడేవచ్చేడు.

తలానోవ్ : యుద్ధరంగంమీదుగా వచ్చేటప్పుడు వాడి బుజంలో గుండు దెబ్బతగిలిందికూడాను.

ఓల్గా : మీకు పరిచయం చేయనివ్వండి. ఇతడు ఫియోడోర్ తలానోవ్. ఈతడు మన కొత్తమేయరు, ఫెయూనిన్....(ఇద్దరూ అభివాదనం చేసుకుంటారు. నిరాసక్తతగా కొకోరిష్కిన్ ప్రక్కకి చూస్తాడు.)

కొలెస్నికోవ్ : క్షమించండి. షేక్‌హాండ్ యియ్యలేను.

ఫెయూనిన్ : దూరదేశాల్లో వున్నపుడే నిన్నుగూర్చి చాలాచాలావిన్నాను. ఈవేళసుదినం. మావిందుకి రావాలిసుమా. (అంతా తలోగ్లాసూ అందుకుంటారు. కొకోరిష్కిన్ చేతులువణికి గ్లాసులు గణగణలాడుతాయి.)

ఫెయూనిన్ : ఒరేయ్ చవటా ! నువ్వూ ఓగ్లాసుతీసుకోరా. ఇంటికి తిరిగొచ్చిన ఈయువకుడి ఆరోగ్యం కోరుతూ త్రాగు !

(కొకోరిష్కిన్ తాపీగా టేబుల్‌మీద ట్రేవుంచి, బాగా నిండుగా వున్న గ్లాసును యెంచి తీసుకుంటాడు.)

కొకోరిష్కిన్ : స్వాగతం! ఫియోడోర్ ఇవానోవిచ్!....సుస్వాగతం! (ఈమాటలు వినేటప్పటికంతా నిర్ఘాంతపోతారు. చంపబడ్డ జర్మనుల శవాలమీద చీట్లలోనిమాటనే తానుచ్చరించినట్లు కొకోరిష్కిన్ గ్రహిస్తాడు. వికవికలాడుతూ, వంగివంగి దండాలు పెడుతూ, చమత్కారంగా నాట్యంచేస్తాడు.)

ఓల్గా : కొకోరిష్కిన్! నువ్వామాట మరిచిపో. లేకపోతే ప్రమాదంలో పడగలవు సుమా: (కొకోరిష్కిన్ కంగారుపడతాడు. అంతా నవ్వుతారు.)

ఫెయూనిన్ : దానికూపీ యెల్లా లాగడమాఅని అస్తమానూ వాడు దాన్ని గురించే వాగుతూంటాడు....(తనగ్లాసును యెత్తుతూ) ఈశ్వరుని కృప! మళ్ళీ మంచిరోజులు వచ్చేయి!

[రెండవ అంకం సమాప్తి.]

# మూడో అంకం.

మొదటిఅంకంలోనిగదే. కాని, కొత్తయజమాని అభిరుచి కను గుణంగా అలంకరించబడి వుంటుంది. తివాచీలు, మొక్కలకుండీలు, హార్మోనియం, ఖరీదైన ఫర్నిచరు, అన్నీ ఫెయూనిన్‌రాకతో తిరిగి వచ్చేయి. స్టేజికి ఐమూలగా పొడుగాటి టేబులు. దానిమీద రకరకాల తినుబండారాలు అమర్చబడి వుంటాయి. అతిథుల సంఖ్యనుబట్టి చుట్టూ కుర్చీలు వేసివుంటాయి. ఫుట్ లైట్లకు వీపుత్రిప్పి, యెత్తైన పడకకుర్చీ ముందుభాగంలో వేసివుంటుంది. విందుయేర్పాట్లు సేవకుడు సరిచూసు కుంటున్నాడు. అతని కన్ను మెల్ల; ఒళ్లంతాబొచ్చు; తెల్లటిబట్టలు ధరించి వుంటాడు. ఫెయూనిన్ రోల్డుగోల్డు సులోచనాలు పెట్టుకొని, ఠీవిగా సిగరెట్టు పొగవదులుతూ, టేబిల్‌దగ్గరకూర్చుని కొకోరిష్కిన్ అందిం చేకాగితాలమీద సంతకాలు పెడుతూంటాడు. గడ్డం గీయించుకుని, మంచిదుస్తులేసుకుని, వెడల్పైన మెడపట్టీధరించి పుష్టిగాకనిపిస్తూం టాడు. షియోడోర్ పటంవుండేచోటనే అంతకంటే చిన్నపటం వుంటుంది. ఆపటంలో కుర్రవాడికినుదుట పెద్ద సుడివుంటుంది. మాట్లా డుతూన్నా అంతా ఆపటంవైపే చూస్తూంటారు.

కొకోరిష్కిన్ : ఇంకొక్క కాగితం!

ఫెయూనిన్ : నీ కాయితాలు తగలెయ్యా, నాతల తిరిగిపోతూందిరా.

కొకోరిష్కిన్ : రాచకార్యాలు, బాబూ, రాచకార్యాలు. అలవాటు పడే వరకే కొంచెంకష్టం. ఆతర్వాత యేమీవుండదు. (తరువాత కాగితం అందిస్తూ జర్మన్లు ఉపయోగించుకోతగ్గ ఆస్తిని దాచి పెట్టడాన్నిగురించి). కంగారుపడకండి, స్వామీ. స్వర్రీయే యీ ఆర్డరును జారీచేయించేదు! (ఫెయూనిన్ సంతకంచేస్తాడు.) ఆఖరిది, అయ్యా. (వికటహాసంతో) స్వర్రీ ఆఫీసులోంచి ఛీఫ్

కాన్స్టబిల్ ఫెడోటోవ్ బైటికి వస్తూంటే చూసేను. గీసిన కంద గడ్డలా యెర్రబడిపోయిన మొహం జేబురుమాలుతో తుడుచుకుంటూన్నాడు. స్త్రీచేత గట్టిగా చీవాట్లు తిన్నట్లుంది! ఏం, ఆండ్రీని పట్టుకోడమంటే వేళాకోళమనుకుంటున్నారా? [కాగితంఅందిస్తూ] గోరిల్లాలకి సంబంధించిన ఆసామీలను దాచినందుకు మరణశిక్షవిధించే ఆర్డరు.

ఫెయూనిన్ : (కాగితం అందుకుంటూ) ఆచోకీ యేమేనా దొరికినట్టా?

కొకోరిష్కిన్ : వాళ్ళు పద్దెనిమిదిన్నర మందిని ఖైదీలుగా పట్టుకున్నారు! ఒకడు పిల్లవాడుగనక, అరటిక్కెట్టు! వీళ్లలో యిద్దరికి ఆండ్రీదళంతో సంబంధంవుందని వాళ్ల ఊహ!

ఫెయూనిన్ : వాణ్ణి మనమే పట్టుకోగలిగితేనా!

కొకోరిష్కిన్ : (స్పష్టంగానూ, నెమ్మదిగానూ) అట్లాగే పట్టుకోవచ్చు. (ఫెయూనిన్ చేతిలోని కాగితాన్ని జారవిడిచి, కళ్లద్దాలమీదుగా చూస్తాడు. కొకోరిష్కిన్ సాభిప్రాయంగా సేవకునివైపు చూస్తాడు.)

ఫెయూనిన్ : ఒరేయ్! యిల్లాచూడు. కూర తయారయిందేమో చూసిరారా. బహుశా యీపాటికి అయేవుంటుంది! (సేవకుడు తలానోవ్‌ల యింటిభాగంలోకి వెడతాడు.)

కొకోరిష్కిన్ : నాకో నేస్తంవున్నాడు....కాని, వాడికి ఆశ చాలావుంది.

ఫెయూనిన్ : అహాఁ

కొకోరిష్కిన్ : వాణ్ణిచూస్తే మీకు నవ్వొస్తుంది. యుద్ధానికిముందే వాడికి రాచకార్యాల్లో ఆసక్తివుండేది. పసికట్టడం, కూపీలాగడం వాడికి పుట్టుకతో వొచ్చినవే! దొంకతిరుగుడెందుక్కాని, చేతగానివాడని ఫెడోటోవ్ నెల్లాగా శిక్షిస్తూన్నారు కనుక....

ఫెయూనిన్ : (గ్రహిస్తూ)నీస్నేహితుడికిఛీఫ్‌కాన్‌స్టబుల్ అవాలనుందా? పెద్దపులినోట్లో తల దూర్చుతూన్నాడుసుమా! స్ప్రరీఅంటే వీబ్బెల్‌కే హడలు. నువ్వెప్పుడేనా అతగాణ్ణి చూసేవా? ఓ మాటైనా?

కొకోరిష్కిన్ : (గౌరవసూచకంగా నిట్టూరుస్తూ) నేనెక్కడ, ఆయనెక్కడ!

ఫెయూనిన్ : వెధవాయి! డబ్బుపారేస్తారు కాదుటోయి!

కొకోరిష్కిన్ : వాణ్ణెల్లాగేనా దారికి లాక్కురావాలని చూసేను. వినిపించుకుంటేనా! మామూలురోజుల్లో వాడుకొనేదేట, డబ్బు. ఎంతతంటాలుపడ్డా, యిప్పుడు డబ్బుకి యేవస్తువూ దొరకటమే లేదుగదా. మాస్కో పడిపోయింతర్వాత మరోనాణేలు వేస్తారేమో? అప్పుడీడబ్బెందుకు పనికొస్తుంది?

ఫెయూనిన్ : ఔనులేరా. అదిప్పుడెక్కడిమాట! మాస్కోతర్వాత వోల్గా; ఆతర్వాత యూరల్సు; యింకాపోతే సైబీరియా. నదులు, అడవులు, మంచు. అన్నీదాటితే యేముందో యెవరికి తెలుసు, కొరివిదెయ్యాలురా......రష్యాఅంటే తెలియదూ? కథల్లోచెపుతారే, ఎంతతిన్నా తరుగనిరొట్టె. అల్లాంటిదిరా! ఏమంటావు? (కొకోరిష్కిన్, అదంతా తన కవసరంలేదన్నట్లు బుజాలు కుదుపుతాడు.)......వాడిదగ్గిరనుంచి అడ్రసులాగాలోయ్. తరువాత బహుమతీ పట్టుకుపోమ్మను.

కొకోరిష్కిన్ : వాళ్ళు యీవేళ మరోముగ్గురు జర్మన్లకి "స్వాగతం" యిచ్చేరుట! ఇంకోజట్టుకి "స్వాగతం" యివ్వడానికి యేర్పాట్లు జరుగుతూండివుంటాయి. ఏం, వీట్లన్నిటికీ జవాబుదారి, మేయరుదేకదూ? ....."నువ్వుచుట్టలు కాల్చడంతప్ప యింకేంచేస్తా

న్నావు ?" అనిజర్మనులడగరూ ? (ఫెయూనిన్ ఉలిక్కిపడి చుట్ట క్రిందపారేస్తాడు.) కొన్ని రోజులుపోతే మళ్లీ సరుకు చౌక గావచ్చు. (కొకోరిష్కిన్ కాగితాలు పోగుచేసి "పోర్టు-ఫోలియో" లో పెట్టుకుంటాడు. ఫెయూనిన్ రుసరుసలాడుతూంటాడు. డేమిడ్‌యేవ్నా కూరగిన్నె లోపలికితెస్తుంది. ఆమె నల్లటిదుస్తులు కట్టుకొనివుంటుంది. సేవకు డామెవెనకేవస్తాడు )

డేమిడ్‌యేవ్నా : (తీవిగా) ఈచెత్త యెక్కడ పడెయ్యమన్నారు ? త్వరగా చెప్పండి.

కొకోరిష్కిన్ : జాగ్రత ! అడ్డేవాగకు. ఏం. అంతతొందరేం ? పోతావులే. యింకెన్నిరోజులు ?

డేమిడ్‌యేవ్నా : నువ్విల్లాంటివాడివని కనిపెట్టనే లేకపోయేం.

కొకోరిష్కిన్ : ఏ వంటపనో యిమ్మని రానూవస్తావు; నిన్ను తరుమనూ తరుముతా. నిన్ను తరుమకపోతే నా పేరు కొకోరిష్కినేకాదు.

ఫెయూనిన్ : (కొకోరిష్కిన్‌ను వూరుకోమని) ఏయ్, ముసలమ్మా ! యిక్కడపెట్టు. ఏదీ, చూడనీ, బాగాతయారుచేసేవా ? (ఓముక్క తీసి) నమిలిచూడు, ఉడికిందేమో ?

డేమిడ్‌యేవ్నా : గట్టిగావుంటుంది. నములేను.

ఫెయూనిన్ : ఫర్వాలేదులే. నములు. (అతడి భయానికి హేళనగా చిరునవ్వు నవ్వుతూ, ఆమాంసంముక్క తింటుంది. ఫెయూనిన్ ధైర్యంతెచ్చుకుని అంతకంటె చిన్నముక్క తింటాడు.)

ఫెయూనిన్ : ఏం బాగులేదే. కొంచెం మాడిందికూడాను. ఎందుకల్లా నవ్వుతావు. గోడమీద నోటీసుచూసేవా, నువ్వు ? ఎవరో "ఆంద్రీ"ట, వాడికోసం జర్మన్‌లు వెతుకుతున్నారు. (ఆమెకేసి

కళ్లెగరేస్తూ) ఏం, నువ్వేం ఉపాయం చెప్పలేవూ ? బహుమతి దొరుకుతుందిలే. ముసలితనంలో అక్కరకొస్తుంది.

డేమిడ్‌యేవ్నా : నేనేంచేసుకుంటాను. వెళ్లేటప్పుడు కూడాపట్టుగెళ్లనా యేమిటి ? ఏదో తినేదైతే, యింకా....

ఫెయూనిన్ : అవే కావాలంటే యేర్పాటుచేయిస్తా.

డేమిడ్‌యేవ్నా : ఏవైతే బాగుంటాయి ? ధాన్యంనయమా ? డబ్బాతిండా ?

ఫెయూనిన్ : నీయిష్టం. సబ్బులూ, ధాన్యాలూ అయితే యెంతకాలమైనా నిలవుంటాయి.

కొకోరిష్కిన్ : ఈజిప్టులో ఓగోరీలో "మమ్మీ" తీసేరుట దానితోబాటు జొన్నలూ, సబ్బుముక్కా దొరికేయిట. అంతా నిన్న మొన్నే పెట్టినట్లు కొత్తగావున్నాయిట !

డేమిడ్‌యేవ్నా : నువ్వెల్లా తెక్కచూస్తావు ? వాడి కెత్తుకెత్తు తూచియిస్తావూ ? బట్టలతో ? వాడిజేబులోబాంబులున్నాయనుకో. అప్పుడో. అవి చాలాబరువే ! (కొకోరిష్కిన్ చతురతగా ముఖం చాటు చేసుకొని, నిశ్శబ్దంగా నవ్వుతాడు. అతని భుజాలు కదులుతూంటాయి. సేవకుడూ జేబురుమాలు నోటికడ్డుపెట్టుకుని నవ్వుతాడు.)

ఫెయూనిన్ : ముసిలిముండా ! ఈ వేళ నాపుట్టిన దినంకూడాను. అశుభం మాట్లాడకు. (అతడు వెనక్కిచూస్తాడు. సేవకుడు తొందరగా సీసాలు తుడుస్తూన్నట్లు నటిస్తాడు. డేమిడ్‌యేవ్నా మెల్లిగా వెళ్లిపోతుంది. ఫెయూనిన్, కొకోరిష్కిన్ ప్రక్కలో పొడుస్తాడు.)

కొకోరిష్కిన్ : ఏమండోయ్ ! నన్ను పూరాగానవ్వకోనీండి నవ్వాపుకుంటే గుడ్లుపేలిపోతాయిట !

ఫెయూనిన్ : చాలు. అక్కడితోచాలించు. నన్ను విసిగించకు.

కొకోరిష్కిన్ : ఆ( ! నన్నొదలండి. మొస్సాల్‌స్కీ యింతకంటె

ఎక్కువేయిస్తాడు. చూచాయగా అతగాడికి తెలిస్తేసరి!

ఫెయూనిన్ : అయితే మరినీస్నేహితుడు. వాణ్ణినమ్మచ్చునంటావా?

కాకోరిష్కిన్ : మీ అనుమానం బంగారంగానూ! (ముఖం గంభీరంగా పెట్టి, బహు నమ్మకంగా) అతని తండ్రి బీద మేస్త్రీ. అతన్ని అనుమానించ దగింది. గతంలో యేమీలేదు. పైపెచ్చు, సోవియట్ ప్రభుత్వపు సొమ్ము తినేసినందుకు శిక్షించబడ్డాడు కూడాను. వెధవదింతాచేసి నూటనలభై రెండు రూబుల్సు!

ఫెయూనిన్ : ఇంకా యెక్కువ తిండానికి భయపడ్డాడా?

కాకోరిష్కిన్ : అబ్బే! అంతకంటె యెక్కువ అతని దగ్గిర వుంచందే!

ఫెయూనిన్ : ఆ నిషధయోగ్యుడివి నువ్వే ననుకుంటా!

కాకోరిష్కిన్ : (ధూర్తంగా) చిత్తం, నేనే! (ఇద్దరూ నవ్వుతారు.)

ఫెయూనిన్ : బాగుంది. ఏదీ నీసరుకు? అతిథులు రాకముందే చూపించు మరి, త్వరగా.

కాకోరిష్కిన్ : అబ్బే. ఇల్లాంటి ఛాన్సుకోసం యుగంనుంచి కనిపెట్టుకునివున్నా. ఆశతో నాప్రాణం కొట్టుకులాడింది.

ఫెయూనిన్ : పోనీ కొంచెం కొసఅందించు. నువ్వునన్ను బుట్టలో పెడుతూన్నావేమో? ఎవడునమ్మేడు, నిన్ను?

కాకోరిష్కిన్ : కొసేనా మీకు కావలసింది?... (తలానోవ్ ద్వారంవైపు సాకూతంగా చూస్తూ, "ఓల్గా" అని మెల్లిగా ఊది, గిరుక్కున మళ్ళుతాడు. ఫెయూనిన్ సాలోచనగా "ఊహూఁ" అంటూ సాగతీస్తాడు.)

ఫెయూనిన్ : వాడెంతదూరంలో వుంటాడు?

కాకోరిష్కిన్ : మెల్లిగా నడిచినా ఓఅరగంటచాలు.

ఫెయూనిన్ ; వాడు నిన్నుతప్పించుకుని పోడుగదా ?

కొకోరిష్కిన్ : అప్పుడే వాడిమీద ఓసి. ఐ. డీని వేసేను. చలికి చేవులు పిడచకట్టుకుపోయినా, వాడు జరిగిందిచూస్తూ, వింటూవుంటాడు. (వికవికలాడుతూ) తాను బైటపడకుండా, తనవాళ్లని బైటపెట్ట కుండా వుండగలడు, మనవాడు. మొహమేనా కనబడనీయడు... వాడికంతా ఉట్టివడియం ! తెలిసిందా ?

ఫెయూనిన్ : నీకు పైకొచ్చే యోగంవుందిరా ! సరే. కాగితాలు తీసెయ్యి. అబ్బబ్బా, వెధవ్వాసన. కొంచెంసెంటు రాసుకోరాదుట్రా......... కొంచెం ఏమిటి ; నామొహం, ఓ సీసాకుమ్మరించుకోరా, మరి. పోయిరా. వచ్చేక స్వర్రీ దగ్గిరికి పంపిస్తా. నీతెలివితేటలు అక్కడే చూపిద్దువుగాని. గుమ్మందాకావెళ్ళి, తన గుట్టు బైట పెడతాడేమోననే భయంతో తిరిగిచూస్తూ, "ఏమండోయ్ ! వాణ్ణి బెదరగొట్టేరుసుమా" అంటాడు. వాడూ వెళ్ళిపోగానే ఫెయూనిన్ తిన్నగా తలానోవ్ గదిగుమ్మందగ్గిరికి వెడతాడు. రెండు సార్లు తలుపు తట్టడానికి సిద్ధపడి, మళ్లీ వెనకాడుతాడు. ఫెయూనిన్ యింకా వెనకముందాడుతూండగానే ఆవలివైపునుంచి తలానోవ్‌నీడ తలుపు మబ్బుటద్దంమీద పడుతుంది. ఫెయూనిన్ రెండోమూలకి ఒక్క అంగలోవురికి, మహాపనిలో మునిగిన వాడిలా నటిస్తూ, టెలిఫోన్ తిప్పుతూంటాడు. తలానోవ్ తలుపు కొడతాడు.)

ఫెయూనిన్ : (టెలిఫోనులో) కమాండెంటుఆఫీసు—నేనా—ఫెయూనిన్ —సరే—అల్లాగే—ఆగుతాను—(తలుపుతిరిగి తట్టబడుతుంది.) లోప లికి రాండి. (చిరాకుగా కనిపిస్తూన్న తలానోవ్ ప్రవేశిస్తాడు.)

ఫెయూనిన్ : ఇదేమిటీ ! మీరొక్కరే ? భార్యను తీసుకురాలేదేం ? ఇది మర్యాదేనా ?

తలానోవ్ : నేను విందుకురాలేదు. వ్యవహారంమీద వచ్చేను.

ఫెయూనిన్ : (క్లుప్తంగా) స్వంతవ్యవహారమా ?

తలానోవ్ : పూర్తిగా అట్లాగేఅనడానికి వీల్లేదు,

ఫెయూనిన్ : దయచేసి కూర్చోండి. (టెలిఫోనులో) ఇంకా పనిమీదే వున్నారా ?—కనిపెట్టుకొనివుంటా. (సాలోచనగా, టేబిల్వంక చూస్తూ) పాతిక సంవత్సరాలు నేను నిద్రావస్థలోవున్నా. ఏదో రోజునమేలుకొంటాననే ఆశమాత్రం నన్ను వదలలేదు. ఏ రాత్రో కురిసివెలిసినవానలా తెలియకుండానే ఆకష్టాలు దాటిపోతాయనుకున్నా. తెల్లవారి కళ్లు తెరిచేటప్పటికి, మామూలుగానే సూర్యుని బంగారుకిరణాల్లో ఆపిల్చెట్లు ఫలభారంతోవంగి కిటికీ లోంచి ఆహ్వానిస్తూంటాయి. అంతా వడ్డించిసిద్ధంగా వుంటుంది. అహాఁ హాఁ! ఏమి దివ్యభోజనం! కాని, హృదయంలో యేదో భారంగావుంటుంది. ఎదట కనిపించేది విందుగాదు, నాశ్రాద్ధభోజనం అనిపిస్తుంది.... ఈజబ్బుపేరేమంటారు, డాక్టర్ ?

తలానోవ్ : ఫెయూనిన్! దాన్ని "భవితవ్యసూచకం" అంటారు.

ఫెయూనిన్ : భవిష్యత్సూచకమా ?....(టెలిఫోనులో)నమస్తే! ప్రియమిత్రమా, చిట్టీ! నాకు "నూమర్" కావాలి. నమస్తే—(అతినమ్రతగా) ఎవరూ ?—హెర్స్ప్రీ అసిస్టెంటా ?—నేను ఫెయూనిన్—ఔను, విందుకు రావడాన్నిగూర్చి; ఆయన వాగ్దానం చేసేరు కూడాను. ఏమిటీ ? వినిపించడంలేదు. ఏమిటంటారు ? (రిసీవర్ను దులిపి, అందులో ఊదుతాడు.) కమాండెంటుకూడ వస్తానన్నారు.... మేయరు అధికారాన్ని వారు బలపరుస్తూన్నట్లు తెలియొద్దూ ?.... ఔను. కొంతమంది అప్పుడేవచ్చేరు. ఏమిటీ ?.... వినపడ్డంలేదు. అబ్బే. ఉఁహూఁ. వినిపించడంలేదేం ? ఏమిటం

టారు ? (తలానోవ్‌తో) ఏమిటో ఈల వేస్తూన్నట్లు ధ్వని విని పిస్తూందే ? ఎవరో అరుస్తూన్నారు. వినండి !

తలానోవ్ : (టెలిఫోన్ చెవిదగ్గర పెట్టుకుని) ఎవరో స్త్రీ ఆర్తనాదం లావుందే !

ఫెయూనిన్ : సోల్జర్లు ఎవరినో ప్రశ్నిస్తూన్నట్లుంది..... అయ్యో ! ఈకం ఠంయెవరిదో తెలుసున్నవాళ్లదే. (ఆతురతగా) మీ ఓల్గా యింటి దగ్గరేవుందా ?

తలానోవ్ : (ఉలికిపడి) వుండాలి.... ఏం ?

ఫెయూనిన్ : ఏమీలేదు. ఈఘడియకి ధన్యులం. (జాగ్రతగా టెలిఫోన్ క్రిందపెడుతూ) స్క్రీని మనంయిప్పుడు కదపకూడదు. సరే, నాపనయింది. డాక్టర్ ! ఇప్పుడుచెప్పండి, మీరు వచ్చినపనేమిటో ? (సప్రయత్నంగా తలానోవ్ ఆత్మసంయమనం చేసుకుంటాడు. నిమీలితనేత్రాలతో ఫెయూనిన్ కుర్చీలో వెనక్కిజేరబడి, గడియారపుగొలుసుతో ఆడుకొంటూ, వింటూంటాడు.)

తలానోవ్ : నాఅసమ్మతిని తెలియజేయడానికేయిప్పుడు మీదగ్గరికివచ్చేను.

ఫెయూనిన్ : ఇప్పుడొచ్చిన యిబ్బందేమిటంటా ?

తలానోవ్ : మా అబ్బాయి యింటికి వచ్చినట్లు మీకు తెలుసునుగదా. ప్రస్తుతం వాడుయింట్లోనే వుంటున్నాడు. వాడు, నిన్నను స్నాన గృహానికిబోయి ప్రయాణబడలిక తీరేటట్లు స్నానంచేసి వద్దామను కుంటూంటే....

ఫెయూనిన్ : బుజంమీద గుండుదెబ్బ మానకుండానే స్నానం ? అయ్యయ్యో ! ఈకుర్రవాళ్లెంత నిర్లక్ష్యంగా వుంటారండీ...క్షమిం చండి, మీకు అడ్డొచ్చా.

తలానోవ్ : (ఈపొరపాటు తర్వాతనైనా సూటిగా అసలువిషయానికి రావాలని) ఇంట్లోకి మాగుమ్మంముందరే ఓడిష్టిపిడతను కాపలా పెట్టేరని తెలుసుకున్నా.... నెత్తినిటోపీ, మంచుకి పిడచకట్టిన చెవులూ వాడూ, ఆచెవలపీనుగు....(ఫెయూనిఞ ఒకన్ను తెరిచి, నెత్తిమీద మొట్టుతూంటేలా చూస్తాడు. తిరిగి నిశ్చలంగా కూర్చుంటాడు. మనస్సులోని ఆందోళనని వణుకుతూన్న చేతి వ్రేళ్ళు తెలుపుతూంటాయి. తలానోవ్ సంభాషణ సాగిస్తాడు.) ఫియోడోర్‌కి ఆందోళనకలిగి తిరిగి వచ్చేశాడనుకోండి. (నిబ్బ రంగా, ఉద్రేకంతో) ఫెయూనిన్ ! వినండి. నాకు అరవై దాటింది. ఇప్పటివరకూ నావిషయంలో యేప్రభుత్వమూ కలుగజేసుకోలేదు. ఇప్పుడువచ్చిన యీ నూతనపాలకులుకూడా నాకుటుంబాన్ని ప్రశాంతంగా వుండనివ్వాలని కోరుతూన్నా. (అంటూ టేబిల్ మీద గట్టిగా చరుస్తాడు. ఫెయూనిఞ అతనిచెయ్యి పట్టు కుంటాడు.)

ఫెయూనిఞ : అంత ఉద్రేకపడకండి, డాక్టరుగారూ ! శాంతించండి. మనసు కుదుట బరుచుకోండి. మిమ్మల్ని యిబ్బంది పెట్టాలని ఎవరనుకుంటున్నారంటా ? కాని, యిక్కడ పైవాళ్లెవరూలేరే, ....ఈపట్టణం అంతా చూడవలసినవాళ్లం నేనూ, కొకోరిష్కినూ తప్ప యింకెవరూలేరే ? ఇంకోళ్ల యింటిముందర నిలుచుని చహరా తీస్తూండడానికి పెద్దమనిషి దొరుకుతాడటండీ ! మాటొ చ్చిందిగనుక చెపుతూన్నా. తెలిసిందీ ? అంచేతే యెవడో తల మాసిన రౌడీవెధవని పెడతారు, యిల్లాంటి పనికి ! (అసహ్యాన్ని సూచిస్తూ) చెవులూ పిడచకట్టుకుపోతాయి, మరి. ఒక్కొక్క ప్పుడు చెవులేవుండవు :....అంతేనా, యీచెవలపీనుగులు చూడ్డా నికి పరమాసహ్యంగా, ఎదురుకుండా పీడకలలాగవుంటారు.

హుం, గొలుకంపు! వాడి గాలితగిలితే రోగాలుకూడా వస్తాయి. నేనుచేస్తాను కాదూ. వాణ్ణిమార్చి, మరోయోగ్యుణ్ణి పంపేయేర్పాటు చేయిస్తాకదూ? సరా? (ప్రక్కగదిలో చిలకగడియారం ఆరుకొట్టిన ధ్వని. చీకటి పడుతుంది.) అతిథులు ఒక్కడూ యింకారాలేదు. ఇదీ జర్మన్ పంక్చ్యుయాలిటీ! ఫెయూనిన్ ఉద్దేశపూర్వకంగానే నిశ్శబ్దంగా కూర్చుంటాడు. తలానోవ్ వెళ్ళిపోడు. ఫెయూనిన్‌కి కొంత తెలిసివుంటుందనే సందేహం అతన్ని బాధిస్తూంది.)

ఫెయూనిన్: ఐతే, మరిచేపోయేను. ఆఉత్తరంసంగతి యేమాలోచించేరు?

తలానోవ్: ఉత్తరమేమిటి?

ఫెయూనిన్: మరిచేపోయేరా! ఉత్తరం మీరురాయొచ్చు. మీకుమాత్రె. ఓల్గా అందిస్తుంది. ఆమెయింకా అతన్ని కలుసుకుంటూనేవుంది.. ....ఆఁ! ఇరుగో అతిథులు యిప్పుడిప్పుడే వస్తున్నారు! (ఏసందులోంచో దూరివచ్చినట్లు ఓ పొడుగాటి పెద్దమనిషి ప్రత్యక్షమవుతాడు. జుట్టు నిటారుగా లేచివుంటుంది. చాలాకాలంగా మడతపెట్టి పెట్టిలో వుంచిన కోటు తొడుక్కునివుంటాడు. ఇతణ్ణి చూస్తే హయగ్రీవుడు గుర్తొస్తాడు. ఎవరికో తెలియకుండా వంగి సలాంచేసి, కాలిమీద కాలేసుకుని కుర్చీమీద కూర్చుంటాడు. తర్వాత వంటినిండా రిబ్బన్‌లు, బౌలుపెట్టుకుని వయ్యారంగా నడుస్తూన్న స్త్రీకి కైదండయిస్తూ ఓలావాటి పెద్దమనిషి అడావిడిగా వస్తాడు. ఈతడు టాల్‌స్టాయిలా రష్యన్‌బ్లౌజు ధరించి, యూనివర్సిటీబాడ్జి పెట్టుకుని వుంటాడు. వచ్చి, ఓక్షణం టేబిల్ దగ్గరనిల్చుని, ముందుకుబోతారు. వాళ్ళక్కడనుంచి కదలగానే, విందుదుస్తుల్తో ఓముసలిది విసినికర్రతో విసురుకుంటూ వచ్చి

అక్కడే నిల్చుంటుంది. అసహ్యంగా టాకీలువేసిన ఫెల్టుబూట్లు తొడుక్కుని వుంటుందామె. గారడీవాడి గంపక్రిందనుంచి వచ్చి నట్లు అతిధులు అక్కడక్కడ యిద్దరిద్దరుగా, ముగ్గురుగా ప్రత్య క్షమౌతారు. కొకోరిష్కిన్ బడాయిగా అతిధులతో మాట్లాడుతూ, అడావిడిగా తిరుగుతూంటాడు. తలానోవ్‌ని సాగనంపడానికి ఫెయూనిన్ గుమ్మందాకావస్తాడు.)

ఫెయూనిన్ : ఫియోడోర్ ప్యాస్‌కోసం దరఖాస్తుపెడతా. స్నానానికి అర్ధరాత్రి వెళ్లాలనుకున్నా వెళ్లొచ్చు....(నడవలోగడబిడ. అటు చూస్తూ) నేనేవచ్చి అతనితో మాట్లాడతా. (తలానోవ్‌తో బైటికి పోతూ) కొకోరిష్కిన్ ! అతిధుల్ని చూస్తూండు. ఇప్పుడేవస్తా. (కొకోరిష్కిన్ స్విచ్‌నొక్కుతాడు. లైట్లు వెలుగుతాయి. అట్ట బొమ్మల్లా నిశ్శబ్దంగా, పరిమితచలనంతో అతిధులు వస్తుంటారు. నడవలోంచి జర్మన్‌భాషలో మాటలు వినిపిస్తాయి. కొకో రిష్కిన్ బైటికిచూస్తాడు. ఉన్నట్లుండి, చిన్నవాడైనట్లు కనిపిస్తాడు.)

కొకోరిష్కిన్ : (అడావిడిగా) నిలబడండి తొరగా....స్ప్రీ!

[అంతా ద్వారంకేసి చూస్తారు. అడావిడిగా మొస్పాల్‌స్కీ ప్రవే శిస్తాడు.]

మొస్పాల్‌స్కీ : ఇక్కడున్న పెద్దమనుష్యుల కందరికీను........వాల్టర్ వాల్టరోవిచ్ తిన్నగా పనిలోనుంచి వచ్చేడు యిక్కడికి. రాత్రి నిద్రకూడాలేదు. (నిశ్శబ్దం. ఎవరో ద్వారంవైపు బయలుదేరు తారు) ఒద్దు. వెళ్లద్దు. మీరు మాట్లాడుకోవడానికి అడ్డులేదు. కాని కొంచెం నెమ్మదిగా వుండాలి.

[ఎవరూ ఊపిరికూడా పీల్చరు. చిన్న అడుగులు వేస్తూ ఓమహా స్థూలకాయుడు చిరుచక్రాలమీద దొర్లి వస్తూన్నట్లుగా ప్రవేశిస్తాడు.

పసుపురంగు ముఖం; పీపాలాంటి వంటిమీద ఊదారంగు సూటు బిగుతుగా వుంటుంది. పందికిమల్లే శరీరమంతా తిరగనిదే తల త్రిప్పలేడు. ఎడమప్రక్క గుండెలమీద "ఫస్టుక్లాసు ఐరన్‌క్రాస్" ధరించి వుంటాడు. నిశ్చలంగా నిల్చుని, చుట్టూ చూస్తాడు. ఈత్తూన్నట్లుగా చేతులు వయ్యారంగా కదిలిస్తూ, కొకోరిష్కిన్ సమీపిస్తాడు.]

కొకోరిష్కిన్ : (ఉత్సాహంగా) స్వాగతం! హెర్‌స్ప్రరీ, సుస్వాగతం! స్వాగ....(ఆమాట తుపాకిమ్రోతలా ధ్వనిస్తుంది. స్ప్రరీ ముఖవర్ణం మారిపోతుంది. రిబ్బన్లు కట్టుకున్న స్త్రీ కష్టంగా ఊపిరి తీస్తూంది. స్టేజి మధ్యభాగం నిర్జనమౌతుంది. స్ప్రరీ నోటంట ఈలవేస్తూన్నట్లు చిత్రమైనధ్వని. ఎర్రటి బ్రష్‌లాంటి అతడి మీసం వెక్కిరిపిస్తూన్నట్లు నిలువుగీతగా కుంచించబడుతుంది. శవంలా తెల్లబోయి, కొకోరిష్కిన్ వెనక తగ్గుతాడు.)

కొకోరిష్కిన్ : క్షమించండి!....నాఉద్దేశం....అదిగాదు.......

స్ప్రరీ : (వాడక్కడ లేనట్లుగా కొకోరిష్కిన్ మీదికి నడుచుకుంటూ పోతూ) ఛీ! చావుపీనుగా!

[కొకోరిష్కిన్ భయంతో వెనకవున్న టేబిల్‌కి ఒత్తుకుంటాడు. దానిమీద సీసాలూ, గ్లాసులూ క్రిందపడి పోతాయి. అతని ముఖం భయాశ్చర్యాలతో వివర్ణంగా వుంటుంది. మెడపట్టీ వెనకనించి చెయ్యి పోనిచ్చి స్ప్రరీ కొకోరిష్కిన్ మెడ పట్టుకుంటాడు.]

స్ప్రరీ : కొలెస్నికోవ్ ?

[కొకోరిష్కిన్‌ను బెండులా యెత్తి, గిరుక్కున త్రిప్పి, ఒక్కచేత్తో సులువుగా జాపి పట్టుకుని, గుమ్మం దగ్గిరికి తీసుకుపోతుంటాడు. ఒకరి కళ్లల్లోకి ఒకరు చూస్తూ, అడుగులో అడుగేస్తూ యిద్దరూ నడుస్తున్నారు. కొకోరిష్కిన్ ఏమీ పెనుగులాడటం లేదు. స్ప్రరీకాలు తొక్కుతానేమో ననే భయం మాత్రమే వానిలో కనిపిస్తూంది. అప్పటికే సగం

వచ్చిన కొకోరిష్కిన్‌ను గుమ్మం దగ్గర ఓపొడుగాటి సార్జెంటుమేజర్ అందుకుంటాడు. అక్కడినుంచి త్వరత్వరగా కొకోరిష్కిన్ జీవితంలో అంతిమఘట్టం ముగుస్తుంది. గోడలావల దగ్గరలోనే "ఫైయూనిన్" అనే ఆర్తధ్వని వినిపిస్తుంది. తర్వాత అంతా నిశ్శబ్దం. తుపాకి చప్పుడు కూడా యెవరో 'తుప్పు'ని తుమ్మినట్లుగా గుల్లగా వినిపిస్తుంది. ఆక్షణం లోనే, ఆలోచనానిమగ్నుడైన ఫైయూనియన్ మీసం చప్పరిస్తూ తిరిగి ప్రవేశిస్తాడు. పరిస్థితిని చటుక్కున గ్రహిస్తాడు.]

ఫెయూనిన్ : (సంభ్రమంతో చుట్టూ కలయజూస్తూ) ఆముసలాడు, పొట్టిగా వుంటాడే, వాడెల్లా పోయేడు ?

హయగ్రీవుడు : (బొంగురుగా) ఆముసలాడు మనలోకంలో లేడు !

మొస్పాల్‌స్కీ : (ఆందోళనతో చేతివ్రేళ్ల మెటికలు విరుస్తూ) ఏమండీ! సంగీతం వచ్చినవాళ్లెవరూ లేరా ? (ఎవరో హార్మోనియం వాయించడం ఆరంభిస్తారు. శ్రుతులు పోయినచోట స్వరం తప్పుతూ, ఆపాత హార్మోనియం 'బొంయ్' మంటూంటుంది. స్ప్రర్రీ తిరిగి వస్తాడు.)

స్ప్రర్రీ : ఉఫ్ఫ్ ! (వింతగా మొహం మీదినుంచి పొగలు వదలుతూన్నట్లు కనిపిస్తాడు.) వెళ్లేడు.........వాడు.........యింటి కెళ్లేడు. (చమత్కరిస్తూ) ఏదో కాస్తదూరం షికారు పోయేడు !

మొస్పాన్‌స్కీ : (మృదువుగా) అదో పాతరష్యన్ సామెత !

[అంబోతులా స్ప్రర్రీ, ఓక్షణం సేపు నిశ్శబ్దంగా వుంటాడు! తర్వాత విరగబడి పెద్దపెట్టున నవ్వుతాడు. కొకోరిష్కిన్ తప్పటడుగుకి అంతాకూడా నవ్వుతారు.]

స్ప్రర్రీ : అన్నీ సామెతలే ! హాఁ హాఁ ! మూర్ఖుడు ! (ముగ్గురు జర్మన్ ఆఫీసర్ల ప్రవేశం. ఫెయూనిన్ చప్పట్లుకొట్టి సంతోషం తెలియ

జేస్తాడు. అందరూ అతన్ననుకరిస్తారు. ముందు నడుస్తున్న ఆఫీ
సరు ముఖం మీద విషపునవ్వు కనిపిస్తుంది.

ఒకటో ఆఫీసరు : ఇదే నిజమైన స్వర్గంలా వుందే।

రెండో ఆఫీసరు : అక్కడకూడా టోగంవాళ్ళుంటేను।

మూడో ఆఫీసరు : (ముగ్గురిలోకీ బాగా త్రాగినట్లుంది) ఇదేమిట్రా, గుర్రాలశాల్లోకి వచ్చేం।

(వాళ్లు ముగ్గురూ చాలసేపు విరగబడి, ఖణేలుమంటూ నవ్వు తారు. స్త్రీవాళ్లని ఓరకంటితో చూస్తాడు.)

స్త్రీ : (కోపంగా) ఏమండీ, మీరు 'ఫ్రహర్' ఫొటో యెదట వున్నామని గుర్తుంచుకోండి।

(భయంతో ఆఫీసర్లు ప్రక్కగా తప్పుకుంటారు. రిబ్బన్లుకట్టుకున్న స్త్రీ దగ్గరకి వాళ్లు వస్తూండడం చూసి లావుమనిషి కంగారు పడతాడు. మొస్పాల్‌స్కీ, ఫెయూనిన్‌కి సంజ్ఞ చేస్తాడు.)

మొస్పాల్‌స్కీ : ఫెయూనిన్। ఈజంతువులన్నీ నీకు బాగా తెలిసినవేనా?

ఫెయూనిన్ : ఆఁహాఁ। వీళ్లంతా పారిశ్రామికవేత్తలూ, న్యాయశాస్త్రజ్ఞులూను : ఒకడు సంగీతశాస్త్రంలో నిధికూడాను. ఎటొచ్చీ, పేరు సంపాదించుకొనేందుకు అతనికి టైం లేక పోయిందంతే।

మొస్పాల్‌స్కీ : ఇక్కడేం జరిగినా నువ్వే బాధ్యుడివి. ఇంట్లో 'షాంపేన్' ఏమైనా వుందా?

ఫెయూనిన్ : టేబిల్‌మీదే వుంది. ఏం, విజయవార్త వస్తుందనేనా? ప్రముఖులెవరేనా వస్తున్నారా?

మొస్పాల్‌స్కీ : విను, మరి. పావుగంటలో కమాండెంటు యిక్కడికి వస్తున్నారు. విందు ప్రారంభించవచ్చు.

ఫెయూనిన్ : (గంభీరంగా) అతిథులారా। ఈపేదవాని ఆతిథ్యాన్ని స్వీకరించి, ధన్యుణ్ణి చేయండి।

[అంతా టేబిల్ వైపు మూగుతారు. వీబ్బెల్‌కోసం వేసిన కుర్చీకి ఎడమవైపునవున్న కుర్చీలో స్ప్రరీ కూర్చుంటాడు. అతని చుట్టూ చాల మేర ఖాళీగా వుండిపోతుంది. ఎదట వాచీ వుంచుకుని, మొస్పాల్‌స్కీ చాకుతో వైన్‌గ్లాసుమీద టంగ్‌మని కొడుతుంటాడు. నిశ్శబ్దంగా వుండ మని. ఓ ఆఫీసరు, టేబిల్ ఆవలి ప్రక్కనున్న మరొకడితో "ఏరా! ఇది విన్నావూ? లేటెస్టుజోక్! ఓ యూదుడో పడుచుపిల్ల దగ్గిరికి వచ్చేట్ట......." అంటూంటేనే ఆవలివాడు నవ్వారంభిస్తాడు. మొస్పాల్ స్కీ గ్లాసుమీద చాకుతో కొడుతూనే వుంటాడు.]

మొస్పాల్‌స్కీ: అందరూ గ్లాసులు నింపాలని గృహస్థు కోరుతూ న్నాడు. (గ్లాసుల్లో వైన్ పోస్తున్నచప్పుడు) మన యీవిందుకి కమాండెంటుగారు యీపాటికి వస్తూంటారు. వారి అనుజ్ఞ ప్రకా రం మీకు నాలుగు మాటలు చెపుతా. ఆట్టే టైంకూడా లేదు. అంచేత క్లుప్తంగానే తేలుస్తా (స్ప్రరీతో) రష్యన్ భాషలో మా ట్లాడడానికి మీ అనుజ్ఞా? (స్ప్రరీ గంగిరెద్దులా తలూపుతాడు.)

మొస్పాల్‌స్కీ: (గంభీరంగా, ఉపన్యాసకుని పోజులో) సోదరీ సోదరు లారా! మనకందరికీఆతిధ్యం యిస్తూన్న యీసద్గృహస్తుయొక్క ఉత్సాహానికి నాఅభివందనాలు. ఇది చాల పవిత్రసమయం. ధర్మ సంస్థాపనార్థమై జర్మనీ సాగిస్తూన్న యీయుద్ధంలో ఆఖరిరంగం సమాప్తం గాబోతూంది. క్రిక్కిరిసిపోయిన ఐరోపాఖండంలో, స్లావ్‌జాతులు అన్ని వైపులనుంచీ జర్మన్ జాతిని నొక్కేస్తు న్నాయి. ఆర్యజర్మనులు, ఒక్కుమ్మడిగా విజృంభించి, మహా ప్రవాహంలా గట్లు తెంచుకుని తూర్పుకి అద్వితీయ వేగంతో వస్తున్నారు. పాతనంతా యెగరగొట్టి, నూతనవ్యవస్థను నిర్మిస్తూ న్నారు. వారు అడుగు పెట్టిన చోట్లలో అందుకు దక్షతగల నూతన పరిపాలకవర్గాన్ని స్థాపిస్తున్నారు. ఈక్షణంలోనే మాస్కో

పతనవార్త వస్తుందని ఆశిస్తున్నాం.........

స్ప్రీ : టైమ్ ఎంత ? (గాఢనిశ్శబ్దం. స్ప్రీ టైమ్ చూసి, టెలిఫోన్ దగ్గిరికి వెళ్ళి రిసీవరుమీద చెయ్యి వేస్తాడు.)

మొస్సాల్‌స్కీ : (ఖణేలు మనే గొంతుతో) ప్రాగ్దిశాకవాటముల మీద ఎన్నో శతాబ్దాలనుంచి చెక్కు చెదరకుండా వ్రేల్లాడుతూన్న తాళాలు నేటికి బ్రద్దలు కొట్టబడ్డాయి. ఇప్పుడే మాస్కో పట్టుకోబడింది !.........

[తెచ్చి పెట్టుకున్న భక్తితో ఫెయూనిన్ 'క్రాస్' చేసుకుంటాడు. హయగ్రీవుడు, తన ముఖంమీది చెమటను పెద్దజేబురుమాలుతో ఒత్తుకుంటాడు. అంతా లేచి నిల్చుని గ్లాసులు యెత్తుతారు. టెలిఫోన్‌బెల్ మ్రోగుతుంది. స్ప్రీ చటుక్కున రిసీవరు నెత్తి ముఖం దగ్గర పెట్టుకుంటాడు.]

స్ప్రీ : నేను-కల్నల్‌స్ప్రీ—ఎవరా మాట్లాడేది ?—(హఠాత్తుగా టెలిఫోను మీద పడిపోతూన్నట్లుగా) ఖూనీ చెయ్యడమే ?....ఎవరు? హో—ఇంకా యెవరు !—లోరెంజ్, ఫా, ముల్లీ—ఔనా—

[కుర్చీల్ని పక్కకి గెంటేసి ఆఫీర్లంతా స్ప్రీ చుట్టూ చేరుతారు]

ఫెయూనిన్ : (మొస్సాన్‌స్కీని మెల్లిగా పొడుస్తూ) ఏమిటది ? ఏం జరిగింది ? ఆయన్నడగండి ? మాస్కో కెథెడ్రల్సు యింకా నిలబడే వున్నాయా ? అడగండి.

మొస్సాల్‌స్కీ : (స్ప్రీ మాటల్ని విప్పి చెపుతూ) ఊరుకో.......
వీబ్బెల్‌ని చంపేసేరు. మరో ముగ్గురు స్టాఫ్ ఆఫీసర్లతో సహా. ఇక్కడికి వస్తూంటే దారిలోనే ?

[ఫెయూనిన్ రెండు చేతులతో తల పట్టుకొంటాడు.]

స్ప్రీ : (టెలిఫోనులోకి) ఎవడ్రా చంపింది ? (కోపంగా) జవాబు చెప్ప

రా, చవటపీనుగా!—ఊరికే గొణుగుతావేమిటి?—ఒక్కడే!—
ఆరుగుళ్ళు కాల్చేడా?

మొస్పాల్‌స్కీ: (ఫెయూనిన్‌తో) ఒక్కడే ఆరుగుళ్ళు కాల్చేట్ట!....
వీళ్ళు పిశాచాల్లా వున్నార్రా, బాబూ!

[ఫెయూనిన్ తనచేతిని మొస్పాల్‌స్కీ జబ్బమీదినుంచి చటుక్కున లాక్కుంటాడు. ఈగందరగోళంలో అవకాశరి చూసుకొని హయగ్రీవుడు వైన్ త్రాగటానికి గ్లాసును పైకెత్తుతాడు. మొస్పాల్‌స్కీ 'ఫెడేలు' మని హయగ్రీవుడి చేతిమీద కొడతాడు.]

మొస్పాల్‌స్కీ: ఏంరా! పందివెధవా: ఎందుకురా తాగుతున్నావు?

హయగ్రీవుడు: (కోపంగా) ఏమిటా వేళాకోళం?....మరీ మోటసరసం!

మొస్పాల్‌స్కీ: (పళ్లు బిగించి) వేళాకోళం యేమిటి? నీపిండం!

హయగ్రీవుడు: (వెనకతగ్గుతూ, కోటుమీదపడ్డ చుక్కల్ని చేత్తో తుడిచేసుకుంటూ) ఉఁహూఁ! అట్లాగా....సరే!

[స్పర్రీ వీళ్లవైపు చూసి బుసలు కొడుతాడు. అతని మూర్తి మరీ భయంకరంగా వుంటుంది. మెడపట్టీ బిగువైనట్లుంటుంది. అతిథులు పలచబడుతూంటారు. చడీచప్పుడూ లేకండా ఎల్లా వచ్చిన వాళ్ళల్లాగే మాయమవుతూంటారు.]

స్పర్రీ: (టెలిఫోన్‌లోనే) వాణ్ణి పట్టుకున్నారా? ఆఁ! మంచిది. నేనిక్కడే వుంటా.........వాణ్ణిక్కడికి తీసుకురాండి. (రిసీవరును పెట్టేసి, మధ్యగావున్న కుర్చీలో కూలబడతాడు. నిలుచున్న ఆఫీసర్లంతా చల్లగా టేబిల్‌చాటుకి తగ్గి, చేతులతో టే తినడం ప్రారంభిస్తారు) ఈవెధవ మూకనంతా బైటికి కొట్టెయ్యి!

మొస్పాల్‌స్కీ: (ద్వారంవద్ద గుంపుగావున్న అతిథులతో) అయ్యా! నేరస్థుడి విచారణ యిక్కడే జరుగుతుంది. తరవాతి ముచ్చట

బజారులో రేపు మీరే చూస్తారు. ఈవేళకు వెళ్లండి.

[అతిథులతో అతడుకూడా ద్వారంవరకు వెడతాడు. స్వర్రీ నిశ్చలంగా కూర్చుని వుంటాడు. తలుపు తట్టిన శబ్దం. విందుకి ఆలస్యంగా బైలుదేరిన తలానోవ్ దంపతులు తలుపు తీసికొని ప్రవేశిస్తారు. వాళ్లకి యిక్కడ జరిగిన గొడవలేమీ తెలియవు.]

తలానోవ్ : ఫెయూనిన్! క్షమించండి ఆలస్యం అయింది!

అన్నా : ఫియోదోర్ కూడ ఓక్షణంలో వస్తాడు. గాయానికి కట్టుకట్టించుకుంటున్నాడు.

['మాట్లాడకండి' అన్నట్లు పెదవులమీద వ్రేలుంచుకుని ఫెయూనిన్ వాళ్ళదగ్గిరికి చటుక్కున పోతాడు.]

ఫెయూనిన్ : ఈసంగతి విన్నారా మీరు ? మంచి తమాషాయే. వాళ్ళు వీబ్బెల్‌ను కాల్చేసేరుట ! ఇంకో ఆరుగుర్నికూడా కిక్కురుమనకుండా చంపేసేరు. చచ్చినవాళ్ళ సంఖ్య పెరిగి పోతూంది !

అన్నా : అసంభవం ! ఎంత భయంకరంగా వుంది !

ఫెయూనిన్ : పదిగుళ్ళు. ఒకటి తర్వాత ఒకటి ! ఏకటాకీని !

తలానోవ్ : ఎవరు కాల్చేరు ?

ఫెయూనిన్ : ఆఁ !....వాడే అయి వుంటాడు..........వాడి కింకా బొడ్డు కోసి పేరెట్టలేదు. 'అలెగ్జీ' అనికాని 'అలెగ్జాండరు' అని కాని యింకా చెప్పలేము. అయ్యయ్యో ! వీబ్బెల్‌కి ఎల్లాటిగతి పట్టిందిరా, దేవుడా! అతని సంతకంతో ఆమ్‌స్టర్‌డామ్ వీధుల్లో నోటీసులింకా వేలాడుతూనే వున్నాయామెను. ప్రారబ్ధం కాకపోతే యేమిటంటా ? ఖర్మయ్యా, ఖర్మ. ఖర్మే వాణ్ణి లాక్కొచ్చింది! ఇంతవరకూ రష్యన్ రొట్టి ముట్టుకుని చేతులు కాల్చుకోకండా వున్నవా డెవడున్నాడండీ !

తలానోవ్ : (తెరవడానికి తలుపుగుబ్బవైపు చెయ్యి జాపుతూ) మేము

వుండడం అనవసరం అనుకుంటా. వెళ్ళడం మంచిది.....

ఫెయూవిల్ : (అతన్ని పట్టుకుని ఆపుతూ) ఉండండీ. అసలు కథ పట్టు యిప్పుడే వుంది. వాణ్ణి యిక్కడికి తీసుకొస్తున్నారు. (తమ వైపు వీపు తిప్పి కుర్చీలో కూచున్న స్వ్రిీ వైపు తల యెగరే స్తాడు.) ఇప్పుడు దొరికినపిట్ట యెల్లాంటిదో చూడాలని నాకెంతో యిదిగా వుంది. ఈమూల్లో నిశ్శబ్దంగా కూచుని చూస్తూండండి.

స్వ్రిీ : టేబుల్ ! పేపర్ !

[కుర్చీమీద పిండిబస్తా పడేసినట్లు దిబ్బకొట్టుకున్నట్లుగా, నిశ్చలంగా స్వ్రిీ కూర్చుని వుంటాడు. చీట్లాట టేబిల్ ఒకటి అతని ముందర వుంచుతారు. సిరాబుడ్డి. కాగితాలు, కెరాఫీ, గ్లాసు, టేబిలుమీద సర్దు తారు. ఆఫీసర్లకి కుర్చీలు వేయబడినాయి.]

స్వ్రిీ : దయచేసి, మీమీ స్థలాల్లో కూర్చోండి :

[ఆఫీర్లు నిద్రమేల్కొన్నట్లు ఒక్కమాటు సచేతను లవుతారు. బూట్ల టకటక, కుర్చీల బరబర; ఆఫీసర్లు కుర్చీలమీద కూర్చోబడతారు. కార్యవ్యగ్రుడై మొస్పాల్‌స్కీ గంభీరంగా తిరిగి వస్తాడు.]

మొస్పాల్‌స్కీ : (స్వ్రిీతో) వాణ్ణిక్కడికి తీసుకొచ్చేరు. లోపలికి తీసుకు రావచ్చా ? (స్వ్రిీ చూపుడు వ్రేలితో సంజ్ఞ చేస్తాడు. మొస్పాల్‌స్కీ వంగి, సలాం చేసి నిష్క్రమిస్తాడు. ద్వారానికి రెండుప్రక్కలా సోల్జర్లు 'అటెన్‌షన్' లో నిలుచుంటారు. బైటనుంచి మిలిటరీ ఆజ్ఞలధ్వనీ. తర్వాత 'ఖణేల్' మని దగ్గూ వినవస్తాయి. పరిచితమైన ఆదగ్గు విని, అన్నా ఉలికిపడి చటుక్కున లేచి నిల్చుంటుంది. వెంటనే తలానోవ్ ఆమెను సముదాయించి కూర్చోబెడతాడు. అప్పుడే సోల్జర్లు ఫియోదో ర్‌ను లోపలికి తీసుకొస్తారు. ఫియోదోర్ చరచరా నడిచివస్తాడు. అతని నెత్తిమీద టోపీలేదు; ఓవర్‌కోటు తొడుక్కునివుంటాడు.

మామూలు అలవాటు ప్రకారం జేబురుమాలును చొక్కా చేతి లోపలికి దోపుకుంటూ, మరీ పొడుగ్గాను, గంభీరంగాను కని పిస్తాడు. బాల్యానంతా గడిపిన ఆగది నాలుగు మూలలా ఔత్సు క్యతలో ఫియోడోర్ కళ్లు పరుగెత్తుతూంటాయి. అతన్ని తీసి కొని వచ్చిన ఆఫీసరు ఫియోడోర్ రివాల్వరును స్ప్రీ యెదుట టేబిల్‌మీద వుంచి, అతడి చెవులో యేదో చెపుతాడు. దేవా లయంలోవలె గదంతా నిశ్శబ్దం. స్ప్రీ లేచి ఖైదీచుట్టూ పరీక్షగా ప్రదక్షిణంచేసి, ఫియోడోర్ భుజంమీద లేని ధూళిమరకను దులిపి, నిశ్శబ్దంగా వచ్చి కుర్చీలో కూర్చుంటాడు.)

స్ప్రీ : (మొస్పాల్‌స్కీతో) వాణ్ణి ప్రశ్నించు.

మొస్పాల్‌స్కీ : (కసి స్పష్టమవుతూన్న కపటమర్యాదతో) దయచేసి కొంచెం దూరంగా నిలబడండి, అయ్యా!

ఫియోడోర్ : ఊరికే బెదురుతావెందుకు? నాదగ్గరున్నవన్నీ లాక్కు న్నారులే!

మొస్పాల్‌స్కీ : దూరంగా నిల్చో! (చలిచేతనా అన్నట్లు రెండుచేతులూ రాసుకుంటూ ఫియోడోర్ ఒకడుగు వెనక్కి నిలబడతాడు.) నువ్వు నిజం మాట్లాడటం మంచిది. త్వరగా తెమిలిపోతుంది. నీకు బాధ తగ్గుతుంది. జర్మన్ కమాండెంటుమీద కాల్చింది నువ్వేనా?

ఫియోడోర్ : ఈగదిలో పైవాళ్లెవళ్లూ లేకుండా చేయమని కోరుతున్నా. ఇదేం నాటకమా? ...ఏకపాత్రాభినయమా?

[ఫియోడోర్ చూపు ననుసరించి మొస్పాల్‌స్కీ తలానోవ్ దంపతుల్ని చూస్తాడు.]

మొస్పాల్‌స్కీ : వీళ్ళెక్కడెందుకున్నారు?

ఫెయూనిన్ : (కొంచెం లేచి) సాక్షులు. ఈమనిషిని గుర్తు పట్టడానికి.

మొస్సాల్‌స్కీ : వాళ్లుండడానికి అనుమతిస్తున్నా. అమ్మా! కొంచెం దగ్గరగా రాండి, మీరూనూ....(తలానోవ్ నుద్దేశించి) యిక్కడికి! (ఫియోడోర్‌తో) నీపేరు, యింటిపేరు?

ఫియోడోర్ : నాకో సిగరెట్టు కావాలి.

[మొస్సాల్‌స్కీ, స్ప్రీవైపు చూస్తాడు. 'ఇవ్వ' మని స్ప్రీ వ్రేలితో సంజ్ఞచేస్తాడు. కాల్చే కొన పట్టుకొని మొస్సాల్‌స్కీ ఒక సిగరెట్టును ఫియోడోర్‌కి అందిస్తాడు.]

ఫియోడోర్ : అగ్గిపుల్ల!

[స్ప్రీ నవ్వుతాడు. మొస్సాల్‌స్కీ అగ్గిపుల్ల గీసి, ఫియోడోర్ చేతిలోని సిగరెట్టు కందిస్తాడు. వాళ్ళిద్దరూ ఒకరి కళ్లల్లోకి ఒకళ్ళు సూటిగా చూసుకుంటారు. అగ్గిపుల్ల మంట వాళ్ళవ్రేళ్ళని కాలుస్తూన్నా గుర్తించలేనంతగా వాళ్ళల్లోని ద్వేషం రగులు తూంటుంది. కాలిపోయిన అగ్గిపుల్లని పారేసి మొస్సాల్‌స్కీ వెనక తిరుగుతాడు.]

ఫెయూనిన్ : (మాంచి కులాసాగా) నక్కపుట్టి నాలుగు వారాలు కాలేదుగాని........

స్ప్రీ : ఎవడు వీడు?

మొస్సాల్‌స్కీ : నీపేరేమిటి?

ఫియోడోర్ : నన్ను 'ఆంద్రీ' అంటారు. ఇంటిపేరు 'కొలెస్నికోవ్'

[అంతా యీపేరు వినడంతోనే ఉలికి పడతారు. కొడుక్కి పట్టనున్న దుర్గతిని మార్చడానికా అన్నట్లు, అన్నా చేయిత్తి "కాదు........ కాదు........" అంటుంది. స్ప్రీ తన శరీరాన్నంతా ఆవైపు త్రిప్పి, ప్రశ్నార్థకంగా చూస్తాడు. అప్పటికే ఆమె ఆత్మసంయమనం చేసుకుని, నిబ్బరంగా కూర్చుంటుంది.]

ఫియోడోర్ : రాసుకో. మళ్ళీ చెప్పమంటే మాత్రం చెప్పను.

మొస్సాల్‌స్కీ : (సందేహంగా) నిజంగా అది....నీపేరే?

ఫియోడోర్ : ఉరిస్తంభం మీద వ్రేళ్ళాడ్డం కోసం తహతహలాడు తున్నా ననుకున్నావా? తప్పుడు పేరు పెట్టుకున్నవాడికి ఆలాటి గౌరవం కూడానా!

మొస్సాల్‌స్కీ : (ఆఫీసరుతో) దయచేసి నోటుచేయండి. (ఫియోడోర్‌తో) నీవృత్తి? హోదా?

ఫియోడోర్ : నేను రష్యన్ను. నావృత్తి దేశరక్షణ.

మొస్సాల్‌స్కీ : అది నాకు తెలుసు..........నువ్వు యిటీవల చేసి మానిన వృత్తియేది? (నిశ్శబ్దం)

ఫెయానిన్ : నేను చెప్పొచ్చా? జిల్లాసోవియట్‌కి చైర్మన్.

[మెల్లిగా మొస్సాల్‌స్కీ చెపుతూంటే, ఆఫీసరు రాస్తూంటాడు]

ఫెయానిన్ : అంతే. అంతే. కావలిస్తే తలానోవ్‌ని అడగండి. ఆయన డాక్టరు. ఈపట్టంలో వాళ్ళనందర్నీ యీయ నెరుగును.

మొస్సాల్‌స్కీ : దీన్ని మీరు రూఢీ పరుస్తారా!

తలానోవ్ : (అనిశ్చితంగా) ఔను....మేము మీటింగుల్లో కలుసు కుంటూంటాం.

ఫెయానిన్ : మీరింకా అవిణ్ణికూడా అడగొచ్చు. (మొస్సాల్‌స్కీ అన్నావైపు చూస్తాడు.)

అన్నా : (చూపుల్ని ఫియోడోర్ మీదనుంచి మరల్చకుండానే) ఔను. యితన్ని కలుసుకుని పది సంవత్సరాలై వుంటుంది. కాని, యితన్ని గుర్తుపట్టగలను. ఇంక నే వెళ్ళొచ్చా?

మొస్సాల్‌స్కీ : ఇంకొక్క క్షణం, అమ్మా! (తలానోవ్ దంపతులు కూర్చుంటారు.)

స్ప్రైరీ : వాడి అనుచరు లెందరు?

మొస్సాల్‌స్కీ : మీరెంతమం దున్నారు?

ఫియోదోర్ : నాకు అర్థం అయింది లేవయ్యా. మేం అయిదుగురం.

[స్ప్రీ కళ్లల్లో నవ్వు కనిపిస్తుంది.]

మొస్సాల్‌స్కీ : (రహస్యంగా అడుగుతూన్నట్లు) కొలెస్నికోవ్! నువ్వు పొరపాటు పడ్డం లేదుగదా!

ఫియోదోర్ : (అదేమాదిరి గొంతుపెట్టి) అబ్బే! నాకు యెప్పుడూ లెక్కల్లో మంచి మార్కులే వచ్చేవి!

(అందరూ నవ్వుతారు.)

మొస్సాల్‌స్కీ : ఐతే మీవాళ్లు ఒక్కసారి పదిచోట్ల యెల్లా పనిచేసేరు? కనీసం ముప్పై నలభైమందికి తక్కువుండరనుకున్నామే.

ఫియోదోర్ : మేమంత పకడ్బందీగా పని చేసేం గనకనే అంతమందున్నామని యన్నారు. (ఉద్రేకం అణుచుకుంటూ) కొంచెం ఆగవయ్యా! మావాళ్ళు నలుగురే మిగిలితే నీకు వందమందిలా కనిపిస్తారు!

["వాడి కెంత కండకావరమో, చూడండి!" అన్నట్లుగా ఫెయూనిఁా తలానోవ్ ప్రక్కలో పొడుస్తాడు.]

మొస్సాల్‌స్కీ : (కోపం ఆపుకుంటూ) నువ్వు వేళాకోళం కట్టిపెట్టకపోతే చూడు! లంజాకొడకా! నీమొహం మీద నవ్వూ గివ్వూ ఒక్క దెబ్బతో తుడిచేస్తానురా. నేనెవర్నో తెలుసా....

ఫియోదోర్ : (కోపంతో ముఖం జేవురిస్తుంది.) ప్రవాసంలో నీతల్లి యిల్లా మాట్లాడమనే నేర్పిందా?

[స్ప్రీ పిడికిలితో బల్లమీద గుద్దుతాడు. గ్లాసు, కెరాఫీకి తగిలి ఖంగ్ మంటుంది. అంతదాకా మొస్సాల్‌స్కీలోవున్న గంభీరప్రశాంతత లెరిగి చక్కాబోతాయి. "ఓరి పిశాచప్పినుగా! త్వరగా చావాలని చూస్తూన్నావుట్రా!" అని తిడుతూ, యెగిరిపడి లేస్తాడు. టేబిల్ మీద రివాల్వరు తీసి, ఫియోడోర్‌మీది కురుకుతాడు. ఇల్లాటివాటికి అలవాటు

పడ్డ వాళ్ళలా యిద్దరు సోల్జర్లు ఫియోడోర్‌ను వెనకనుంచి విదిలించి. ధణాయించి నిలబెడతారు. కనుబొమలు ముడేసి అన్నా తనకుమారుని ముఖంలోకి నిశ్చలంగా చూస్తుంది.]

ఫెయూనిన్ : (మొస్పాల్‌స్కీ జబ్బ పట్టుకుని) ఇక్కడకాదు, ఇక్కడ కాదు, మొస్పాల్‌స్కీ! నామాట విను, నాయనవుగావూ, యిక్కడ కూడదు. చుట్టూ పదార్ధాలన్నీ వడ్డించి వున్నాయి. ఫర్నిచరంతా రక్తం అవుతుంది. మనపెరట్లో యెంచక్కాటి చిన్న షెడ్ వుందికదూ?.......నామాట విను.

["ఈపని బైట జరిగితేనే మంచి" దన్నట్లుగా స్పిరీ సంజ్ఞ చేస్తాడు. ఫియోడోర్‌ను బైటికి తీసుకుబోతారు.]

అన్నా : నేను వెళ్లడానికి వీల్లేకపోతే.........వెనకతిరిగి కూచుంటా. కెప్టన్! మీసోల్జర్ల వేడుకలు నాకేమీ నచ్చవు.

మొస్పాల్‌స్కీ : (కంగారుగా) అమ్మా! తమరువెళ్లవచ్చు. కృతజ్ఞులం!

[బైటివాళ్ళని కలుసుకోడానికి తొందరగా వెడతాడు.]

అన్నా : కళ్లు చీకట్లు కమ్ముతూన్నాయి. నాక్కొంచెం సాయం చేయండి, ఇవాన్. (క్రింద పడిపోయిన ఫియోడోర్ జేబురుమాలు చూసి, అన్నా వంగి పైకి తీస్తుంది. దాని మీద యెర్రని పెద్దమరక వుంటుంది....ఆమె దాన్ని తీయడం అంతా చూస్తారు. మళ్ళీ రుమాలును జారవిడుస్తుంది.) దీనిమీదా రక్తమే! ప్రపంచంలో యెంత రక్తపాతం!

[వారి వెనకే ఫెయూనిన్ సవినయంగా పోతాడు. ముందుగా అన్నా వెళ్ళిపోతుంది.]

ఫెయూనిన్ : మీభార్య ఎంత ధైర్యవంతురాలండీ! డాక్టర్! ఆమె ముందు మీరే బలహీను లనుకుంటా.

[వారిని పంపేసి, ఫెయూనిన్ వెనక తిరిగి తలుపు మూస్తాడు. స్ప్రీ గదిలో పచారు చేస్తున్నాడు. బొమముడితో టెలిఫోన్ చూసి ప్రక్కకి తిరుగుతాడు. ఈలవేస్తూ టెలిఫోన్‌ను సమీపించి, రిసీవరును చేతిలో యెత్తి పట్టుకుంటాడు. విజయవార్త కోసం వేగిరపడుతూన్నట్లు టెలిఫోన్‌ను తట్టుతూండగానే ఒక మోటరుసైక్లిస్టును వెంటబెట్టుకొని. మొస్పాల్‌స్కీ కంగారుగా ప్రవేశించి సెల్యూట్ చేస్తాడు......స్ప్రీ ఓపెద్ద 'స్టాఫ్ ఎన్వొలప్'ను చించి లోపలున్న కాగితమ్ముక్కను పైకి తీస్తాడు. దానిమీద ముక్తసరిగా మూడు ముక్కలే వుంటాయి. స్ప్రీ ఆకాగితాన్ని యిటూఅటూ తిరగేస్తూంటే మొస్పాల్‌స్కీ దొంగచాటుగా అతని బుజంమీద నుంచి దాన్ని చదువుతాడు. అతని ముఖం భయాన్ని వెల్లడిస్తుంది.]

స్ప్రీ : ఖైదీని ప్రశ్నించడం నిలపండి.

[మోటారుసైక్లిస్టు, ఆఫీసర్లూ వెళ్లిపోతారు. గార్డు ఆఫీసరు "గార్డ్! డిస్-మిస్!" అంటాడు. స్ప్రీ ఉత్తరం మళ్లీ చదువుతాడు.]

ఫెయూనిన్ : విశేషాలేమిటి, మిత్రమా ?

మొస్పాల్‌స్కీ : (చొక్కా కఫ్-లింకను తొందరగా బిగించుకుంటూ) ఫెయూనిన్! నీవిందంతా సందులపాలయే టట్లుందయ్యా. మాస్కోలో పరిస్థితులు విషమిస్తున్నాయి.

ఫెయూనిన్ : (శకునపక్షిలా) అంటే వాళ్ళు కాళ్ళకి బుద్ధిచెపుతున్నా రన్నమాట! .......అయితే మనమాటేమిటి ?

[మొస్పాల్‌స్కీ బైటికి వెడతాడు. స్ప్రీ అట్లాగే శిలాప్రతిమలా నిలబడి వుంటాడు. అతన్నెలాగైనా కదిపి, కొంతైనా కూపీ పైకి లాగుదామనే ఊహతో, ఫెయూనిన్ బహుజాగ్రత్తగా ఒకగ్లాసు వైన్ చేత్తో పట్టుకుని మెల్లిగా సమీపిస్తాడు.]

ఫెయూనిన్ : తమరు యిది కొంచెం స్వీకరించాలి. ప్రభువులు! మన

స్సుకి కొ_స్త ఉత్సాహంగా వుంటుంది.

[ఫెయూనిన్‌ను గుర్తించటానికి ప్రయత్నిస్తూన్నట్లు యెగాదిగా పరకాయించి చూస్తాడు, స్ప్రేరీ. ఒక్కమాటుండి హఠాత్తుగా మీదకురికి మెడ పట్టుకుంటాడు. స్ప్రేరీ చేతుల్లో అటూ యిటూ గిలగిల కొట్టుకుంటాడు, ఫెయూనిన్. వైన్ యిల్లంతా చిందుతూంటుంది. ఇద్దరూ ఏదో గొణుగుతూంటారు. స్ప్రేరీ మేయరును ఓపదక కుర్చీలోకి విసిరేస్తాడు. గదిలోని విశ్శబ్దాన్ని భంగిస్తూ, స్ప్రేరీ ఉచ్ఛ్వాసనిశ్వాసాలు స్పష్టంగా వినిపిస్తూన్నాయి. ఆస్థితిలోనే గృహస్థునక్కడ ఒదిలి ఆతిధ్యం స్వీకరించకుండానే స్ప్రేరీ చర్రుమని పోతాడు. చాలసేపటివరకూ ఫెయూనిన్ కదలకండా కుర్చీలోనే పడుంటాడు. అతని ముఖం వివర్ణమైంది; కళ్లు మూతలు బడ్డాయి. కొకోరిష్కిన్‌కి పట్టినగతి అతవి మనోనేత్రం ముందు కట్టినట్లుంటుంది. కొంతసేపటిలో ఫెయూనిన్ కళ్ళు తెరిచేటప్పటికి ఎదుట కొలెస్నికోవ్ నిలబడి వుంటాడు. బొచ్చుకోటు ఓజబ్బకే తొడుక్కొని, రెండో జబ్బకి కట్టుతో ఫెయూనిన్ వైపు చోద్యంగా చూస్తూ నిలబడి వుంటాడు.]

కొలెస్నికోవ్ : ఏం, మెడనొప్పెట్టిందా ? (ఫెయూనిన్ అట్లే పడుకుని వుండి, యితనివైపు కళ్ళు చికిలించి చూస్తాడు.) ఇంకా ముందుగానే వచ్చి వుందేవాణ్ణి. మీరు అతిధితో యేదో తొందరపనిలో వున్నారని ఊరుకున్నానంతే....(అభినయపూర్వకంగా, యెట్లా వున్నాడో చూపుతాడు.) మిమ్మల్ని తొందర చేయడం యెందుకని.........

ఫెయూనిన్ : (వ్యంగ్యంగానే) స్నానానికి పోతున్నా వనుకుంటానే ?

కొలెస్నికోవ్ : వెళ్లాలి. చాలా ఆలస్యమయింది. ఇంటిదగ్గర కూచుంటే టైము తెలియనే లేదు.

ఫెయూనిన్ : ఫియోదోర్ ! అయిన ఆలస్యం ఎల్లాగా అయింది.

ఈ ముసలివాడితో కాస్సేపు కూర్చుని మరీ వెడుదూ.

(కొలెస్నికోవ్ కూర్చుంటాడు. జరిగే ఆలస్యానికి తగ్గ ప్రతిఫలం ముట్టక పోదని అతనికి తెలుసు.]

ఫెయూనిన్ : ఇంకొంచెం దగ్గిరగా కూర్చో.

కొలెస్నికోవ్ : హంతకుణ్ణి పట్టుకున్నారని విన్నా. మీలో ఉత్సాహం, హెచ్చరికా కనిపించవేం ?

ఫెయూనిన్ : ఫియోడోర్! నేనాలోచిస్తూనే వున్నానోయ్.........ఎఱ్ఱసైన్యం వెనక్కి తగ్గేటప్పుడు, నేను రోడ్డుపక్కనే నిలుచుని వున్నా. అంతటా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దతాభంగం జరుగుతుందేమోనని ఊపిరి పీల్చడానిక్కూడా భయపడతావు. ఏకటాకీగా సైనికులు సాగిపోతూన్నారు.........మనకి వినిపించే దొక్కటే ధ్వని, 'కటకట' మని. స్కీల క్రింద నలుగుతూన్న మంచు ధ్వనో, సైనికులు పళ్ళుకొరుకుతూన్న ధ్వనో నువ్వు పోల్చుకోలేవు. నేనక్కడ నిలుచుని చూస్తూనే వున్నా. అంతట్లో ఓచిన్న కుర్రాడు, పెద్దఆర్మీ కోటు తొడుక్కుని వున్నాడు. గబగబా నాదగ్గిరికి వచ్చి నన్ను కాగలించుకున్నాడు. వాడి ఊపిరి నన్ను కాల్చేసిదంటే నమ్ము. "తాతా! విచారించకు. రష్యన్లు తిరిగి వస్తారు. రష్యన్లు యెప్పుడూ తిరిగేవస్తారు." అన్నాడు. (క్రుంగిపోయినట్లు కనిపిస్తాడు.) నువ్వేమంటావు ?

కొలెస్నికోవ్ : అది మీరే చెప్పాలి. ఆపిల్లవాడు కాగలించుకున్నది మిమ్మల్నేగాని నన్ను కాదుగదా ?

ఫెయూనిన్ : నాకింకా యెన్నోజ్ఞాపకం వస్తున్నాయి. వెనకటి రోజుల్లో మాజీతగాణ్ణి పిలిచేవాణ్ణి. ఎవరో అనుకున్నావేమిటి ? మీనాన్నే. "పెట్రూఖా ! మన పంచకల్యాణికి జీనువేసి, గమాయూ౯—సెర్బియాంకాల్ని వెలపలా-దాపలా కట్టు." అతడూ పెద్దకోటు

తొడుక్కుని, ఎర్రటి బెల్టు నడుంకి బిగించి, బండి తోలుకొచ్చే వాడు. మేం ఎంతసరదాగా మైదానాల్లో షికారు పోయేవాళ్ళం!.... (కొలెస్నికోవ్ పోజులోగాని, చెయ్యెత్తి చూపుతూన్న ఫెయూనిన్ ముఖవైఖరిలోగాని యేమీ మార్పుండదు.) పీటర్ కొలెస్నికోవ్ని బాగానే చూసేవాళ్లం. పండుగులికి బట్టలు పెట్టేవాళ్ళం. వాళ్ల కుర్రవాడికి మిఠాయిలు కూడాను. (కొలెస్నికోవ్ మోకాలి మీద తట్టుతూ) ఫెయూనిన్ బిస్కత్తులు మరిచిపోయావా?

కొలెస్నికోవ్ : ఎవరితో మాట్లాడుతూన్నా ననుకుంటూన్నారు? నాకిదేమీ అర్థం కావడం లేదు.

ఫెయూనిన్ : (కటువుగా) నిన్నీవేళ భగవంతుడు కాపాడేడు. భగవంతుడూ, ఫెయూనినూ—యిద్దరూ యీవేళ నీమెడనుంచి ఉరిత్రాడు తప్పించేరు! (తలానోఫ్ యింట్లోనుంచి హెచ్చుస్థాయిలో పియానోపాట; క్రమంగా మంద్రమగుతూ చివరకి పాట ఆగిపోతుంది.) వజ్రహృదయం గలది, ఆవృద్ధమాత. తన కుమారుని కోసం విచారించడం లేదని నాకు తెలపడానికి ప్రయత్నిస్తూంది!.........(మృదువుగా) ఆంద్రీ! ఇంకా దాపరికం యెందుకు? దిగిరా. నువ్వు నాచేతులో వున్నావు.

[కొలెస్నికోవ్ అదిరిపడిలేచి, చుట్టూ పరికించి చూస్తాడు. నెత్తిమీద ఉక్కుటోపీ, భుజమీద తుపాకీ—బోయ్‌నెట్ ధరించిన జర్మన్ సెంట్రీ వెన్నెల్లో ఒక్క క్షణం నిలబడి, మళ్లీ పచారు ప్రారంభిస్తాడు. బైట వెన్నెల; మంచు కురుస్తూంది. సంజవెన్నెట్లో అన్నీ మసకగా కనిపిస్తాయి. కొలెస్నికోవ్ మళ్లీ కూర్చుని, సిగరెట్ వెలిగిస్తాడు.]

కొలెస్నికోవ్ : ఎక్కడికి దిగి రావడం? ఏదెట్లావున్నా నీవలలో చిక్కే వున్నానుకాదూ? ఎందుకు కబురు పంపేవు, చెప్పు?

ఫెయూనిన్ : ఇదొక కాళరాత్రిలా వుంది. నీచుట్టూ చూడు, జంఝా

మారుతం యెల్లాంటి చెట్లని పెకలించి, పడగొట్టేస్తుందో!
ఈతుపానులో నువ్వూ, నేనూ తుడిచిపెట్టుకు పోతే ఆశ్చర్యం
ఏముంది?........కాని, మనం మిత్రులంగానే విడిపోగలం
అనుకుంటా?

కొలెస్నికోవ్ : బ్రహ్మరాక్షసిలా, ఒదిలేటట్లు లేవే, నన్ను!

ఫెయూనిన్ : మిత్రమా! నీకు నేనే తలుపు తెరుస్తా..............
ఆర్మీ కోటులోవున్న ఆకుర్రవాడు తిరిగి వచ్చినపుడు, నువ్వు
నావృద్ధాప్యాన్ని కనికరించి కాపాడాలి. మాస్కోలో స్థాపించ
బోయే కంపెనీని గురించిగాని, పట్టుకుచ్చులాంటి మజ్లీణాలను
గురించిగాని నేనింక మరచిపోతా. తండ్రులు ప్రాణాలర్పించిన
స్థానాల్లో కొడుకులు నిలబడి ఆత్మత్యాగం చేస్తున్నారు! చివరకి
ఏ గుర్రాలసాల్లోనో కాపలాదారుగా నైనా కాలక్షేపం చేస్తాను.
అదే చాలు.........ఓకన్ను మూసుకో; వెళ్ళు! (ఒక క్షణం
ఊరుకుని, ద్వంద్వార్థంగా) బైటిబోయే దార్లన్నీ బంద్. ఈదారి
ఒక్కటే వుంది.

కొలెస్నికోవ్ : తెలిసింది. మీ మూకని మాస్కోదగ్గిర రష్యన్‌లు చావ
గొడుతూన్నారన్నమాట!........ఔనా?

ఫెయూనిన్ : నీకు అంతా ముందే వుంది.......జీవితం....ఆనందం.
అనుభవించు. ఎంత మధురతమమైనది! దాన్ని తీసుకో,
అదంతా నీకు ఊరిఖే యిచ్చేస్తూన్నా........ఇది రాత్రి. మనం
మాట్లాడుకొనేది యెవరికీ తెలియదు, వినబడదు, (కొలెస్నికోవ్
గాఢంగా దమ్ములాగి, పొగతో గుండెలు నింపుకుంటాడు.)
ఓల్గా మెత్తని కంఠాన్నుంచి ఉరిత్రాడు తప్పించు.......ఆలస్యం
అయితే తెగ్గోసేస్తుంది సుమా!

[పడకకుర్చీలో వెనక్కి వాలుతాడు. కొలెస్నికోవ్ సిగరెట్టుపీకని బూటు మడిమమీద ఆర్పేస్తాడు.]

కొలెస్నికోవ్ : ఔనులే. నికోలాయ్! ఆకుర్రాడు తప్పకండా తిరిగి వస్తాడు. నీకోసం తుపాకిగుండు నిర్దిష్టమైయే వుందికూడాను. దేశద్రోహుల్ని ఖైదీలుగా పట్టుకోరు. ఈగందరగోళంలో నీకక్ష తీర్చుకొందామనుకున్నావేమోనని మొదట్లో తలచేను. తనకసి తీర్చుకోడానికి అభిమానం గలవాడు యెన్నిసార్లు చావడానికైనా వెనకదీయడు. అయితే నువ్వో? అంతా అప్పుడే మరిచిపోయేవు. ఫెయూనిన్! నీవింక లేనిదాంట్లోనే లెక్క. యుద్ధజంఝూ మారుతం నిన్ను గడ్డిపరకనులా యెగరగొట్టేసింది.........ఈపట్ట ణానికి నువ్వే అధికారి వనుకుంటున్నావు. కాని యధార్థం ఏమిటి? నేనూ యిక్కడ అధిపతిని! నీయెదుటనే నీఖైదీగా, నిరాయుధుడనై నిలబడ్డాను; గాయం తగిలింది; చెయ్యికూడా స్వాధీనంలో లేదు!.........అయితే నేమి, నేనంటే నువ్వు భయ పడుతూన్నావు! తాను పైచెయ్యిగా వుండికూడా పిరికివాడు శత్రువుయొక్క దయాదాక్షిణ్యాల నర్థిస్తాడు! చూడు! నేనిప్పుడే వెడుతూన్నా... .........నన్ను కాల్చమనికూడా జర్మన్ సెంట్రీని పిలవలేవు, నువ్వు! ఫెయూనిన్! మాళవాలు యింకా యెక్కువ భయంకరంగా వుంటాయి. తెలుసా? (ఒక్క ఎడమచేత్తోటే కోటు తొడుక్కోడం కష్టంగా వుంటుంది.) నీతో మాట్లాడుతూ చాల ఆలిస్యం చేసేను. వాళ్లు నాకోసం కనిపెట్టుకునుంటారు కూడాను. నేవెళ్ళిపోతున్నా. (వెడతాడు.)

[ఫెయూనిన్ నిశ్చేష్టుడై వుంటాడు. హఠాత్తుగా మరీచిన్నవాడు గానూ, ముసలివాడుగానూ కనిపిస్తాడు. కొలెస్నికోవ్ వెళ్ళిన వైపు చూస్తూ, కూర్చుని వుంటాడు. చిలకగడియారం గంటలు కొట్టిన శబ్దం.

వున్నట్లుండి ఫెయూనిన్ వికటాట్టహాసం చేస్తూ, ఒక్క దుముకులో లేచి, టెలిఫోన్ దగ్గిరికి పోతాడు.]

ఫెయూనిన్ : కమాండెంటు ఆఫీసు-లైన్ కలుపు-నేను-ఫెయూనిన్ని. (హాండిలు తిప్పుతూ) కొలెస్నికోవ్ : నీకత్తి కంటె నాది పదునైనది. నువ్వు చెప్పేది అబద్ధంచేసి తీర్తాను. (రిసీవర్లోకి) నమస్తే—ఎవరు?—స్ప్రుర్రీ?—నేను—ఫెయూనిన్. కొందరు సోల్జర్లని యిక్కడికి త్వరగా పంపండి-మీకోసం చిన్నబహుమతి జాగ్రత్తపెట్టేను-(రిసీవర్ను యధాస్థానంలో వుంచుతూ) ఓల్గాకోసం మళ్ళీ యెల్లాగా వస్తావోయ్, కుర్రకుంకా! ఇంకా యెంతో రాత్రి కాలేదు. నీజవాబు అప్పుడే యివ్వబోకు మరి! నాకత్తికి రెండు వైపులా పదునుంది!

---

# నాలుగో అంకం.

అదివరకు స్టోరురూమ్‌గా వుపయోగించబడిన ఒక నేలమాళిగ. ప్రస్తుతం ఖైదుకొట్టుగా చేయబడింది. డోమ్‌లా కట్టబడిన కప్పులో అర్ధ చంద్రాకారమైన రెండు కిటికీలు. ఒకదానిని చెక్కలుకొట్టి మూసేసేరు. పూర్వం యీకిటికీని బేళ్ళు దించడానికి వుపయోగించే వారని తోస్తుంది. రెండో దాంట్లోంచి వెలుతురు వస్తూంది. కిటికీ అంచులవద్ద మంచుగడ్డలు పేరుకొని, సూర్యకిరణాల్లో గులాబీరంగుగా కనిపిస్తూంది. మంచి వెలుతురూ, వేడీ; డిసెంబరు దినాలకిది అరుదే అయినా. లోపల యిటుక గోడమీద "లుకోయానోవ్ 1907" అని వెల్లమీద స్ఫుటంగా కనిపిస్తూంటుంది. దానిక్రిందే "పొగ పీల్చరాదు. జరిమానా ఒకరూబులు" అని జర్మన్‌ల ఆర్డరు. గాజు కిటికీలోంచి వస్తూన్న సూర్యకిరణాలు గాలి కల్లల్లాడుతూ గోడమీది అక్షరాల్లో ఆటలాడుతున్నాయి. చెర్చి ద్వారంలా నగిషీపనిచేసిన ద్వారం చెట్లనీడలో వుంటుంది. బైటి జర్మను సెంట్రీ ద్వారంమీది అద్దంలోంచి లోపలివాళ్లకి కనిపిస్తూంటాడు. లోపల ద్వారం ప్రక్కనే 'వంకి' నుంచి నూనెదీపం వెలుగుతూంది. నేలమాళిగలో రెండు గదులు. కిందుగావున్న లాజులోంచి కుడివైపుకి పోతే రెండో గదిలోకి వెడతాం. అది కొంచెం చీకటిగా వుంది. అందులో రకరకాల పేకేజీపెట్టెల చెక్కలతోనూ, చాపలతోనూ అమర్చిన పక్కలమీద చాలమంది కూర్చునీ, పండుకొనీ వుంటారు. వాళ్ళ జీవితాల్లో యిదే కడపటి దినం. తోలుకోటు తొడుక్కున్న వృద్ధుని వీపు కానుకుని కొయ్యచెప్పులు తొడుక్కున్న కుర్రాడొకడు కునికిపాట్లు పడుతున్నాడు. ఈసమాధిలోంచి బైటపడే మార్గమేమిటా అని ఆలోచిస్తూన్నట్లు ఏకాగ్రతతో అటూయిటూ పచారుచేస్తున్నాడు, దీర్ఘకాయుడు, మెగోరోవ్. అతని ముఖంమీద స్ఫోటకపుగంట్లు గాఢంగా వున్నాయి.

తాతారోవ్ గోడదగ్గర పెట్టిమీద నిల్చుని గుడ్డలో చుట్టిన చేతివ్రేళ్ళని కోపంగా విదుల్చుతూంటాడు. సైనికుని ఓవర్‌కోటు తొడుక్కున్న ఒక స్త్రీతో యేదో వాదిస్తూంటుంది, ఓల్గా. ఆమె బొచ్చుకోటు తొడుక్కుని వుంది. ఓల్గా చెప్పిన దా స్త్రీకి నచ్చినట్లు లేదు. చిరిగిన టోపీ, పిడచ కట్టిన చెవులతో పిచ్చివాడొకడు........ఇతరులంతా కదలకుండా తమ పక్కలమీదే పడుకుని వుంటారు. ఎక్కడో దూరాన్నుంచి కూనిరాగం వినిపిస్తూంది. గోడవారే వున్న చాపమీదే పడుకుని పిచ్చివాడు ఆరాగాన్నే అందుకుని ఉద్రేకంతో, స్పష్టంగా ఆలాపిస్తూంటాడు. ఈధ్వనులకి తోడుగా బైటనుంచి పురాతన జర్మన్ సైనికగీతం వినిపిస్తూంటుంది.

కాళరాత్రిని - కటికచీకటి
కాపలనిల్చిన - నామనసెక్కడో
పరిభ్రమిస్తూ - పరితపిస్తూంది.
జన్మభూమిని - వదలివచ్చిన
ప్రేయసికోసం - పరితపిస్తూంది.
నసుతలపోస్తూ - నాకొరకైయే
నిలబడివుందా - నిరీక్షిస్తూ ?

తాతారోవ్ : (నలిగిపోయిన రెండు చేతుల్నీ యెండలోకి యెత్తిపట్టుకుంటూ) ఎండ యెంత బాగుంది! సూర్యకిరణాలు గిలిగింత పెడుతూన్నాట్లున్నాయి. నాచేతులు యిల్లాగే ఓసంవత్సరంపాటు రాత్రీ పగలూ యెండలో పెడితే బాగుపడతాయేమో!....ఏం ?

ఓల్గా : అస్తమానం వాటిని గురించే ఆలోచిస్తూండకు. ఆలోచించకపోతే అంతగా బాధవుండదు. నువ్వేదో చెపుతూన్నావే, అది పూర్తి కానియ్యి.

తాతారోవ్ : (బాధతోనే) అల్లాగేలే. ఆమటుగున వాడు జర్మనీభాషలో

వున్న బూతులన్నీ వుపయోగిస్తూ నన్ను తిట్టనారంభించేడు. "ఒరేయ్! తాతారోవ్! లంజాకొడకా! ట్రెయిన్ పడగొట్టడంలో కొలెస్నికోవ్‌కి సాయం చేసింది నువ్వేకాదట్రా?" నేనేం తక్కువ తిన్నానా? "ట్రెయిన్ నేనే పడగొట్టేవాణ్ణి. దిక్కుమాలింది, టైమ్ లేందే. అన్ని పనులూ, ఒక్కసారే, ఒక్కడే చేయడం ఎల్లాగో చెప్పు! అయితే ఆతనెవరు? ఆకొలెస్నికోవ్?" అన్నాను, ఏమీ యెరగనివాడిలా. వాడూ నవ్వుతూ "వాడెల్లా వుంటాడో చూపిస్తానుండు, నీకు, వాణ్ణి లోపలికి తీసుకురాండిరా" అంటూ మళ్లీ ఏదో రాసుకుంటున్నాడు. అంతట్లోకే ఎంతో మర్యాదగా మాట్లాడ్డం ప్రారంభించేడు!

యెగొరోవ్ : సంస్కారం వున్నజాతి! సిగరెట్టుపీకి కిందపడేస్తే పెద్ద హంగామా చేసేస్తారు, వాళ్ళు. "ఏడుకో పెక్కులు జుల్మానా" వెంటనే పడిపోతుంది!

తాతారోవ్ : నిజమేనోయ్: "చెయ్యి టేబిలుమీద పెట్టు. వేళ్ళు జాపు." అన్నారు. చితక్కొడుతూంటే అప్పుడేమీ బాధ అనిపించనే లేదు. "వీళ్లు నిజంగా కొలెస్నికోవ్‌ను పట్టుకున్నారా?" అనేనా ఆలోచన.........రెండు వ్రేళ్ళు ఐ మూడోవ్రేలి దగ్గిరికి వచ్చేటప్పటికి అతన్ని తీసుకురావడం విన్నాను. సూటిగా చూస్తే ఏం కనిపిస్తుందో ననేభయం. తల వొందుకునే ఓరగా చూసేను. అతడూ కాళ్ళీడ్చుకుంటూ, అతి భారంగా నడిచి వస్తూన్నాడు.... భయం వేసింది. నావ్రేళ్లు నలగ్గొట్టన బాధే యెగిరి పోయింది. ధైర్యం చిక్కబట్టి, పైకి చూసేను. నాగుండెలు ఆగిపోయేయి.

యెగొరోవ్ : (ఆదుర్దాగా) అతడు కాడుగదా? (తాతారోవ్ పిచ్చివాని వైపు చూస్తాడు. పిచ్చివాడు హఠాత్తుగా కూనిరాగం నిలిపేడు. ముందుకీ వెనక్కీ ఊగడంకూడ మానేస్తాడు. అంతాకూడా వాడి

వైపు చూస్తారు. అందరూ తనను చూస్తున్నట్లు కనిపెట్టి. పిచ్చివాడు మళ్లీ రెట్టింపు వేగంతో ఊగడం ప్రారంభిస్తాడు.)

ఓల్గా : తాతారోవ్: ఈకథేమీ బాగాలేదు. (యెగొరోవ్‌తో) ఏమంటావు? బాగులేదుకదూ ?

యెగొరోవ్ : (ఆమె అభిప్రాయం గ్రహించకనే ఆతురతగా) నాకు బాగానేవుంది సుమా. ఫస్టుగా వుంది.

తాతారోవ్ : (కట్టుకట్టిన చేతులవైపు చూస్తూ) ఆహా(హా( ! జర్మనులెంత తెలివైన వాళ్ళండీ ! ఏపనికైన వాళ్లే తగుదురు. ఎంత క్కాటి కోట్లు, బూట్లు తయారు చేయగలరు ; మాంచి మోటారు మీద యెక్కించి తిప్పాగలరు ; పియానోమీద పాడాగలరు, ఆడాగలరు ;.........తుపాకితో కాల్చి చంపాగలరు ! (కలలో మాట్లాతూన్నట్లు) ఓ నీరవనిశీథిని, కొండచరియ నిబిడారణ్యంలో, పుచ్చపువ్వులాంటి వెన్నెట్లో నాలుగువైపులా పువ్వులు నవ్వుతూంటే, నేనొక్కణ్ణే, చేతులో ఏమీ ఆయుధం లేకుండానే యీఅడివిపందుల్ని (జర్మనులను) వేటాడే అదృష్టం కలిగితేనా !........

యెగొరోవ్ : ఇంకేం కావాలో కోరుకో !

తాతారోవ్ : (మొహమాట పడుతూన్నట్లు) ఆఖరిసారి, ఒక్క ప్లేటు కాబేజిపులుసు యిప్పించండి. చాలు.

యెగొరోవ్ : ఇంకా. ఊ( ! అడుగు. మొహమాట పడకోయ్. ఏం కావాలో అడుగు.

తాతారోవ్ : (గునుస్తూ) బైట ఏం జరుగుతూందో తెలుసుకోవాలని వుందోయ్.

[యెగోరోవ్ తలెత్తి కిటికీవైపు చూస్తాడు.]

యెగొరోవ్ : అదెల్లాగో చేద్దాం లేవోయ్. ఒక్క మినిట్లో చెప్తానుండు. (పేకేజి పెట్టెల్ని ఒకదానిమీద ఒకటిగా పేరుస్తూంటాడు.)

వృద్ధుడు : ఇదుగో! ఈకుర్రాణ్ణి యెక్కించవయ్యా. వాడు అట్టే బరువుగా వుండడు.

యెగొరోవు : పాపం, ఒళ్ళు మరిచి నిద్దరోతూన్నాడు. వాణ్ణి లేపడం యెందుకులే.

వృద్ధుడు : ఫర్వాలేదు. వాడి కలవాటై పోయింది. (కుర్రవాణ్ణి కుదిపి, లేపుతూ) ప్రొకోఫీ! ఓ ప్రొకోఫీ! ఎంతసేపురా, నిద్ర. లే, లేరా! ఇదేమిటీ, నీముక్కు చలికి పిడచకట్టుకు పోయిందే! లే. (కుర్రవాడు కూర్చుని కళ్ళు నులుపుకుంటాడు.) ఒరేయ్! ప్రొకోఫీ! నువ్వు, యిదుగోనే, ఆపైకి యెక్కి, బైట యేం జరుగుతూందో చూసి చెప్పాలిరా. ఊఁ, లే, మరి! (గోడ మలుపు తిరగడం వల్ల కుర్రవాడు కిటికీమీది కెక్కడం సెంట్రీకి కనిపించదు. ప్రొకోఫీకి సాయంగా చేయి అందిస్తూ, వృద్ధుడు క్రింద నిల్చుంటాడు.)

ప్రొకోఫీ : మంచు గుట్టగుట్టలుగా యెల్లాకురిసిందో!

యెగొరోవ్ : అవసరమైన వాటిమీదే నీదృష్టి వుంచు. బైట సెంట్రీ లెవరైనా వున్నారా?

ప్రొకోఫీ : ఎవరూ కనిపించడం లేదు. ఆఁ. అదుగో! అక్కడో చేట పాదాలవాడు కాళ్ళు వెచ్చచేసుకుంటున్నాడు. (గుడ్డపీలికలుచుట్టిన రెండు పెద్దపాదాలు రైఫిల్ మడమప్రక్కను 'దబ్బా-దిబ్బా' మని 'మార్క్-టైమ్' చేస్తూండడం కిటికీలోంచి కనిపిస్తుంది.) ఊఁ! నాట్యం చెయ్యరా! చెయ్యి! మాకేం తొందరలేరా. (కుర్రవాడు ఓడాన్సింగ్ ట్యూన్ కూనిరాగంతో ఆలాపిస్తాడు. లయ తప్పకుండా సెంట్రీ పాదాలు యెత్తుతూ, దించుతూంటాడు.)

వృద్ధుడు : జాగ్రత్తరా! ప్రొకోఫీ, నీకొంటెతనం కట్టిపెట్టు. వాళ్ళు విన్నారంటే....(జర్మను సోల్జరు పాదాలు అదృశ్యమౌతాయి.)

ప్రొకోఫీ : (ఆశ్చర్యంతో) తాతా! అల్లదిగో అక్కడ యేదో గొడుగులా కనిపిస్తూంది!

తాతారోవ్ : (కోపాన్నాపుకుంటూ) నువ్వు చూడవలసినచోట చూడ్డం లేదు. పైకి చూడు. అదిగో; ఆవిమానాలు మనవా, వాళ్లవా?

(విమాన విధ్వంసక ఫిరంగుల కాల్పులు వినవస్తాయి.)

ప్రొకోఫీ : తెలివైన ప్రశ్నే! ఎవరేనా తమ విమానాలమీదే కాలుస్తారా ఏమిటి? (వృద్ధుడితో) అక్కడింకేమీ కనిపించడం లేదు, తాతా. పిచికలు మాత్రం గుంపులు గుంపులుగా కనిపిస్తున్నాయి.

వృద్ధుడు : దిగరా. క్రిందికి దిగు. వాళ్లు తుపాకులు కాలుస్తారు కూడాను.

[కుర్రవాడు సమయానికే దిగుతాడు. మెట్లమీద పాదధ్వనులు వినిపిస్తాయి. తాళాలు తీస్తున్నధ్వని. "ఆఁ! సరిగ్గా యింతే. జైల్లో యెప్పుడూ తాళాలు గణగణ మంటూంటాయి. పుస్తకాల్లో చదివేనులే!" అంటూ తాతారోవ్ మెల్లిగా గొణుక్కుంటాడు. పిచ్చివాడు మినహా మిగిలిన అందరిదృష్టులూ ద్వారం మీదే వుంటాయి. ఓల్గా బైటికి చూస్తుంది.]

ఓల్గా : మరేం లేదు, కామ్రేడ్స్. కంగారు పడకండి. కొలెస్నికోవ్‌ని తిరిగి తీసుకొస్తున్నారు.

[గడియతీసిన శబ్దం. కాపలాదార్లు ఫియోడోర్‌ను లోనికి తీసి కొని వస్తారు. చొక్కా చిరగడం మినహాయిస్తే అతని శరీరం మీద దెబ్బలేమీ కనిపించడంలేదు. చిరిగిన చొక్కా భుజంమీద వదులుగా వ్రేళ్లాడుతూంది. తల ఓప్రైపుకి వ్రేలబడుతూంది. సెంట్రీలు అతన్ని గోడకి జేరబెట్టి, దృఢంగా నిలబడ్డదీ లేనిదీ కదిపి చూసి, బైటికి పోతారు. తలుపు వేసిన చప్పుడు.]

ఓల్గా : కామ్రేడ్స్! కొంచెం సాయం చేయండి. అతన్ని పడుకో బెడదాం.

[ఎవరూ ఫియోదోర్‌వైపు చూడరు. ఓల్గా ఒక్కతే అతని దగ్గరకు వెడుతుంది.]

యెగొరోవ్ : (మెల్లిగా) అతనేనా ?

తాతారోవ్ : ఔను, అతనే!

యెగొరోవ్ : (వ్యంగ్యంగా) హాఁ! ఆంద్రీ కొద్దిగా మారినట్టున్నాడే! నేనైతే గుర్తు పట్టనేలేకపోదును సుమా!

ఓల్గా : (నిద్రబోతూన్నవాణ్ణి లేపుతూన్న ధోరణిలో) ఆంద్రీ! ఆంద్రీ!.... చూడు. ఇల్లాచూడు. నేనూ, ఓల్గాని. ఏం జరిగింది ? నువ్వెళ్ళి ఏళ్ళూపూళ్ళూ ఐనట్లుంది. అక్కడేం జరిగిందేమిటి ?

ఫియోదోర్ : (చెల్లెలివైపు చూస్తూ) జరిగింది.........చాలా దీర్ఘసంభాషణ జరిగింది.

ఓల్గా : (అతని తీవ్రదృష్టికి తట్టుకోలేక) కొంచెంసేపు పడుకుందువుగాని, రా. విశ్రాంతి తీసుకో.

[గోడ ఒత్తుగా అతనికి పడక అమర్చి వుంటుంది. ఓల్గా, అతన్ని మెల్లిగా నడిపించి తీసికొని వెడుతుంది. అంతటా నిశ్శబ్దం. అతన్ని కొయ్యచెక్కమీద పండుకోబెట్టి, ప్రక్కనే తాను కూర్చుంటుంది. బిరువెక్కిపోయిన కాళ్ళు మెల్లగా జాచుకుంటాడు. అందరూ వీరివైపు చూడ్డానికే జంకుతూంటారు.]

ఓల్గా : కాస్సేపు కదలకండా పడుకో. నువ్వు విశ్రాంతి తీసుకునే లోపుగా నీచొక్కా కుట్టి బాగుచేస్తా.

ఫియోదోర్ : ఓల్గా! నాకిప్పు డల్లాంటి వైభోగా లెందుకులే.

ఓల్గా : కొలెస్నికోవ్ యెప్పుడూ నీటుగానే వుండాలి. ఈవేళకూడా. ఉరిస్థంభం దగ్గరకూడాను. కొలెస్నికోవ్ అవడం యెంతకష్టమో యెవరికీ తెలియకూడదు. ఊఁ! చొక్కా యిల్లా యియ్య........ (ఆమె తనచొక్కా తీసి అతనిమీద వేస్తుంది.) అబ్బే! నువ్వు

లేవొద్దు. అల్లాగే కొంచెం సేపు పడుకో. ఇప్పుడే అయిపోతుంది.

యెగొరోవ్ : (తాతారోవ్‌తో మెల్లిగా) గట్టివాడవేలే. ఆమె యేం చేస్తూందో చూసేవా ?

[తాతారోవ్ తొందరగా తన పొడుగుకోటు తీసి, మాసిన పొట్టి చొక్కాలతో అక్కడ నిలబడి వుంటాడు.]

తాతారోవ్ : ఓల్గా ! అతనికి యీకోటు కప్పు. చొక్కాకూడా తీసేస్తే. నీకు శీతలం చేస్తుంది.

ఓల్గా : థాంక్స్ ! తాతారోవ్. మరి నీకో ?

తాతారోవ్ : నావొళ్లంతో వేడిగా వుంది .కావలిస్తే ఒంటిమీద సిగరెట్టు కూడా వెలిగించుకోవచ్చు ! (సమీపానికి పోయి) కామ్రేడ్ కొలెస్నికోవ్ ! నీకెట్లావుంది ? నీస్నేహితుల్ని మరిచిపోయేవా ఏమిటి ? మనం అందరం కలిసే కాదుటోయ్ మృత్యువుని తరుముతూన్నాం ?

ఓల్గా : తాతారోవ్ ! అతన్ని కాస్సేపు పండుకోనియ్యి.........ఒక్క క్షణం. (పెద్దకోటు తీసి ఫియోదోర్‌మీద కప్పుతూ) ఏమైనా దాహంగా వుందా యేమిటి ? కావలిస్తే మంచు తీసుకువస్తా.

ఫియోదోర్ : ఒద్దు. నాకేం అక్కర్లేదు. నాదగ్గుకూడా తగ్గిపోయింది. ఏమిటోగాని ! (చిరునవ్వుతో) నాపూర్వారోగ్యం తిరిగి వచ్చినట్లుగావుంది. మొహంమీదకూడా కప్పు.

ఓల్గా : ఏం ?

ఫియోదోర్ : (విసుగ్గా) ఎందుకేమిటి ? కప్పమంటే. ఆమె అతని మొహంమీద కప్పుతుంది.)

ఓల్గా : (రెండో స్త్రీతో) నీదగ్గిర సూది వుందన్నావుగాదూ ? ఏదీ ? ఓసారి యిల్లా యియ్యి.........కొంచెం దారంకూడా.

[ఓల్గా చొక్కా కుడుతూంటుంది. యెగోరోవ్ సమీపిస్తాడు.]

యెగొరోవ్ : (ఆమె చేతుల్లోని పనివైపు చూస్తూ) ఓల్గా! మమ్మల్నం దర్నీ యేదో నాటకం ఆడిస్తూన్నావు. నేనింతప్పటినుంచీ కొలెస్నికోవ్‌ని యెరుగుదును....అతని తల్లినీ, తాతనీకూడా.

ఓల్గా : (మెల్లిగా) ఈవేళ ఉరితీయబడ్డానికి యితడే మొదటివాడు.

తాతారోవ్ : (సగర్వంగా) బాగుంది. అయితే యేం చేయమంటావు. కొలెస్నికోవ్‌గా చనిపోవడం తక్కువ గౌరవమా?

ఓల్గా : మనవాళ్ళందర్నీ పిలుచుకొని వెళ్ళి అక్కడ వుండండి. నేనూ యిప్పుడే వస్తా.

రెండోస్త్రీ : ఓల్గా! నువ్వు వెళ్ళు. మిగిలింది నేను కుడతానులే. బతికి వున్నన్నిరోజులూ....ఏదో పని చేసుకుంటూనే వుండాలిగదా!

[ఓల్గా కుడుతూన్న చొక్కా ఆమె చేతికిస్తుంది. కిటికీ క్రింద మూలలో అంతా సమావేశ మవుతారు. పిచ్చివాడేదో గుబులుగా వున్న ట్లుంటాడు. సమావేశం ప్రారంభమవుతుంది. బైట సెంట్రీ పాట మళ్ళీ ప్రారంభిస్తాడు.]

పతాకచ్ఛాయల - నరుగుచున్న నను
ముద్దిడి టోపీపై - పువ్వులు ముడిచింది.
దీర్ఘవియోగ వి - చారముతోనా
యెదపై తలవా - లిచి కుమిలింది.

(ప్రొకోఫీ కళ్లు తెరుస్తాడు.)

ప్రొకోఫీ : (అటు చూడకుండానే) తాతా!....తాతా!

వృద్ధుడు : నిద్దరపోలేదుట్రా, నువ్వు?

ప్రొకోఫీ : తాతా! నొప్పెడుతుందా?

వృద్ధుడు : అబ్బే! కాస్సేపు. అంతే. (కఠిన కారుణ్యభావంతో) మరిచి

పోతావుసుమీ. అప్పుడేమవుతుంది? నువ్వు పుస్తకాల్లో చదివిన గొప్పవాళ్ళందరికీ మల్లేనే అవుతావు. కుజ్మా మినిన్, ఇవాన్ సుసానిన్‌లని గురించి మీమేష్టారు చెప్పలేదూ? (కుర్రవాడు కళ్లు పెద్దవి చేసుకుని శ్రద్ధగా వింటూంటాడు.) వాళ్ళు తుపానుల్లో అర్జున వృక్షాల్లా నిలబడ్డారు. నువ్వు వాళ్లతో పోలిస్తే చిన్న మొక్కవు. ఐనా వాళ్ళు చేసినపనే నువ్వూ చేస్తున్నావు! నువ్వూ చేస్తున్నావు! నువ్వూ వాళ్ళకిమల్లేనే మాతృదేశరక్షణలో ప్రాణా లర్పిస్తావు. మృత్యువు నెదురుచూస్తూ జైల్లో మనం కూర్చు న్నాం; నిద్ర రావటంలేదు; యీజీవితంలో యింక మైదానాల్లో మంచుమీద ఆటలాడుకోబోవు; యివన్నీకూడ మన కామ్రేడ్ స్టాలిన్ యెరుగును. నిన్ను గురించి స్టాలిన్‌కి అంతా తెలుసు! ఎటొచ్చీ అతడు మనతో మాట్లాడలేడు. అతని కెన్నిపనులు, ఊపిరి సలపకండా; ఎన్నోదేశాల రాయబారులు అతనికోసం కనిపెట్టుకుని వుంటారు; సైన్యాలూ, సేనానాయకులూ ఆజ్ఞల కోసం కాచుకుని వుంటారు.........గొప్పగొప్పవాళ్లెందరో అనేక రాచకార్యాలమీద అతనికోసం వేచి వుంటారు. రెప్పపాటు వ్యవధికూడా వుండదు....అయినా కామ్రేడ్ స్టాలిన్ మనస్సులో యెప్పుడూ నీలాంటివాళ్ళని గూర్చే ఆలోచిస్తూంటాడు. లుకోయానోవ్ నేలమాళిగలో ప్రొకోఫీ స్టటోన్నవ్ అనే పదమూ డేళ్ల బాలుడు, గోరిల్లా సైనికుడు, జర్మన్ కిరాతకులచేత ఉరి తీయబడ్డానికి సిద్ధంగా ఉన్నాడని.........

ప్రొకోఫీ : (ఉద్రేకంతో) తాతా! తాతా! అతనికి టెలిఫోన్‌లో చెపు తారా? రేడియోలో చెపుతారా? రేడియో ఐతే త్వరగా అందు తుందిగాదూ?

వృద్ధుడు : అబ్బే, అవేవీగావు, మనస్సునుంచి మనస్సుకి సరాసరిగానే

తెలుస్తుందోయ్. (మీటింగు ఆఖరవుతుంది. కుర్రవాడు మళ్ళీ కళ్ళు మూస్తాడు.)

యెగొరోవ్ : (వృద్ధుని ప్రక్కనుంచి పోతూ) నీమనమడు కథూ. తాతా?

వృద్ధుడు : అంతకంటె దగ్గరవాడే. నాయనా. ఈగందరగోళానికి పూర్వమే నామనమడు. వీడు.

తాతారోవ్ : యుద్ధకాలంలో మనం అందరం సహోదరులమే.

యెగొరోవ్ : వాళ్లు నిన్నూ, యీపిల్లవాణ్ణీ యెల్లా పట్టుకున్నారు. తాతా?

వృద్ధుడు : పొరబాటున. అనుకుంటాను. (పిచ్చివాడు ఊగడం ఆపుతాడు. వృద్ధుడు పిచ్చివానివైపు కన్నుగొట్టి చూపుతూ) మాకుక్కకి ఆకలివేసింది. దానికోసం కుక్కగొడుగులేనా తెద్దామని నది ఒడ్డుకి వెళ్లేము. తీరా వెళ్ళి చూద్దుంగదా ఓగూఢచారి అక్కడ కాచుకుని వున్నాడు. చచ్చుపెధవ. విషపుచ్చుం, చెవల పీనుగ.........

యెగొరోవ్ : (గట్టిగా) ఆపీనుగుని నీకుక్కకి తినిపించకపోయేవూ? పీడ ఒదిలిపోను!

[పిచ్చివాడు మరింత వేగంగా ముందుకీ వెనక్కీ ఊగడం ప్రారంభిస్తాడు. యెగొరోవ్ ఫియోడోర్ ప్రక్కనే కూర్చుంటాడు. ఫియోడోర్ ముఖంమీది గుడ్డను తొలగించకుండానే. అతనితో మాట్లాడుతాడు.]

యెగొరోవ్ : కామ్రేడ్! ఎల్లావుంది? బాధగా వుందా?

ఫియోడోర్ : ఇప్పుడు కొంచెం నయమే. ఒళ్లు వేడెక్కిందిలే.

యెగొరోవ్ : బాధగావుందని చెప్పడానికి సందేహిస్తావేం? కొడితే నొప్పెట్టదూ? మేం అందరం అనుభవించిన వాళ్ళమే. ఏం. తాతారోవ్! వాళ్ళు నిన్ను కొట్టలేదూ?

తాతారోవ్ : ఆఁ! ఏదో కొంచెం. ఒంటిమీద కాదులే.........మచ్చ చూపించేరు. చేతివ్రేళ్ళు నలగ్గొట్టేరు. కాస్త.

యెగొరోవ్ : విన్నావూ? ఆదుర్మార్గులు చివరకి కాతరీనా పెట్రోవ్నాని కూడా ఒదిలిపెట్టలేదు.......మానవులైతే ఆస్థితిలో ఆమెజోలికి పోతారా? త్వరలోనే ఓల్గా వంతూ వస్తుంది. (అతనికళ్ళు గదంతా కలయదిరిగి, చివరికి పిచ్చివాడిమీద నిలుస్తాయి.) ఈవెధవని చూడు. వాణ్ణి సి. ఐ. డి గా వుపయోగించుకున్నారు. చివరకి వాడికీ మతిపోయింది. చూడు, ఎల్లా ఊగుతూన్నాడో.... ఏయ్! టోపీవాలా! నిన్నూ కొట్టేరా?

పిచ్చివాడు : (ఏడుస్తూ) ఊఁ ఊఁ. నన్నూ కొట్టేరు వాళ్ళు. నన్నూ కొట్టేరు.

యెగొరోవ్ : (కామ్రేడ్స్ వైపు కన్నుగీటి) నీకు బాగా వడ్డించేరా? పల్చపల్చగా జావపోసేరా?

[సమాధానం యివ్వడంవల్ల తనగుట్టు బట్టబయలై పోయిందని పిచ్చివాడు తెలుసుకుంటాడు. యెగొరోవ్ వానిదగ్గరికి పోయి ప్రక్కగా చతికిల బడతాడు. గడ్డిపరకలు తీసి పిచ్చివాని టోపీలో తురాయిలా గుచ్చుతాడు.]

యెగొరోవ్ : నీదేరకం పిచ్చిరా?.........దెబ్బలుతినే పిచ్చా? కొట్టే పిచ్చా? (కఠినంగా) నాకు సరిగా జవాబు యివ్వక పోతే వూరుకోను, తెలుసా? నీకు మతిపోయి ఎంతకాలం అవుతుంది?

పిచ్చివాడు : వచ్చే మంగళవారానికి సరిగ్గా రెణ్ణెల్లు.

యెగొరోవ్ : అబ్బా! ఎంతకాలం అయిందీ! నేనెప్పుడూ మతిపోయి అంతకాలం వుండలేదు. ఆవిషయంలో నీదే ఫస్టుమార్కు! అయితేనేం, ఆలోటు భర్తీచేయడానికిలా వుంది, నాకొక్కొక్కప్పుడు మహాపిచ్చ పుట్టుకొస్తూంటుంది. అల్లాంటపుడు యేపంది వెధవనో మాడు పగలగొట్టా లనిపిస్తుంది.........యింక కొట్టేనా అంటే జన్మజన్మాంతరాలకీ జ్ఞాపకం వుండాల్సిందే. (పిచ్చివాడి

ముఖంమీద పిడికిలి బిగించి చూపిస్తాడు) ఏం, బాగులేదూ?
రుచి చూపించనా? (లేస్తూ, స్వరం మార్చి) మేం యిక్కడో
మీటింగు జరుపుకోవాలి. సెంట్రీకి కాలక్షేపంగా నువ్వాద్వారంలో
కూర్చుని ఏదో ఒకటి నీయిష్టం వచ్చింది మొరుగుతూండు.
జాగ్రత్త! రాండోయ్, కామ్రేడ్స్, మీరంతాను. (ఒక క్షణంలో
పిచ్చివాడు తన గోనెగుడ్డలు పోగుచేసుకుని, యెగొరోవ్
చూపించిన చోటికి పోయి కూర్చుంటాడు.) ఏదో నీనోటికొచ్చిన
పాటో పద్యమో కానీ. అదీ కాకపోతే ఏదైవప్రార్ధనో. ఊం
(యితరులతో) కామ్రేడ్స్? మనం ప్రారంభిద్దామా?

ఓల్గా: (ఫియోడోర్ ముఖంమీది గుడ్డను తొలగిస్తూ, ఫెడ్యా! నువ్వు
నిద్దరోడం లేదుగదా? ఈకామ్రేడ్స్ నీతో మాట్లాడాలనుకుంటు
న్నారు. (చొక్కా తొడుక్కోడాని కతనికి తోడ్పడుతుంది.)
నువ్వు పడుకొనే వుండొచ్చు.

ఫియోడోర్: ఉఁహుఁ. కూర్చుంటానులే. కొంచెం సాయం చెయ్యి.
(ఫియోడోర్ కాళ్లు క్రిందికి పెట్టుకుంటాడు. కోటు తాతారోవ్
తీసి తొడుక్కుంటాడు.)

యెగొరోవ్: (గంభీరంగా) మన మీటింగుకి ప్రసిడెంటునుగూర్చి బాధ
పడొద్దు. ఏమంటారు? ఈమహాయుద్ధంలో తమ ప్రాణాలర్పిం
చిన కామ్రేడ్సే మన యీమీటింగుకి ప్రెసీడియంగా వుంటారు.
ఇంక కార్యక్రమం ప్రారంభిద్దాం. కామ్రేడ్స్! ఇక్కడ ఒక
సోదరుడు మనలో చేరగోరుతున్నాడు. ఆతన్నిగూర్చి ఓల్గా మీకు
చెప్పే వుంది.........

[విమానాలు క్రిందుగా యెగురుతూన్న ధ్వని హఠాత్తుగా విని
పిస్తుంది. మెషిన్‌గన్లు పేల్చిన చప్పుళ్లు. అందరూ యేదో బరువు
దించుకున్నట్లుగా నిట్టూరుస్తారు. ఉన్నట్లుండి ఆస్త్రీ. వెక్కుతూ యేడ్చు

ప్రారంభిస్తుంది. ఆమె ఉద్రేకంతో చేతిలోని జేబురుమాలును పీలికలుగా చింపుతూంటుంది.

రెండో స్త్రీ : చంపండి : ఈదుర్మార్గపు వెధవల్ని చంపేసెయ్యండి!....
పగతీర్చుకోండి! రాక్షసిపీనుగులు....!

[గందరగోళం. కుర్రవాడు పడుకొనే, వాలిన కనురెప్పల క్రిందగా ఆస్త్రీవైపు కఠినంగా చూస్తాడు. బైట ధ్వనులు : రైఫిల్‌బోల్ట్ 'క్లిక్' మన్న చప్పుడు కంతలోంచి సెంట్రీ దూరంగా కనిపిస్తాడు. ఓల్గా, ఆస్త్రీని ఓమూలకి తీసికొని పోతుంది. క్రమంగా వాతావరణం సద్దుమణుగుతుంది. కుర్రవాడు మళ్ళీ కళ్ళుమూస్తాడు.]

తాతారోవ్ : (రూక్షంగా) ఆర్డర్! కామ్రేడ్స్! ఆర్డర్!

యెగొరోవ్ : (శాంతంగా) మన "పార్టిజాన్‌దళం"లో చేర్చుకొమ్మని యీ కామ్రేడ్, ఆంద్రీని రెండుదఫాలు కోరేడు. మనం చూపాల్సిన జాగ్రతతోనే ఆంద్రీ రెండు సార్లూ యితన్ని చేర్చుకో నిరాకరించేడు. ఏకాకిగానే యీతడు పనిచేసేడు. (గొంతెత్తి కొంచెం బిగ్గరగా) మనదేశాన్ని నాశనం చేసిన బందిపోటుల్ని, జర్మన్ హంతకుల్ని యీతడు చంపేసేడు. మహాసాహసంగానూ, ఎంతో త్యాగంతోనూ పనిచేసేడు. పట్టుబడి, ఆంద్రీ పేరు, అతని పరోక్షంలో పెట్టుకున్నాడు.

ఓల్గా : అంతేగాదు. ఆంద్రీపేరుకి మచ్చ తేలేదు.

యెగొరోవ్ : ఔను. ఆంద్రీ పేరుకి కళంకం తీసుకురాలేదు. అతనికి కష్టం కలుగచేసినా. అందరికోసం చేయబడ్డ యీత్యాగాన్ని ఆంద్రీ అంగీకరించేడు. మనం త్వరగా తేల్చుకోవాలి. ఏక్షణంలోనైనా మనల్ని ఉరిస్తంభాలు ఆహ్వానించవచ్చు. ఈకామ్రేడ్ నడగాల్సిన ప్రశ్న లెవరికైనా వున్నాయా!

తాతారోవ్ : నాదో ప్రశ్నవుంది. (ఫియోడోర్‌తో) ఆరోజురాత్రి మీయింటి నుంచి బైటికి పోయేటప్పుడు నువ్వు వాణ్ణి, అడుగో ఆటోపీ వాలాని, మీముంగిట్లో చూసేవుటగాదూ ? రాబోయే ప్రమాదాన్ని పసికట్టి, ఆంద్రీ బైటకు పోవడానికి వ్యవధి యివ్వాలనుకున్నావు గాదూ ? అంతేనా ?

యెగొరోవ్ : (ఫియోడోర్‌తో) నువ్వాతని ప్రశ్నకి జవాబిస్తావా ?

ఫియోడోర్ : ఆఁ, యిస్తాను..................(తాతారోవ్‌తో) అది సరిగాదు. నాకాధారణేలేదు. నామనస్సంతా భగ్గున మండిపోతూంది.......... అనిస్కాని గురించి. స్మారకం మాత్రం తప్పలేదంతే.

తాతారోవ్ : అయితే పట్టుదలకోసం, కోపంతో నువ్వు 'కొలెస్నికోవ్' వు గాలేదన్నమాట. "నన్ను బతికుండగా మీదళంలో చేర్చు గోకపోతే చచ్చిన తర్వాతైనా తీసికొనేటట్లు చేస్తా." ననే ఉద్దేశ్యంతో గాదన్నమాట ! తీరా పట్టుబడినవారెవరా ! అని చూడబోతే, కొలెస్నికోవ్ స్థానంలో వ్రేలాడుతూ నువ్వు కనిపించి ఊరుకుందామనేమో ననుకున్నాం !.......ఎందుకంటే ఆమాదిరి మనుష్యులకి మాదళంలో స్థానంలేదు.

ఓల్గా : ఫియోడోర్ ! నువ్వు ఆంద్రీ పేరు ఎందుకు పెట్టుకున్నావో చెప్పు, మరి ?

ఫియోడోర్ ! వాళ్లు ప్రశ్నిస్తూంటే నాకేం తట్టిందంటే (చిరునవ్వుతాడు. అతని ముఖం ఒక్క క్షణంపాటు బ్రద్దలై పోయిన ఫొటోలోని బాల ఫియోడోర్ ముఖాన్ని పోలి వుంటుంది.) తీరా వాళ్ళు కొలెస్నికోవ్‌ని చంపేశామనుకుంటూ వుంటే అతడు బ్రతికివచ్చి దెబ్బతీస్తూంటే హడిలి బేజారై పోతారని. (దగ్గు తెరవచ్చి ఆతన్ని ఊపేస్తుంది. కొంచెం సేపు ఆగి ఊపిరి తీసుకుంటాడు.) కొసిల్నెకోవ్ యీపాటికి మళ్ళీ పని ప్రారం

ఖించే వుంటాడు. పని........(నిశ్శబ్దం) నాజీవితాన్ని మీచేతుల్లో పెట్టేను....నేనేం రశీదిమ్మని అడగడం లేదే!

యెగొరోవ్ : కామ్రేడ్! కోపంవద్దు. పార్టిజాన్‌కి ఎల్లాంటిప్రశ్న అడగడానికైనా హక్కుంది. (చాప కప్పుకుని పడుకున్న ఒకని నుద్దేశించి) నువ్వు, పాషా! నువ్వడగవలసిం దేమైనా వుందా? (నిశ్శబ్దం) పాషాకే అడగాల్సిన ప్రశ్నల్లేకబోతే యింకెవరికీ వుండవన్నమాటే. ఓటు తీసుకుందాం. మన పార్టిజాన్ దళంలోనికి ఫియోడోర్‌ను తీసుకోడానికి వ్యతిరేకు లెవరేనావున్నారా? చేతులెత్తండి.

వృద్ధుడు : ఎవరూ తనని వీరుడుగా చేయమని కోరరు. తనపనుల వల్లనే ఎవడైనా శూరుడవుతాడు.

యెగొరోవ్ : మరి నువ్వు మాట్లాడవేం, పాషా? (నిశ్శబ్దం. అతని ముఖంమీది చాప తొలగిస్తాడు. కళ్ళుతెరిచే పాషా పండుకొని వుంటాడు.)

యెగొరోవ్: పాషా! పావెల్!....ఏమిత్రా? వినిపించడం లేదూ, పాషా?

[నిశ్శబ్దం. చనిపోయిన పాషా ముఖంమీద చాప కప్పుతాడు.]

యెగొరోవ్ : ఐతే........యేకగ్రీవంగా అంగీకరించబడింది. కొత్త కామ్రేడ్‌కి స్వాగతం. నూతన కొలెస్నికోవ్! సుస్వాగతం!

తాతారోవ్ : (చేతి బాధచేత కోపంగానూ. గట్టిగానూ) చూడూ! నాబదులుకూడా నువ్వే గట్టిగా యివ్వాలి సుమీ షేక్‌హాండ్!

[యెగొరోవ్, ఫియోడోర్‌లు చేతులు కలుపుతారు. మెట్లమీదుగా దూరాన్నుంచి కలకలం, మాటలసవ్వడీ వినవస్తాయి. "ప్లటూన్-హాల్ట్! లెఫ్ట్-టర్న్! కవర్!" అంటూ టంచన్‌గా మిలిటరీ కాషన్ వినిపిస్తుంది. పిచ్చివాడినటన అంతా వదిలిపోతుంది. భయంతో లేచి నిలుచుని గోడకి జేరబడిపోతాడు.]

యెగొరోవ్ : కామ్రేడ్స్! సంసిద్ధంగా వుండండి.

[ఫియోడోర్ మినహాగా అంతా గుంపుగా స్టేజికి కుడివైపుకి దిగి పోతారు.]

ఓల్గా : అడుగు కలిపి నడవండి. సంతోషంగా వుండాలి. మొహాల్లో దిగులు కనిపించకూడదు సుమీ. మనకి బదులుగా పనిచేస్తూన్న వాళ్ళు మనల్ని కనిపెట్టి చూస్తారని గుర్తుంచుకోండి. హుషారుగా కనబడాలి సుమా, కామ్రేడ్! మనం అందరం మాంచి హుషార్‌గా వుండాలి. (ఫియోడోర్‌తో) ఫెద్యా! లే, టైమయింది........(ఫియోడోర్ యితరులందరితోను కలుస్తాడు. ద్వారంబైట సైనికులు కనిపిస్తారు.)

తాతారోవ్ : ఉరికి తీసికెళ్ళేటపుడు బ్యాండుమేళంకూడా పెడ్తారని విన్నానే. ఇప్పుడేమీ వినిపించదేం?........

[కుర్రవాడు లేచి, టోపీకోసం ప్రక్కమీద తడుము కుంటూంటాడు.]

వృద్ధుడు : టోపీ యెందుకులేరా, యీకాస్త దూరానికే. ప్రొకోఫీ! తల పోతూంటే కుట్టుపోగులుట........

[తలుపు తెరుస్తారు. స్ట్రీ. మొస్పాల్‌స్కీ, ఆఫీసర్లూ, సైనికులూ ప్రవేశం. ఓ ఆఫీసరు మెళ్ళో తోలుపటకాని ఫొటో కెమేరా వ్రేళ్ళాడుతూంటుంది.]

తాతారోవ్ : చూడు! వాళ్ళు ఫొటోలు తీయదలచి నట్లున్నారు. బహుమానాలకి మంచి ఆల్బం అవుతుందిలే. వాళ్ళమ్మలకి పుట్టింరోజు బహుమతులకింద బాగా వుంటుంది!

స్ట్రీ : (ద్వారం వైపు సాభిప్రాయంగా చూస్తూ, బిగించిన పళ్ళలోంచి మాటలు పెగులుస్తూన్నట్లుగా) సు-స్వా-గ-తం!

[సోల్జర్లంతా ముందుకు కదులుతారు. ఆఫీసరు మూడు వేళ్ల చూపుతాడు.]

యెగొరోవ్ : దాని కర్ధం దఫాకి ముగ్గురు చొప్పుననని. (కొద్దిగా కల కలం ఎవరూ రెండో వారిని కళ్ళల్లోకి సూటిగా చూడ్డంలేదు. యెగురోవే మొదటి ముగ్గుర్నీ కళ్ళతో సూచిస్తాడు.)

యెగొరోవ్ : నేను ఒకణ్ణి వెడుతున్నా. (ఫియోడోర్‌తో) మరి నువ్వెల్లాగా తప్పదుగదా. ఇంక మూడోవాడు.......

తాతారోవ్ : నేనూ. పదండి, పోదాం. పదండి. ఆరాక్షసి పీనుగులికి మన బోటివాళ్ళం చావుకి భయపడమని తెలుస్తుంది, (ఫియోడోర్‌తో) ఆండ్రీ! నాభుజం పట్టుకో. ఇప్పటివరకూ నాబలం యేమీ తగ్గలేదులే.

ఫియోడోర్ : అక్కర్లేదు, కామ్రేడ్, నేను నడిచి రాగలనులే. (ఓల్గాతో) నువ్వు అమ్మని చూడ్డం తటస్థిస్తే చెప్పు.........పట్టుబడ్డా కి క్రితం రోజు రాత్రి నేనింటికి వచ్చినప్పుడు తాగిలేనని. అప్పటికి రెండు రోజులనుంచి కంటిమీద రెప్ప వెయ్యలేదు. పడుకోడానికి యెక్కడా చోటు దొరక్క.........(సోల్జర్లు వీరిని చుట్టుముట్టి బైటికి నడిపించుకొని పోతారు. అందరివెనుక మొస్పాల్‌స్కీ వెడుతూంటాడు.)

ఓల్గా : కెప్టెన్! ఏమండోయ్, విన్నారా?....మీకు రష్యన్ వచ్చునా? (వచ్చినట్లు మొస్పాల్‌స్కీ తలూపుతాడు.) ఇక్కడ గర్భిణీస్త్రీ వుంది.

మొస్పాల్‌స్కీ : (ఈమాట విని తేరిపారచూస్తూ) ఫర్వాలేదులే, తాడు గట్టదే.

ఓల్గా : (క్షీణస్వరంతో)....... మరి, చిన్నపిల్లలు!

మొస్పాల్‌స్కీ : నాకు అనవసరంగా ఆలస్యమవుతూంది. (ప్రొకోఫీతో) స్టబోవ్ ! నీవయస్సెంత ?

ప్రొకోఫీ : (ధిక్కారంగా) పదిహేడు ? (వ్యంగ్యంగా వంగి సలాం చేస్తూ, మొస్కాల్‌స్కీ వెళ్ళిపోతాడు. ఎవరూ చెప్పకుండానే ప్రొకోఫీ పెట్టెలమీద కెక్కి, కిటికీలోంచి బైటికి చూస్తాడు.)

ప్రొకోఫీ : వాళ్ళిక్కడి కెంతమంది జనాన్ని లాక్కొచ్చేరు ! (పగిలిన అద్దంలో పెట్టిన గుడ్డపీలికల్ని లాగుతాడు. గాలివిసురుకి మంచు గడ్డలు వచ్చి ప్రొకోఫీ ముఖంమీద ముసురుతాయి. మళ్ళీ విమాన వ్యతిరేక ఫిరంగులు ప్రేలినధ్వని.)

ప్రొకోఫీ : తాతా ! స్టాలిన్ ఎంతపొడుగుంటాడు ?... చెప్పవు ?

[వృద్ధుడు మాట్లాడడు. పైనించి వచ్చే ధ్వనులు తదేకదృష్టితో వింటూంటాడు.]

ఓల్గా : తాతా ! నువ్వు స్టాలిన్ని ఎక్కడ చూసేవు ?

వృద్ధుడు : వ్యవసాయ ప్రదర్శన మప్పుడు చూసేను. నేనో కొత్తదినుసు పండించేను....(జరిగినదంతా ముసలివాని మనోనేత్రం ముందు ఒక్కసారి ప్రత్యక్షమవుతుంది.) మీటింగుగది చాలా పెద్దది. అక్కడో వెయ్యిమంది దాకావున్నాం. అంతవరకూ గదియేదో వెలితిగా వున్నట్లుంది. కామ్రేడ్ స్టాలిన్ వస్తున్నాడన్నారు. అద్భుతంగా గదంతానిండుగానూ, వెచ్చగానూ వున్నట్లు కనిపించింది.

[కుర్రవాడు కిటికీలో వెనక తిరికి వున్నాడు. అంతా నిశ్శబ్దంగా వింటున్నారు. చతుష్పధం వైపునుంచి స్టాలిన్! స్టాలిన్! అని కేకలు వినిపిస్తాయి. మళ్ళీ కేకలు ఆగిపోతాయి.]

వృద్ధుడు : అతడెంత పొడుగుంటాడా !.... ...మామూలుకంటే ఆట్టే పొడుగుండడు. (విమానవ్యతిరేకఫిరంగులు అంతకంతకి దగ్గరగానూ, బిగ్గరగానూ వినిపిస్తాయి.) ఏమిటిది ? బ్యాండు వాయించడానికి బదులు 'శాల్యూట్' యిస్తున్నారేమిటి ?

ప్రొకోఫీ : (కిటికీ చట్రాన్ని పట్టుకు వ్రేళ్లాడుతూ) పేరాఘాట్లు, తాతా,

పేరాఘాట్లు ! ఆకాశమంతా నిండిపోయింది. తాతా. (కిందికి దుముకుతాడు. ఆరోజంతా బిగబట్టి వుంచిన భావాలన్నీ ఒక్కసారి ఉద్రేకంగా ఉబుకుతాయి. వెక్కి-వెక్కి ఏడుపు ప్రారంభిస్తాడు.) స్టాలిన్! కామ్రేడ్ స్టాలిన్ వచ్చేడు !

[కిటికీబైట అటునిటు పరుగెత్తిన ధ్వని. పేరాఘాటు తాలూకు గులాబీసిల్కు మబ్బులాగ కిటికీని ఓక్షణంపాటు క్రమ్మి వుంటుంది. "ఆ! అల్లాగునన్రా, విషప్పురుగా!" అంటూ యెవరో రైఫిల్ మడమతో కిటికీకి తాపిన చెక్కలు మోదుతాడు. చెక్కలు విడిపోతాయి. అరుపులూ, కేకలు. చాలామంది పగిలిన కిటికీగుండా నేల మాళిగలోనికి దిగుతారు. అందరికీ ముందుగా కొలెస్నికోవ్. ఎవరూ మాట్లాడరు. బైట వెలుతురులోనుంచి రావడంవల్ల ఒక్కక్షణం ఏమీ చూడలేరు.]

కొలెస్నికోవ్ : పైవాళ్లెవరూ లేరుగదా ? (ఓల్గాకి ద్వారం వైపు సంజ్ఞ చేస్తూ) వెళ్ళు. మీఅమ్మను చూడు. (రైఫిల్సుతోవున్న యిద్దరు పార్టిజాన్స్‌కి) పడకల క్రింద చూడండి. పాములు ఏమైనా దాకున్నాయేమో. (ఇద్దరూ చీకటిగావున్న ప్రక్క కొట్టులోకి వెడతారు. రెండో స్త్రీ నిశ్శబ్దంగా ఏడుస్తూంటుంది. కొలెస్నికోవ్ అందరి ముఖాలూ పరిశీలనగా చూస్తాడు.)

కొలెస్నికోవ్ : తలానోవ్!.........ఫియోడోర్! (ఎవరూ పలకరు.)

ప్రొకోఫీ : ముగ్గుర్ని పైకి తీసుపోయేరు. మీరు వాళ్ళనెప్పటికీ కలుసుకోలేరనుకుంటా. (ప్రక్క కొట్టులోనుంచి ఒక స్వరం : "ఆంద్రీ నీటార్చిబైటు ఓసారి యియ్య.........నాకో బురదగొడ్డు దొరికింది. నాచెయ్యి నాకుతూంది కూడాను. రహస్యద్వారం వున్నట్లుంది.")

కొలెస్నికోవ్ : వస్తున్నా !

[వెడతాడు. పెద్దకోటు తొడిగి. దెబ్బతగిలిన చేతిని కష్టంతో రెండో చేత్తో ఒత్తి పట్టుకున్న ఓకుర్ర సైనికుణ్ణి ఓల్గా సమీపిస్తుంది.]

ఓల్గా : కామ్రేడ్ రక్తం వస్తూందా ?

కుర్రసైనికుడు : (దాడిలో పాల్గొన్న ఉద్రేకంతో) ఇల్లాంటి గందర గోళంలో యెవరి వొళ్లు వాళ్ళకే తెలియదు.

[ఓల్గా తొందరగా జేబురుమాలు చింపి, కట్టు కడుతూంటుంది. కుర్రసైనికుడు గది నాలుగుమూలలా కళ్ళతోనే వెతికేస్తూంటాడు.]

వృద్ధుడు : ఏమిటి చూస్తున్నావు. నాయనా ?

కుర్రసైనికుడు : ఏంలేదు. మేము నెలరోజుల క్రిందట తిరోగమిస్తూ న్నప్పుడు ఓముసలితాతని కలుసుకొన్నాము. పాపం, అతన్ని చూస్తూంటే నాకు జాలికలిగింది. మాదళాన్ని వదలి, రోడ్డుపక్క నిల్చున్న తాతదగ్గిరికి వెళ్లేను. "తాతా! విచారించకు. రష్యన్‌లు తిరిగి వస్తారులే. రష్యన్లెప్పుడూ తిరిగే వస్తారు, "అన్నాను. నాదగ్గరున్న కాస్త రొట్టిముక్కకూడ తాత కిచ్చేసేను.

ఓల్గా : (కట్టు కడుతూ) ఆ! అక్కడే. అంతా ఐపోయిందిలే. మోచెయ్యి వంచకు. (కట్టు బిగించి, ముడేస్తుంది.)

కుర్రసైనికుడు : గడిచిన నెలనుంచీ ఆతాతని గూర్చే కలలు వస్తు న్నాయి. కలలో నాకు తాత కనిపిస్తాడు : "తాతా! ధైర్యంగా వుండు. మేం త్వరలోనే వస్తున్నాము. తయారు కావద్దూ, మరి. నిజంగా పిచ్చెక్కితేనేగాని రష్యనులు తయారుకారు. అందుకు కొంచెం టైం తీసుకుంటుంది." అంటుంటాను. నాతో వనం టారా, ఓమాటు మాట అన్నతర్వాత జరిగి తీరాల్సిందే........

(ముందు తూలి పడుతూన్న ఫెయోదిర్‌ని గెంటుకుంటూ ప్రక్క గదిలోంచి పార్టిజాన్‌లు వస్తారు. ఫెయోదిర్ పొట్టి ఖాకీ కోటుతో వుంటాడు. వీరి వెనకే కొలెస్నికోవ్ వస్తుంటాడు.)

కొలెస్నికోవ్ : ఇది బురదగొడ్డా ? అచ్చమైన తెల్లత్రాచు! మీరు మంచి తెలివైన పాములవాళ్లే! (ఫెయూనిన్ ముఖంలోనికి నిర్ఘాంత పోయి చూస్తూన్న కుర్రసైనికునితో) నువ్వు నెలక్రిందట రోడ్డు ప్రక్కని కలుసుకున్న మ[illegible] దొరికేడా ?

కుర్రసైనికుడు : ఆఁ! ఇ[illegible]. (ఫెయూనిన్[illegible]) తాతా! ఇన్నిరోజుల నుంచీ నామనస్సులో నిన్ను గురించే ఆలోచిస్తూన్నా.

[ఫెయూనిన్ మాట్లాడడు. బైటినుంచి డాక్టరు తలానోవ్, అన్నా వస్తారు.]

అన్నా : (బాధ స్వరంలో నే[illegible]క్తమవుతూంటుంది) ఓల్గా....(కుమార్తె భుజంలో ముఖం దాచుకొని నిశ్శబ్దంగా వుంటుంది. కుర్రసైనికుడు ఫెయూనిన్‌ను భుజంతట్టి పలకరిస్తాడు.)

కుర్రసైకుడు : ముసలివాడా! మనం మాట్లాడుకొనేందుకు యిదిగాదు చోటు. (మాటల్లో కాఠిన్యం ఉట్టిపడేలా) బైటికి, మైదానంమీదికి నడు. అక్కడా మనం స్వాగతం యిచ్చుకొనేది........

[ఇద్దరూ బైటికి పోతారు.]

ఓల్గా : (తండ్రితో) అమ్మ చూసిందా ?........అక్కడ!

[తలానోవ్ తలూపుతాడు. ఓల్గా తల్లి ముఖంలోకి చూస్తుంది.]

ఓల్గా : అమ్మా! నీకళ్లు పొడారిపోయేయి. అదేమీ లాభం లేదే. నువ్వు ఫెడ్యాకోసం దుఃఖించవూ ? అమ్మా! అన్నయ్య మనల్ని ఒదిలి వెళ్ళిపోయేడే. చివరికి వాడు మనవాడే అయేడు. మన దగ్గిరికే వచ్చేడు, మనలోనే వున్నాడే, అమ్మా.

అన్నా : ఔనమ్మా! ఫెడ్యా తిరిగొచ్చేడు. నాతండ్రి నాలోనే వున్నాడమ్మా. నా నాయన మనతోనే వున్నాడు.

( నాలుగో అంకం సమాప్తం )

---

